


## విదేశభాషాభ్యసనము

ఈనడుమ కలకత్తావిశ్వవిద్యాలయమువారు మెట్రిక్యులేషను తరగతివఱకును దేశభాషలద్వారా విద్యగఱపుటకు నిశ్చయించిరి. ప్రపంచమున మఱియేదేశపు విద్యార్థులకును లేని పరభాషాదాస్యము భారతదేశవిద్యార్థులనుపట్టి పీడించుచున్నది. కలకత్తావిశ్వవిద్యాలయమువారు దేశభాషలద్వారా విద్యగఱుప నిశ్చయించి ఈదాస్యమునకు పీడ్కోలు పత్రము చదువనారంభించిరనవచ్చును.

మనదేశపు పాఠశాలలను పరికించితిమేని ప్రతితరగతియందును ఆతరగతిఅంతస్తుకు కొఱవడియుండు విద్యార్థులు పలువురుకానవగుదురు. ఇట్టి వెనుకబడియుండు విద్యార్థుల ఉనికివలన ఉపాధ్యాయుని విలువయైన కాలము వ్యర్థముగ వెచ్చింపబడుచున్నది. విద్యార్థులలో "భట్టీయంపద్ధతి" పిచ్చి పెరుగుచున్నది. ఈభట్టీయంపద్ధతికి అలవడినవిద్యార్థులు స్వతంత్రమైన ఆలోచనను చంపుకొనుచున్నారు. వారిఉపజ్ఞ నమసిపోవుచున్నది. దేహారోగ్యమును చెడుచున్నది. దీని కంతకును కారణము అతిబాల్యముననే విదేశభాషావబోధమునకు విద్యార్థులను గుఱిచేయుటయేఅని మనదేశపువిద్యావేత్తలెల్ల అంగీకరించియున్నారు.

పాశ్చాత్యదేశములందును విద్యార్థులకు విదేశభాషాభ్యసనవిధి గలదు. కాని మనదేశమునందువలె అయిదవఏటను, ఆరవఏటను ఆవిధి ఆవిద్యార్థులపై బడదు. పండ్రెండుఏండ్లు దాటువఱకును అచ్చటివిద్యార్థి ఏవిదేశభాషనుగాని చేకొనడు. అంతవఱకు ఆతడునేర్చుకొను సమస్తవిషయములు మాతృభాషద్వారానే. ఇంగ్లండులో ప్రిపరేటరీపాఠశాల (Preparatory school) వదలువఱకు అనగా విద్యార్థికి పండ్రెండవవత్సరము దాటువఱకు విద్యాక్రమమున విదేశభాషకు స్థానములేదు. మనము సెకండరీపాఠశాలలని పిలుచువానిని ఫ్రాంసుదేశమున (Lycee)అని అందురు. అందు విద్యార్థికి పదునొకండవవత్సరము నిండ ననగా విదేశభాషలతో కొంతకొంత పరిచయము కల్పింతురు. జర్మనీదేశమున Dietcha

Overschule అనియు, Reformed Real Gymnasium అనియు రెండురీతుల పాఠశాలలుగలవు. మొదటివర్గమునకు చెందినవి ప్రజలచే విశేషముగ ఆదరింపబడునవి. వానియందు పదమూడేండ్లు నిండినగాని విద్యార్థులకు విదేశభాషలు చెప్పనారంభింపరు. రెండవవర్గమునకు చెందినవానియందు విద్యార్థుల పదునొకండవవత్సరమున ఆంగ్లమును, పదమూడవవత్సరమున ఫ్రెంచిభాషయు ప్రారంభింపబడును. హిందూదేశపుయూరపియను పాఠశాలలయందు నాలుగవతరగతియందు అనగా విద్యార్థికి పదమూడేండ్లు నిండుతరుణమున లాటినుభాష చెప్పుటకు మొదలిడుదురు. ఇట్లు పాశ్చాత్యదేశములందు విద్యార్థుల పరిణితవయస్సున విదేశభాషలు నేర్పుట ప్రారంభింపబడుచుండగా మనదేశమున ప్రాయికముగా ఆరవఏటనే ప్రారంభింపబడుచున్నది. సాధారణముగ మనదేశమున పిల్లలను వారికి అయిదవఏట అయిదవనెలలో అయిదవరోజున వాడుకప్రకారము చదువవేయుదురు. ఎ. బి. సి. డీల ఎన్నెమ్మవారిని ఆనాడే పట్టుకొనును. ప్రభుత్వమువారి విద్యాప్రణాళికయందు ఈదేశపు విద్యార్థులను ఆరవఏటనే పాఠశాలలో జేర్చుకొనవచ్చునని లేఖ్యారూఢమైయున్నది.

రూసో (Rousseau) మహాశయుడు తన 'ఎమిలి' గ్రంథమున విద్యార్థికి పండ్రెండువత్సరములు నిండులోపున విదేశభాష బోధించుటను తీవ్రముగ నిరసించియున్నాడు. ఇట్లు నిరసించుటకు అతడాగ్రంథమున చూపినకారణములు బహుచిత్రములుగానున్నవి. మన స్తత్వశాస్త్రము ననుసరించి అవి ఎంతవఱకు ఆరూఢములో మేము చెప్పజాలము. పండ్రెండుఏండ్లు నిండువఱకు మానవునకు స్వతంత్రాభిప్రాయము, సాదృశ్యనిరూపకశక్తి గలుగదని అతని వాదన. సాదృశ్యనిరూపకశక్తిలేనివాడు అన్యభాషను గ్రహింపజాలడు. కొన్నిపదములను, కొన్నివాక్యములను కంఠస్థమొనర్చుకొని చిలుకవలె వానినేపలుకును. అర్థసారస్యమును పుట్టింపజాలడు. కావున పండ్రెండువత్సరములకులోపున మానవునకు విదేశభాషలు నేర్పుట అతని మనస్సునకు ఆరోగ్యభంగకారియగు పరిశ్రమను కల్పించుటయేయగునని రూసో నిరాఘాటముగ చెప్పుచున్నాడు. రూసోయొక్క ఈ అభిప్రాయమెంతవఱకు మన స్తత్వశాస్త్రజ్ఞులంగీకరింతురో మేము చెప్పజాలము కాని నాగరికతాశిఖరము నధిష్ఠించియున్న అన్నిదేశములందును విదేశభాషలబోధనము విద్యార్థులకు పండ్రెండువత్సరములు నిండినగాని ప్రారంభింపబడుటలేదు. మనదేశస్థితి ఈవిషయమున అనేకఇతరవిషయములందువలెనే మిక్కిలి అధ్వాన్నముగనున్నది. ఈవిషయము మనవిద్యాధికులు గుఱించి చాలకాలమైనది. అది వాదస్థితినిదాటి నిశ్చితస్థితికివచ్చినది. కాని ఆచరణలోకి వచ్చుటకు సూచనలు మాత్రము విశేషముగ చూపట్టవు. కలకత్తావిశ్వవిద్యాలయమువారినిశ్చయము ఆశాలేశమును రేపుచున్నది. భారతదేశమునందలి ఇతరవిశ్వవిద్యాలయములవారుగూడ ఈ విషయమై సాధ్యమైనంత త్వరలో చర్చించి మాతృభాషద్వారా విద్యగఱపుపద్ధతిని చేకొందురేని దేశకళ్యాణమునకు నిజమైనపునాదులువైచినట్లగును.

## ఘోరప్రతిజ్ఞ

ఊటుకూరు సత్యనారాయణరావు బహద్దర్ గారు

అతడు ధనంజయుండు సకలావనిపాలకిరీటమాణిక
ప్రతతులు పాదపీఠముగ భాసిలుభారతచక్రవర్తి, ఈ
గతి పడియుండెనేల తనగాండివమొక్కెడ పారవైచి, సం
తతపరిముక్తబాష్పనయనమ్ములు తేలగవైచి ధూళిలో?
ఇది యుత్పాతముకావలెన్ జగతి కింకేలా? ఇతం డల్గినన్
త్రిదివాధీశుని చీరికింగొనడు సందీప్తోగ్రగాండీవము
క్తదవాగ్నిచ్ఛటకాలకేయరిపుసంతానంబు మండించి స
మ్మదుడై నట్టి ధనుష్మదగ్రణి, రణోన్మాదుండు—సామాన్యుడే!

నిలచి అట్టులే సేవకుల్ తలలువంచి
ఖిన్నులు హజారములయందు నున్నవారు
మిన్ను విరిగిన కలగని మేటికృష్ణ
డామహాధైర్యరాశి, నేత్రాంతికముల
శోకము కుదించుకొని నేల చూచుచుండె.

కొడుకా! నన్విడిపోయినావె! యని ఆక్రోశించె మెల్లత్తి; అ
ప్పుడు పాషాణములన్నియున్ కరగెనో, భూదేవికిం బుల్కలే
ర్పడెనో, వాయువులాగిపోయినవో, ఔరా! క్రీడి దుఃఖానకున్
తడబాటుం ద్రవయున్ రసాస్పదుల హృద్వ్యాపారముల్ మాన్చెనో.

బొమలుముడియించు దూరముపోయి శోక
భారమున నిశ్వసించు దుర్భరముగాగ,
పార్థ! నీకేమిపిచ్చియేర్పడెన? యిట్లు
వగచునే ధీరుడెవాడు? భౌతికమ్ము
కేవలనిమిత్తమని వాసుదేవు డంక
మందు జేరిచి తెల్పె దేహప్రసక్తి.

వినలేదొక్కటి క్రీడి, ధర్మజునకై వీక్షించి నీపాదముల్
మనమందెప్పుడు గొల్చునాకిటుల సంప్రాప్తించునే దుఃఖ మే
మని జీవింతును, మొండిదేహ మిది, సద్యఃపాతనిర్ఘాతసం
జనితోద్వేలదవానలంబు నను వ్రేల్చున్ రాదో ఘోరాకృతిన్?.

మసలుచు కృష్ణుని బాహుల
బుసవెట్టుచు కండ్లమెరుపుపూర్ణముగాగన్
వెసచెమ్మట గ్రమ్మగ వా
డసితచ్ఛవులెసగు భీషణాహియువోలెన్.

అతిరభసాతిరేకభయదాకృతినేత్రకషాయరేఖలో
తతలయకాలచిహ్నవికృతత్వములేర్పడ, పుత్రశోకబా
ధితపరిభుగ్నభ్రూకుటి మదించినయేనుగనై పునఃపునో
ద్ధతఘనదేహయష్టిని విదల్చుచుకృష్ణుని, బల్కె నీగతిన్.
కనుపుందుఃఖము కాల్చుచున్నయది మూర్ఖా! సైంధవా! నన్ను ఎ
వ్వఁడో సామాన్యుడుగా దలంచితివో, దుర్వారాహవక్షోణి ని
ల్వఁడ, ద్రోణుండును కర్ణుడున్ కృపుడు; గెల్తున్-ఎల్లి సూర్యుండు క్రుం
కడు వెన్నంటుచు నిన్నుచంపువరకున్ గాండీవతీవ్రాస్త్రముల్.
ఏను జగత్ప్రసిద్ధుడగు కృష్ణునిభక్తుడ, ధర్మసూతికిన్
మానని పాదసేవకు డమానుషవిక్రము డన్నపేరు, ఏ
మైనయగున్ వధింపన, మహానలకీలలు గ్రమ్మకోగ అం
దేనును పుత్రువోలె మగణింతును తప్పదు గాండీవమ్ముతోన్.
జలజాక్షుం డపు డర్జునా! యనుచు నైశ్చల్యంబుజూపించె, కౌ
గిలిజేర్చన్ యమసూతివోయి అట నాగెన్; భవ్యసంధ్యానట
జ్జలదవ్రాతము పుల్కరించు మెఱపున్ స్వచ్ఛందమార్గమ్ములో
పల వర్షించెను పుష్పవృష్టి భవితవ్యప్రాప్తి సూచించుచున్.

## వియుక్తి

దృష్టికందని యేయనాదినో జనించి
ప్రాఁతగిల్లినవాఁడు జైవాత్మకుండు;
ఆసుధాహాస మెప్పటికపుడెక్రొత్త,
ఆమధురశోభ యెప్పటికపుడె హాయి.
చిరపరస్పరసంగతస్నేహభావ
పరిచితమ్ము భవన్మనోహరముఖమ్ము
మృదులమధురంబు లానవ్వు లెంతకాల
మనుభవించినఁ దీరదుతనివిచెలియ!
ఈపురాణప్రకృతిలోఁ గవీశ్వరులకు
నిత్యనూతనకళలె కన్పించుచుండు
ముగ్ధమోహనమైన నీమూర్తిలోనఁ
బ్రతిదినమునాకుఁ గ్రొత్తసంపదలెతోఁచు.
సకియ! నాతోడఁ బ్రేమప్రసక్తి నీవు
హాయిగాఁగడుపుకొను చాంపేయమల్లి
కాగులాబీప్రసూనసౌగంధ్యబంధు
రమ్ములగు నీవసంతదినమ్ములందు;
అప్రయత్నంబుగాఁ బల్లవాధరములె
యభ్యసించినవో మందహాససంజ్ఞ;
అనభిలషితంబుగా నయనాంచలములె
యలవరచుకొన్నవో మృదువలనసంజ్ఞ.
కడచినది యెంతకాలమోకాని, రెప్ప
పాటునంబోలె మనయాటపాటలందు;
ఇన్ని దినముల యానందమెల్లనింకఁ
దలఁచి మాటాడుకొంద మాతలఁపులందె.
పెదవిమీఁద నాచెలువమ్ము విరియలేదు;
కన్నుఁగొనలనాయందమ్ము కదలలేదు;
పూలుదీయక యాటు తెల్లఁబోయెదేల?
సకియ! యీవియోగమ్ము శాశ్వతముగాదు.

వేంకటకాళిదాసకవులు

# యారమ్మ

అరవ వేంకటస్వామి గారు

౧

"బాబూ! గవరయ్యోరూ! గవరయ్యగోరూ!"

"బాబూ! గవరయ్యగోరూ! గవరయ్యగోరూ!"

[లోపలనుండి] "ఎవరురా వారూ?"

"నేనుండి. ఎంకణ్ణండి. ఓసారి తలుపు తెరుండి."

[తలుపుచాటునుండి] "ఎందుకురా అయ్యోరు?"

"నాపిల్ల యారమ్మకి వారంరోజులనుంచి జరం అండి. మూసినకన్ను తెరవడంలేదండి. కటికలంకణాలు కట్టించినా తగ్గనేలేదండి. పైగా పరాకుమాటలుకూడా మొదలెట్టినదండి. అయ్యగారికడకే మందుకొచ్చానండి."

రంగమ్మ యివతలకితొంగిచూసి "పదకొండుగంటలయింది, ఆయనయింకా గుళ్ళోనేఉన్నారు. ముందు నాకుకనబడి నామడితగలపెట్టావు. నీమొహమ్మండా! మాలపీనుగవి. ఆమాత్రం తోచకపోయింది, భోజనాలవేళ బ్రాహ్మలవీధికి వెళ్ళకూడదని? ఇప్పుడుమళ్ళీ స్నానంచేసి తగులడాలి. అసలు వంట్లో బాగా లేదారుమ. పో. అవతలకి." అని తలుపుగట్టిగావేసుకొని లోపలికి వెళ్ళిపోయింది.

వెంకన్న కేమీ పాలుపోయిందికాదు. అమ్మగారే యిలా తిడితే అయ్యగోరు మరెట్లాఅగ్గిఅయిపోతారేమోనని అక్కడనుండి వెళ్ళిపోవటానికి అతగాడి మనస్సు ఒప్పటంలేదు. ఉన్నదిఈరమ్మ ఒక తేపిల్ల. ఆపిల్లనుకని తల్లి పరమపదించింది. అప్పటినుండీ వెంకన్న ఎంతో ప్రేమతో కష్టపడి పెంచాడుయారమ్మని. పదమూడేళ్ళవయస్సాపిల్లకి. రజస్వలయింది. ఇంకా పెళ్ళికాలేదు. ఏదోకొంచెం చదువుకున్నవాడికిద్దామని అతడిఉద్దేశం. పాపం, అయారమ్మకే యిప్పుడు జ్వరంవచ్చింది. వారంరోజులనుంచి వెంకన్న కూతురు ఆరోగ్యవతికావడంకోసం వేయిదేవుళ్ళకి మొక్కుకుంటున్నాడు. అమ్మవారు పనుములమ్మకి చేటపోతునిస్తానన్నాడు. గనిపోతురాజుకి నాలుగు కోళ్ళనికోస్తాననుకున్నాడు. ఇంతకీ నందమూరు కుగ్రామం అవడంవల్లా, ఆఊళ్ళోఉన్న పూజారి గవరయ్యగారుతప్ప యింకెవరూ వైద్యులులేకపోవడంవల్లా విధిలేక వారంరోజులు ఊరుకుని, యింక ఉపేక్షచేస్తే తనకూతురు తనకు దక్కదని భయపడి బ్రాహ్మణవీధిలో కాపురంఉన్న పూజారిగవరయ్య గారికోసంవచ్చాడు.

పాపం. వారంరోజులనుంచీ ఒక్కకానీఅయినా సంపాదనలేదు. రోజూ జోళ్ళు ఒకజతకుట్టి, కొవ్వూరు తీసుకువెళ్ళి, సాయంత్రందాకా తిరిగి, అజోడులో వచ్చేలాభం, ఏపావలాతోనో నూకలుతీసుకొస్తే అప్పుడుయారమ్మ గంజికాచియిచ్చి, తానింత త్రాగుతుంది. ఒక్కొకనాడు చెప్పులజోడు అమ్ముడుకాకపోతే ఆనాడు ఏపొరుగింటివానినో అప్పుఅడిగి కాలక్షేపంచెయ్యవలసిందే. యారమ్మకి జ్వరంవచ్చినతరవాత ఏరెండురోజులో వెళ్ళాడు కొవ్వూరు. అంతే. సంపాదనలేక తిండికి ఓమూలయిబ్బందిపడడం, ఓమూల యారమ్మ పరాకుమాటలు-పాపం వెంకన్న హృదయాన్ని దుఃఖంతో నింపి, క్రుంగదీసినై.

మధ్యాహ్నంఅయింది. ఎంతకూ గవరయ్య కోవెలనుంచి యింటికిరానందున అక్కడికేవెళ్ళి బ్రతిమాలి, మందుతీసికొని వెడదాము అనుకొని గుడివీధికి బయలుదేరాడు. కోవెలకిమున్నైనలభై గజాలదూరంలో ఉండగానే శివాలయంలోనుండి పండ్లతో నిండిన మూట భుజానవేసుకొని, డబ్బులతో నిండినపళ్ళెం చేతిలోపట్టుకొని, "హరహరమహాదేవ" అనుకుంటూ యీవలికివచ్చి, దూరానఉన్న వెంకన్నను చూచి "ఒరి నీదుంపతెగా! నీయిల్లువల్లకాడుగానూ! దిక్కుమాలినపీనుగా! ఇలా బ్రాహ్మణవీధికి తగులడినావేమిరా? స్వామివారికి అమంగళం అయిపోయిందిరా. ఇప్పుడు మళ్ళీప్రోక్షమంత్రం చేయించాలంటే కాశీవెళ్ళి వెయ్యిరూపాయలు కర్చుపెట్టాలి. ఛో. ఛో. నీకేం పోయేకాలంవచ్చింది?" అని గుక్కత్రిప్పకుండా ఉరిమేడు.

దీనవదనంతో, దుఃఖాశ్రువులతో నిండిఉన్న కళ్ళతో మెల్లగా వెంకన్న "బాబయ్యగోరూ! పొద్దుటి

నించీ గంజినీళ్ళైనా త్రాగలేదండి. మాయీరమ్మకి తగనిజ్వరంవొచ్చింది. కూంతమందిప్పించండయ్యోరు. తమపాదాలకి లచ్చదండాలు పెడతాను." అన్నాడు.

"ఛీ. నీ మొహం యీడ్చా. నామడి మంట కలిపిన మాలకుంకవి నీకుమందూ, మాకూయిస్తావా? ఫో. అవతలకి."

"బాబుగోరూ! తమర్ని బతిమాలుకుంటాను. ఒక్కై రక్కుండా ఉన్న నాపిల్లని తమరురచ్చించకపోతే ఎవరు రచ్చిత్తారు బాబూ!"

"నిన్ను తగలెయ్యా! ఇంకాపిండాకుడు ఏడవకుండా నీకు మందెలాయిస్తాన్రా. ఇప్పుడు స్నానంచేసి తిగులడాలి. ఫో. రాత్రిరా. చూదాం. ఫో. దూరంగా తొలగు."

ఇలాఅని గవరయ్య చరచర వెళ్ళిపోయాడు. విచారంచేత బరువైన హృదయంతో వెంకన్న మాలపల్లెకు వెళ్ళిపోయాడు. యీరమ్మ ఒక త్రీ చింకిరిచాపమీద పండుకొని ఉన్నది.

"అమ్మా! అమ్మా!"

యీరమ్మకి మాట్లాడడానికికూడా ఓపికలేదు. మాగన్ను పడింది. వెంకన్న కూతురు స్థితి చూసి, పూజారి కాఠిన్యము తలచుకుంటూ వెక్కి వెక్కి చిన్నపిల్లవానివలె ఏడ్చినాడు. ఎంతసేపు అట్లావిలపించినాడో అతనికే తెలీదు. ఏడ్చి ఏడ్చి ఆకటిమంటచే దహించబడుతూఉన్న చిత్తంతో అతడు నేలమీద మేనువాల్చినాడు. పాపం. దుఃఖాతిశయంవల్ల ఏడ్చి ఏడ్చి, నిద్రపోయి వెంకన్న లేచుసరికి సాయంత్రం ఆరుగంటలయింది. రక్తవస్త్రాలుధరించిన సూర్యుడు పశ్చిమాచలముచాటుకు వెళ్ళిపోయినాడు.

అగుడిసెలోనికి గాలిగాని వెలుతురుగాని ప్రవేశించడానికి లేశమయినా అవకాశంలేదు. ఒక చింకి విసనకర్రతో వెంకన్న చెమటపట్టిఉన్న యీరమ్మకి విసిరినాడు. ఏడుగంటలయింది. మందుకోసం బయలుదేరాడు మళ్ళీ.

౨

ఆనాడు శనివారం. దసరాకు కాలేజీ సెలవు రోజులు కనక రామారావు రాజమండ్రినుండి నందమూరు వెళ్ళాడు. అతనికి తండ్రిలేడు. తల్లీ, ఒక వితంతు సోదరీ, తమ్ముడూ ఉన్నారు. అతడు బి. ఏ., చదువుతున్నాడు. విశేషభాగ్యవంతుడు. ప్రజాసేవ ఆదర్శంగాగల యువకుడు. బి. ఏ., పూర్తిచేసిన తరవాత ప్రజోపయోగకరములైన కార్యాలెన్నో చేయ సంకల్పించిఉన్న ఉదారహృదయుడతడు.

అతనియింటికెదురుగానే ఉన్నది గవరయ్యగారి యిల్లు. రామారావు భోజనంచేసి, వీథిఅరుగుమీద కూర్చుని పత్రిక చదువుతున్నాడు. రాత్రి ఎనిమిది గంటలై ఉంటుంది. గవరయ్యకేకలు వినిపించగా, రామారావు చదువు ఆపి విన్నాడు.

"ఛా. ఛో. రాత్రి మందెలాయిస్తాననుకున్నావు? మాగన్ను పడినపిల్ల బ్రతకదంనున్న. ఏచింతామణిలాంటి దివ్యౌషధమైనా యివ్వాలి. ఖరీదైన ఔషధం యివ్వను. పైగా మాలపీనుగవు. నీకసలివ్వను. మీమాలాన్ని మాఆచారం అంతా అడుగంటిపోతూంది."

రామారావులేచి గవరయ్యగారియింటికి వెళ్ళాడు. వెంకన్న దూరంగా నిలబడిఉన్నాడు—

"బాబయ్యా! ప్రభువు లలా సెలవిస్తే ఏంజెయ్యను? పిల్లదాన్ని బతికించండి బాబూ! ఏదైనా చెప్పుల తోడుకుట్టి తమరికిచ్చుకుంటానండి. బీదోణ్ణి."

"ఛీ. నీతో దేవడికావాలిరా? నిర్భాగ్యుడా! మీమాలాళ్ళని తవ్వి పాతరేసినా పాపంలేదు. మీద మీదకొచ్చి దూరంగాఉండరా అంటే, 'అయ్యబాబో! ఆకారంకాలేను. గాంధిమహాత్ముడేటి చెప్పాడు?' అని తెగనీలుగుతున్నారు. బ్రాహ్మల యింట్లో భోంచెయ్యండిఅని ఆగాంధిమహాత్ముడు మాత్రం ఎలాచెప్పాడో! కలియుగం. వర్ణసంకరం జరుగుతుందని వ్రాయబడేఉంది. ఏం! హడావిళ్ళు. రాజమండ్రంలో ఎవరెవరో బ్రాహ్మలూ, కోమట్లూ మాలకూడు తింటున్నారట. వాళ్ళనీళ్ళు త్రాగుతున్నారట. దేశానికి ప్రళయంవచ్చింది. పైగా సుళ్ళోకివస్తాం అంటూన్నారుకూడాను."

రామారావు యింక ఉండబట్టలేకపోయినాడు. ఇలాఅన్నాడు.

"గవరయ్యగారూ! ఒకనిమిషం నామాటవినండి. గాంధిగార్ని గురించి మీరు విశేషంగా దురభిప్రాయపడుతున్నారు. ఆయనతత్వాన్ని మీరు కొంచెమైనా గ్రహించలేదు. గ్రహించలేరుకూడాను. మాలవాళ్ళని అనకండి. ఆపదం వినడానికే యింపుగాలేదు. మహాత్ముడు "హరిజను" లన్నాడు. ఆపేరు ఎంతముద్దుగా ఉన్నది? మహాత్ముడు భోజనప్రతిభోజనాలు నిర్ణయించలేదు. వాళ్ళని నీచంగా హీనంగా చూడవద్దన్నాడు. కూడలిస్థానాల్లో ఉండేబావుల్లో నీళ్ళు తోడుకోనివ్వమన్నాడు. ఛో. ఛో. అని కసరికొట్టవద్దన్నాడు. దేవాలయప్రవేశానికి నిరోధం కలిగించవద్దన్నాడు అస్పృశ్యులకి. రాజమండ్రిలో ఎవరెవరో ఏదోచేశారన్నారు. భోజనప్రతిభోజనాలు చెయ్యలేదు. కాని యిష్టంఉన్నవాళ్ళు చెయ్యవచ్చు. నూతుల్లోనీరుతోడించి త్రాగినారు. దానిలో తప్పేమీలేదే. పూర్వంఅయినా అస్పృశ్యులని ఏదైనాఒక వర్ణం ఏర్పరచలేదే మీశాస్త్రజ్ఞులు. జాతిమతభేదం ఉండకూడదని, విశ్వమానవసౌభ్రాత్రం ఉద్బోధిస్తూన్నగాంధిమహాత్ముని తత్త్వంగ్రహించి అనండి, ఏమాటలన్నాను. ఖండాంతరవాసులైన విద్యాధికులే ఆమహామహుని చిత్తంగ్రహించలేక తబ్బిబ్బవుతూంటే మీరు, నేనూ ఒకలెక్కా? మతావేశపరుడై, మానవకల్యాణానికి పాటుబడ్డానికి మహాత్ముడు అపూర్వమైన త్యాగంచేశాడుకాదా? ఆజితేంద్రియుని నిరశనప్రాయోపవేశదీక్షకు ఫలంగా ఒక్కసారి భారతభూమి నావరించిఉన్న అజ్ఞానాంధకారం పటాపంచలైపోయిందే? అసాధారణమైన సంచలనం కలిగిందే? అస్పృశ్యతఅనేది మటుమాయమైపోయిందే!

ఏం? నిమ్నజాత్యుద్భవులుమాత్రం మనుష్యులు కారూ? వాళ్ళ తక్కువేమిటి? మనయెక్కువేమిటి? పరమేశ్వరుని విశాలదృష్టిలో మనమందరమూ సమానులమే. దేవాలయప్రవేశానికి మనం హక్కుదారులమా? వాళ్ళు ఆలయము సమీపించడానిక్కూడా వీల్లేదూ? ఏంస్వార్థపరత్వం? అందుచేతనే ఎవరు ఏంచేసినా ఊరుకుని దేశానికి యీ మహా అల్లకల్లోలం తెప్పించారు. మనదేశంలో అస్పృశ్యుల్లో ఎంతమంది భక్తులులేరు? నందుడస్పృశ్యమహర్షి కాడా? పాండురంగవిఠలునిదర్శనభాగ్యమందిన కామేళుడస్పృశ్యమహర్షి కాడా? శ్రీకృష్ణచైతన్యుని ప్రియశిష్యుడై విష్ణుసాన్నిధ్యమునొందిన హరిదాసుఅస్పృశ్యమహర్షి కాడా? ఒక్కసారి నేత్రాలు విప్పిచూడండి. ఆసేతుహిమాచలపర్యంతము మహాత్ముని కీర్తికాంత అస్పృశ్యతానివారణధ్వజంలో స్వేచ్ఛావిహారము సల్పుతున్నది! మహాత్ముని దివ్యబోధదిగంతరాళములలోకూడా వీణారవమువలె ప్రతిధ్వనిస్తూన్నది.వినండి. ఆధ్యాత్మికదృష్టితో చూస్తే మహాత్మునివంటి మతావేశపరుడు, మానవాతీతుడు ప్రపంచములో ఎక్కడా లేడని మీరే తెలుసుకోగలరు.

బాబూ! లెండి. అతడు అస్పృశ్యుడనే భేదభావం విడిచిపెట్టి, ఒక్కసారి దయచెయ్యండి. ఆపిల్లకిమందియ్యండి."

"అబ్బా! ఎంతఉపన్యాసం యిచ్చావయ్యా, కష్టపడి. బాగానేవుంది. కాని, నేనామాలపల్లెలోకి రాను. ఖరీదైనమందు ఊరికేయివ్వను."

గవరయ్య స్వార్థప్రవృత్తిచూచి రామారావు అసహ్యించుకొన్నాడు.

"వెంకన్నా! నడు. నేను వస్తాను." అన్నాడు.

వెంకన్న రామారావు తనపాలిటి భగవంతుడనుకున్నాడు. రామారావు వెంకన్న పూరింటిలో ప్రవేశించినాడు. ప్రమిదదీపపు మినుకుమినుకుమనుకాంతిలో అతడు స్మృతిహీనయై చింకిచాపమీద పడుకొనిఉన్న యారమ్మనిచూశాడు. అకారణమైనప్రేమతో నిండిపోయిన దాతనిమనసు.

ఆమెప్రక్కనే కూర్చుండి నాడిపరీక్షించాడు. ఒక్కనిట్టూర్పువిడిచి "వెంకన్నా! కొవ్వూరువెళ్ళి డాక్టరు లక్ష్మీపతిని తీసుకువస్తా" నన్నాడు.

"బాబూ! చీకటిలో—"

"మరేంభయంలే" దని రామారావు బయలుదేరాడు.

3

నీలనీరదాచ్ఛన్నమై ఉన్న అంబరతలమునుండి వర్షము కురియసాగింది. మిట్టపల్లాలతో నిండిన చేల

గట్లననుసరించి, ఆగభీరాంధకారసముద్రం యీదుకుంటూ రామారావు వెళుతున్నాడు. గింగురుమను శబ్దం చేస్తూన్నవి కీచురాలు. తూలుతూ, పడుతూ, లేస్తూ రామారావు ఆపెనువర్షంలో తడిసి ముద్దయిపోయి, వెళుతున్నాడు. భయంకరంగా అప్పుడప్పుడు దిక్కులు భేదిస్తున్న ఉరుములు. మెరుపులే అతనికి మార్గం చూపిస్తున్నవి. అంతకష్టపడుతున్నది పాపం అనాధ బాలిక—అస్పృశ్యబాలిక అయిన యీరమ్మకోసం విశేషంగా ప్రయాసపడి రామారావు కొవ్వూరుచేరి లక్ష్మీపతిగారి గృహానికివెళ్ళి తలుపు తట్టినాడు. డాక్టరుగారి భార్య కిటికీతలుపుతీసి, "డాక్టరుగారు మధ్యాహ్నంబండికి కాకినాడ వెళ్ళారండి." అని చెప్పింది.

రామారావు నిశ్చేష్టుడైనాడు. అతని మొగము వెల్లబారింది. హృదయం దుఃఖాతిశయంచేత కరడు కట్టుకుపోయింది. ఉస్సురని ఒక దీర్ఘనిశ్వాసంవిడిచి, తిరుగుముఖంపట్టినాడు. ఆమహాంధకారంలో—అతి భయంకరవర్షంలో—జలధరగంభీరగర్జనాలు శ్రవణపుటాలు భేదిస్తుండగా నిర్భీతహృదయంతో నంద మూరుచేరాడు. అతనిహృదయం, దృష్టి సర్వమూ యీరమ్మని—మృత్యుదేవతచే కొన్నిగంటలలో కొనిపోబడడానికి సిద్ధంగాఉన్న యీరిమ్మని రక్షించడంమీదనే కేంద్రీకృతమై ఉన్నవి.

రామారావు తిన్నగా గవరయ్యగారి గృహానికి వెళ్ళి తలుపుతట్టి పిలిచాడు. పదిసార్లు కేకలువెయ్యగా తలుపుతీసి "ఆమాలపిల్లకోసం నువ్వు బాధపడ్డం చాలకా యేమిటి నన్నుకూడా చంపుతున్నా"వని విసుక్కున్నాడు.

"అయ్యో! అల్లావిసుక్కోకండి. మీకు ఏమైనా సమర్పించుకుంటాను. దివ్యౌషధం ఇవ్వండి."

"పాతికరూపాయలిస్తే యిస్తాను."యిదేసమయం అనుకున్నాడు గవరయ్య అర్నెల్లసంపాదన ఒక్కసారే అతనిదగ్గర గుంజుకుందామని.

రామారావు తల్లినిలేపి తనపెట్టినుండి లెక్కతీసుకువచ్చి అయిదు అయిదురూపాయల నోట్లుయిచ్చాడు. అవిచూడగానే గవరయ్య నేత్రాలు ఆనందోత్ఫుల్లములైనై.

లోపలికివెళ్ళి చింతామణియిచ్చి, "దీనికంటె మరణావస్థలోఉన్న ఆపిల్లను బ్రతికించే మందేలేదు" అని తలుపువేసుకున్నాడు.

రాత్రి ఒంటిగంటదాటింది. రామారావు త్వరితంగానడచివెళ్ళాడు వెంకన్నయింటికి.

కన్నీరు కాలువకట్టేట్లు ఏడుస్తూన్న వెంకన్నను హెచ్చరించి, రామారావా ఔషధం బహుకష్టంమీద ఆమెచే మ్రింగించాడు. నీరసంగాఉన్న వెంకన్నని నిద్రపొమ్మన్నాడు. రెప్పవాల్చకుండా కూర్చున్నాడు రామారావు.

ఆహా! ఆ అస్పృశ్యబాలిక అంటే అతనికి ఎంత దయ?

అరుణోదయమయింది. తూర్పుకొండనుండి సూర్యుడు తొంగిచూస్తున్నాడు. యీరమ్మకళ్ళు తెరిచింది. మెల్లగా "బాబూ!"అంది. రామారావు ఉలికిపడ్డాడు. "వెంకన్నా! వెంకన్నా! లే. పరుగెత్తు. ఇదిగో పావలా. వెళ్ళి పాలుతీసుకురా. కొంచెంత్రాగిద్దాం" అన్నాడు.

వెంకన్న పరమానందభరితహృదయుడై పరుగెత్తాడు. రామారావునిచూసి యీరమ్మ భయంతో "మా బా బేడీ?" అంది.

"మీబాబు పాలకివెళ్ళాడు. అట్టే మాటలాడకు. ఆయాసపడవద్దు."

వెంకన్న పాలుతెచ్చాడు. రామారావు మెల్లగా ఆమెనులేవదీసి కూర్చుండబెట్టి పాలుత్రాగించాడు. వెంకన్న రామారావు పాదాలపైపడి "బాబూ! తమరు మాపాలిటి భగమంతులు. నన్నురచ్చించారు." అన్నాడు.

రామారావు వెంకన్ననులేవదీసి "ఇవిగో పాతిక రూపాయలు. కావలసినవన్నీ కొనుక్కో. నీకూతురుకుతగిన సంరక్షణచెయ్యి. నేను సాయంత్రం వస్తాను."

అని రామారావు యింటికివెళ్లాడు. గవరయ్యగారింతలో రామారావు తల్లితో రాత్రిజరిగినదంతా చెప్పాడు. ఆమెకు కోపంకలగలేదు. పైగా కుమారుని మెచ్చుకున్నది. రామారావు తడిసిఉన్న బట్టలువిప్పి కాల్యకరణీయాలు నిర్వర్తించుకొని, స్నానంచేసి కాఫీత్రాగి నిద్రపోయినాడు.

# మానవతి రమణమ్మ

ఓలేటి సీతారామమూర్తిగారు

[వెలమపౌరుషప్రదీప్తులు దండడింప బొబ్బిలీశ్వరుఁడు రంగారావు ప్రత్యర్థియగు విజయరామరాజు నెదుర్కొనెను. నాఁటిఘోరసమరమున నాతఁడు బొబ్బిలికి రానున్న యాపద నెఱింగి నరసారాయనింబిలిచి తనకరవాలంబు నతనికొసంగి యంతఃపురమహిళాసంఘమును మానసంరక్షణార్థము వధింపుమని యాజ్ఞాపించినాడు. నరసారాయఁడు శుద్ధాంతముఁజొచ్చి యొకరిద్దరు నారీమణుల కుత్తుకలను గటారితో ఖండించినాఁడు. పిమ్మట ధర్మారాయనియర్ధాంగి రమణమ్మ కడకరిగెను. నెలలునిండిన యామాలాలిని తనకరకుకటారునకు బలిసేయ సాహసింపక యాతఁ డద్దానిని వీడి యుద్వృత్తుఁగ నేలఁగూలెను. అప్పుడు మానవతీలలామయగు రమణమ్మ యిట్లుపల్కెను.]

"మైనవఘుర్మబిందుతతి మ్లానితదృశ్యమొసంగుచుండ, నీ
యానననీమయందు లవమైనను దోఁపకయుండగా జపా
శోణితరాగరేఖక, వసుంధర ఖడ్గముజార్చి యశ్రుసో
ఖానయనమ్ములన్ నరసరాయఁడ! మిన్నకచూచెదేలొకో?
మానితశౌర్యలక్ష్ము లసమానబలాఢ్యులు, స్వీయకీర్తితే
జోనిధు లెల్లెడన్ విజయశాసనముల్ విలిఖించి వాసిఁ బెం
పూనుచునుంద్రు జెట్టులయి యుర్వి సదా మనవెల్మవార ల
య్యా! నుతధైర్యమూర్తి! యిటులక్కట! కొందలమందఁ బాడియే?
మానితసత్త్వశాలివి, యమానుషవిక్రములైన శత్రుసే
నానులగుండెగాలము వనారతధీనిధి! నీవొనర్పఁగా
నూనినకార్యమే మఱచి యూరక కన్నుల నశ్రులూర శో
కానలదగ్ధమూర్తివగు టక్కట! ధైర్యముఁ బూన్కిఁ బూనుమా!
రావునృపాలు నానతి శిరమ్మునఁ దాలిచి ఖడ్గపాణివై
యీవరరాజహర్మ్యముల స్వేచ్ఛదలిర్చెడు కామినీతతిన్
కేవలమానసంజనిత నిత్యయశస్వినులంబొనర్చి స్వ
ర్గావనిఁ జేర్ప సత్కృపఁ గటా! యరుదెంచియు జాగిదేలొకో?
స్థిరధైర్యోద్ధతచిత్తవృత్తి మహితస్త్రీరత్నముల్ గొందరా
కరవాలంబున దివ్యమోక్షపద మాకాంక్షించి తారేగి నా
ధరిహాస్తంబునఁ జిక్కనోపుదునె? లెమ్మా! ఖడ్గముంగొమ్మ యో
నరసారాయఁడ! యస్మదీయమగు కంఠంబిద్దె ఖండింపుమా!
సంతతశీతలంబులగు ఛాయలయందు హసించుచుండు కుం
జాంతరవాటికాసుమములట్లు సుఖించెడు వెల్మవీటి శు

ద్ధాంతపురంధ్రిసంఘములు దారనితాంతకులాభిమాన సు
స్వాంతలు ప్రాణముల్ విడువ సంశయమొందరు మానరక్షకై.

మానమె మామకీననవమండనమై భువనార్ద్రిహృద్యస
న్మానితమై, గుణప్రతతి మానుగ మిన్నయి, కీర్తిదేవతా
హ్వానమునై నిరంతరము భాసిలు; మానములేని చానకున్
జ్ఞానవిలాస మేమిటికి? సంపద లేటికి? ప్రాణ మేటికిన్?

దురితపంకచ్ఛటాక్షమాదూష్యదృశ్య
నిత్యహేయక్షణికభోగనిచయకలిత
కలుషవాంఛాప్రపూరితకాయ మేను
సరకుసేయఁ బాతివ్రత్య సరణినెంతు.

*   *   *

మామకీనాత్మగౌరవమహితలక్ష్మి!
జెలగువాడిమిఁ గావవచ్చిన కటారి!
ఈవిధి నుపేక్ష సేయఁగానేల యకట!
భావచాపల్యసంభృతస్వాంత వేమొ!!

*   *   *

వార్ధిగర్భోరుభూధరపతనజనిత
ఘూర్ణితస్వనసదృశమై కోటగోడ
పురముపరిఖాంబువులఁ గూలిపోవ నెసఁగు
నీమహాధ్వని మింటికిఁ బ్రాముకొనెను.

రామరాయనివాహినీప్రతతియందు
బ ములు వెడలెను జయజయధ్వానము లవె;
మాంద్యమొందినచో నిఁక మానభంగ
మగును కొనుమయ్య! సరసరాయా! కటారి.

పౌరుషమ్మూర్తగాఁగొని భండనోర్విఁ
జొచ్చినారలు మనవెల్మజోదులెల్ల
రింక వచ్చినపనిసల్పి యీపుకూడ
వారి ననుసరింపఁగఁ బొమ్ము వీరవర్య!

*   *

తావకీ నానసంబున ధైర్యకలిత
నవ్యసుమమార్ద్రిరేఖ గన్పట్టకుండె—
నేన కేలఁ గడంకఁ గృపాణమూని
ప్రణుతమానంబు గాపాడుకొనెదగాక.

చొక్కపుఁగత్తి నాహృదయశోణిత మొక్కటఁ జిమ్మిపొంగున
ట్లక్కున గ్రుచ్చికొంచు ముదమారగ నీమృదులాంకశయ్యఁ బెం
పెక్కిన దివ్యవాటికలు వీక్షణఁజేయుచు మృత్యుదేవతా!
దక్కిన మానగౌరవనిధానముతోఁ బులకించిపోయెదన్.

భక్తజనచాతక పయోద పటలివగుచు
నవనవకృపారసంపుఁ గ్రొంజల్లుగురియు
దేవదేవ! యీక్రూరాసిఁ దివిరి నాదు
యెడఁద ఛేదించుకొనుశక్తి నిమ్ము నాకు.
ఎసఁగు స్వాతంత్ర్యకుసుమసంభృతవిలోల
గంధవహకందళంబులు దండడించు
వీరబొబ్బిలి! నిత్యసాధ్వీజనాళి
నాంధ్రజన శేముషీసుప్రభార్ద్రివగుము.

* * *

వెలమకాంతల హృద్వీథి విరిసికొనిన
కలితమానప్రదీపికాకళికరాజి
యుగయుగంబులఁ బావనజ్యోతులీని
వఱలుగావుత భారతవర్షమందు!"

## మధురగానము

శ్రీమతి యండ్లూరి శారదాదేవిగారు

క్రోధతాపాగ్ని కణములు కుమిలిపోవు
దుఃఖకంధరపటలంబు దూలిపోవు
కఠినపాషాణములె మరి కరిగిపోవు
నవనవోపేత మధురగానంబువలన.
పరవశంబున పాములు పడగలూపు
బెబ్బులియు మైమఱచి పాలబితుకనిచ్చు
తేటియును మాను తీయని తేనెలాన
నవనవోపేతమధురగానంబువలన.

పసరమొగ్గలు పూవులై పసనుజూపు
మోడుమ్రాకులు మెల్లన మోసులెత్తు
ముగ్ధకాంతయు మురిపెంపుమొలకయౌను
నవనవోపేత మధురగానంబువలన.
తల్లిపాట లేనిదే రాదు పిల్లనిదుర
పిల్లగ్రోవిలేనిదే పోదు గ్రొల్లపొద్దు
గొల్లసుద్దులులేనిదే తల్లిగొర్రె
పిల్లకివ్వదు పాలను కొల్లగాను.

# రాజీనామా

కొడవటిగంటి కృష్ణమూర్తిగారు

౧

పట్టాభిరామయ్య చాలభాగ్యవంతుడు. ఆయనకిద్దరుపిల్లలు: సీత, పూర్ణానందం. పట్టాభిరామయ్యకు ఉద్యోగంచెయ్యటం నీచమనిపించింది. పొట్టగడపటానికీ, డబ్బుసంపాదించటానికి ఉద్యోగంచెయ్యటం ఆయన కిష్టంలేదు. కాని పురుషలక్షణంగా డబ్బురానిఉద్యోగాలుచేస్తుండేవాడు. వరుసను ఆయన నాలుగుసార్లు మునిసిపల్ ఛేర్మనయినాడు.

మొదటినించీ పట్టాభిరామయ్య గర్వి. ఆత్మగౌరవం నిలుపుకోటానికి ప్రతివాడికీ గర్వముండవలసిందే. కాని అది ఇతరులను బాధించకూడదు. సీతపెళ్ళిఅయినకొత్తలో ఆయనగర్వం అల్లుడిమీదికే పోయింది. సీత వివాహంఅయిన రెండునెలలకు ఎవరో దూరపుబంధువులువచ్చి మంచి సంబంధము వచ్చిందండీ సీతకు పట్టాభిరామయ్యగారూ! మంచి అదృష్టంగలపిల్ల" అన్నారు మాటవరుసను.

పట్టాభిరామయ్యకు ఆసమయంలో అల్లుడంటే కోపంగాఉంది. పెళ్ళిలో పెళ్ళివారికి చాలనీచమైన బట్టలుపెట్టాడు. వియ్యపురాలు కాస్తనాలుగుమాటలూ అక్కడే అడిగింది. ఆవిడ ఏదన్నా మనస్సులో ఉంటే ఎదటఅడిగేరకం. పెళ్ళంతో సలక్షణంగాజరిగి బట్టల్లోలోపమయింది. అందరూ నొచ్చుకున్నారు. పట్టాభిరామయ్య గర్వంతో వియ్యపురాలిని మళ్ళీఅన్నాడు. దాంతో అందరికీ కోపంవచ్చింది. అప్పటినించీ వియ్యపురాలు—అసలు వియ్యంకుడు లేడు—అల్లుడంటే నిరసనతో చూసేవాడు. ఇంట్లో వారివిషయమెంస్తే చాలానత్తిగా ఉండేది. అందుచేత ఆయనకీ ఉత్సాహంచేదయింది.

"ఆ! మంచిసంబంధమే! సీతకింతకన్న మంచిదిరా దగదా? బుద్ధిలేకచేశా నీపెళ్ళి!"అన్నాడు. ఎవరికైనా మాటలమీద కొంతకట్టుబాటు చాలఅవసరం!

సీతకూ తండ్రికున్నగర్వంఉంది. ఆమెకు ఎక్కువమంది 'ప్రాణస్నేహితులు' లేరు—సాధారణంగా ఆడపిల్లలకు అందరూ ప్రాణస్నేహితులే! ఆడపిల్లలు ఒకరితోఒకరు ఎంతెంతరహస్యాలో చెప్పుకుంటారు! ఆమెకు సరస్వతిఒక్కతే మంచిస్నేహితురాలు.

సరస్వతికి చాలచిన్నతనంలోనే వివాహమయింది. ఆమెభర్త చాలదుర్మార్గుడు. సీత సరస్వతితో సంభాషించేటప్పుడు ఆమె భర్తనుగురించి మాట్లాడేదికాదు. సీత కతనివిషయంమాట్లాడటం అసహ్యమొకటీ, రెండోది సరస్వతికి కష్టంగాఉంటుంది.

సీత గదిలో జడవేసుకుంటున్నది. పట్టాభిరామయ్య పండక్కు అల్లుణ్ణి తీసుకురావటానికి వెళ్ళాడు. పక్కన హాలులో సందడిఅయింది. పట్టాభిరామయ్యగొంతు వినిపించింది కోపంతో!

"ఏం? ఎందుచేత రాలేదు?" అన్నది సీతతల్లి.

"ఎందుచేతనా? పొగరెక్కి! ఆశనిపీనుగుపోయి అల్లుడితోనూ, ఆవిడతోనూ నేనన్నమాటలు అన్నాట్ట! నాకేంభయం అంటే?—ఆవిడ నన్ను పట్టుకుని అడ్డమైన మాటలూఅన్నాది. ఆవిడ అంటుంటే అల్లుడు వింటూ కూర్చున్నాడు!—ఏమిటి నేనన్నమాటల్లో తప్పు? అబద్ధమా? ఇంతకన్న మంచిసంబంధాలు సీతకురా లేదూ? మగపిల్లవాడుకాగానే కళ్ళుకనిపించవు కాబోలు! ఆడపిల్ల కాగానే హీనమేమి? ఎందుకొస్తుందో లోకంలో మగవాళ్లకీగర్వం! నాకు లోకంతో లెక్కలేదు. అల్లుడుగదా అనిపోయి కాళ్లుపట్టుకోను. ఆయన రాకపోతే నాకేమీ తక్కువకాలేదు!"అన్నాడు పట్టాభిరామయ్య. ఇల్లెగిరిపోయింది!

౨

ఆరేళ్లు గడిచినాయి.

వసంతకాలం వచ్చింది. పూర్ణానందం పొద్దున్నే పుస్తకంతీసుకుని తోటకెళ్లాడు. తోటలో సీతారామశాస్త్రి కనిపించాడు. ఇద్దరూ ఒకచోట కూర్చున్నారు. ఇంతలో ఏమూలనించో ఒకకోయిల "కూ, కూ!" అన్నది. సీతారామశాస్త్రి తీరిగ్గా దగ్గి దానికిజబాబిచ్చేడు. కోయిలకున్నంతగర్వ మింకొకరికిలేదు! దానిగొంతులోనే ఉంది! కోయిలమండిపడి గట్టిగా కోప్పడ్డది శాస్త్రిని "కూ.కూ!" అని. శాస్త్రివదలిపెట్ట లేదు. కోయిల శాస్త్రిని రెండుతిట్టి రెక్కలువ్యూడించి లేచిపోయింది.

"అంతేకావాలి!" అన్నాడు శాస్త్రి తృప్తిగా.

పూర్ణానందం నవ్వాడు.

"సరేకాని ఏమిట్రా సంగతులు? పూర్ణా!" అన్నాడు శాస్త్రి.

"నాకు పిచ్చిఎత్తినట్టుందిరా, శాస్త్రీ!"

"ఏమి?" అన్నాడు శాస్త్రి ఆశ్చర్యంతో మామిడిపిందె కొరకటమాపి.

"ఆవిషయమే!"

"ఏది?"

"మా మామగారివిషయం!"

"నేను చెప్పనా ఒకసలహా?"

"ఊఁ!"

"తిరిగి పెళ్లి చేసుకో!"

"చస్తే!"

"ఎందువల్ల?"

"నేను భార్యకోసరం తపిస్తున్నాననుకున్నావా?"

"మరేమిటి?"

"పొరబాటు!"

"అయితే చిక్కులేదు!"

"ఎందుకులేదు? మామగారు నాపైన విరోధంగావున్నాడు. నాభయం ఏమిటంటే సీత మధ్య కష్ట పడుతుందేమోనని. చూడు, శాస్త్రీ! మగవాడున్నచోటుండేవాడు. ఆడది ఇంకోచోటికి పోయ్యేది. ఏమంటావ్?"

"నువ్వొక విచిత్రస్వరూపం. అమ్మ ఒకవిచిత్రస్వరూపం. ఒకరికొకరుదొరికారు! అమ్మకాపట్టుదల ఎందుకు? కోడలితో కల్లే నీకెందుకుపట్టుదల? సీత నెందుకుంచావక్కడ? మీఅమ్మ అక్కడికి నిన్నుపోనియ్య కపోవటమేమిటి? అంతా దుర్మార్గంగా ఉంది!"

"నీకు తెలియదు, శాస్త్రీ! వెధవది—భార్యకోసరం అమ్మకెదురు తిరగమంటావా?"

శాస్త్రి ఒక్కక్షణం కళ్లుమూసుకుని "ఈమాట అన్నందుకిప్పటికైనా పశ్చాత్తాపపడతావురా. పూర్ణా! అంత అభిమానంలేనిభార్య నెందుకు పెళ్లాడావు? నీభార్యతో నీవు కాపురంచెయ్యటం అమ్మకు ఎదురుతిరగట మవుతుందా? ఇంకా అమ్మ నాలుగేళ్ల దాకా ఇలాగే ఉంటుందనుకో. అంతవరకూ నీభార్య నిన్ను

స్మరిస్తూ ఉంటుందని నీనమ్మకమా? మనిషిఓర్పుకు అంతుందిసుమా! మరి, అమ్మ తనపట్టుకోసరమే చూస్తున్నదికాని నీసౌఖ్యంవిషయం ఆలోచించిందా? అందుకనే ఫెమినైన్స్ఫూల్స్అన్నారు" అన్నాడు.

"ఆసంగతి మా మామగారికి తెలియవక్కర్లేదూ?."

"నీభార్య నీకెక్కువా, నీమామగారికెక్కువా?"

పూర్ణానందంమాట్లాడలేదు. సీతమీద తనకన్న ఇంకొకరికి ఎక్కువఅభిమానం ఉన్నదని ఒప్పుకోవటం అతనికిష్టంలేదు. తనకెక్కువ అభిమానంఉందని ఒప్పుకుంటే శాస్త్రి గెలిచినట్టే!

"ఇప్పుడు నీభార్యకన్నేళ్లుంటాయి!"

"పదహారుకేళ్లు వెళుతాయేమో!"

"అబ్బో!"

* * *

సీతఆరేళ్లలో పూర్తిగా మారిపోయింది.

సాధారణంగా ఆడపిల్లల అభిరుచులు భర్తమీద గౌరవం, ఆగౌరవం తల్లిదండ్రులు ఇంట్లో ప్రతిరోజూ అనుకునేమాటలమీద ఆధారపడిఉంటాయి. మొదట్లో భర్తమీద ఎంతఅభిమానమున్నా వరుసగా సంవత్సరాల పాటు తనభర్తనుగురించి తలితండ్రులు అసహ్యంగామాట్లాడుకుంటూంటే వింటూ ఆడపిల్ల భర్తమీద గౌరవం నిలుపుకోలేదు. అందుకనే ఆడపిల్లలవిషయం తలిదండ్రులు పెళ్లయినతర్వాత బహుజాగ్రత్త తీసుకోవలెను. ఆడపిల్లలు చెడిపోవటానికికూడా తలిదండ్రులేకారణం. సీతవిషయం అట్లాఅయింది. భర్తచులకనైనాడు.

ఈసమయంలోనే సరస్వతి బాల్యదశలో అత్తవారింటికిపోయింది. అంతవరకు సీత దుఃఖముకాని చీదరగాని ఎరగదు. ఆనాటినించీ ఆమెకు లోకంమీద విరక్తికలిగింది. ఛీ! ఏంలోకం! సరస్వతేమిచేసిందీ కష్టాలుపడటానికి! ఆమెభర్త ఆమెను పశువునుచూచినట్టు చూస్తున్నట్టు ఆమె ప్రతిరోజూ తనతల్లితోచెప్పి దుఃఖిస్తుంది. తనసంగతి ఇట్లాఉన్నది. కేవలం తాను పురుషుడుకావటంవల్ల తనభర్త తనతండ్రిని సాధించగలుగుతున్నాడు. మగవారి కింత నీచపుఆలోచనలుంటాయా? నూటికొకరైనా ఆడవాళ్లను గౌరవంతో చూడరా? బానిసగాఉంటూ స్త్రీ సంసారంలో ఎందుకు సుఖంఅనుభవించాలి?

ఒకరోజున ఏదోమాసపత్రికచూస్తూ ఏదోకథ చదివిందిసీత. కథరాసినవారి పేరులేదు. కాని కథ అద్భుతంగాఉంది. ఒకస్త్రీ సంసారంలో చిక్కులుపడుతుంది—భర్తపెట్టేబాధలు, అత్తగారు మామగారూ బావగారూ ఆడబిడ్డపెట్టేబాధలు సరిగా లోకంలో జరుగుతున్నట్టేరాశారు. మొదట మొదట భార్య బానిసగాఉండటం మొదలుపెడుతుంది. కాని చివరకు ఆమెకు ఈమాదిరిచర్యవిసుగెత్తి క్రమంగా తానుకూడా వారిమాదిరిగానే చరించటం మొదలుపెడుతుంది. ఇక్కడ కథరాసినతను బాగారాశాడు. పూర్వం భర్త తనమీద ఉపయోగించిన వాక్యాలూ, మాటలూ భార్య భర్తమీద ప్రయోగిస్తుంది. భర్త క్రమంగా మారిపోతాడు. అసలతనిమనస్సు మంచిది. భార్యఅన్నమాటలకు కోపంతెచ్చుకోక "ఆమాట ఆమెఅంటే నాకింత కష్టంగా ఉందే నేనెప్పుడూ ఆమెకింత కష్టంగానుండి ఉంటుందికద!"అనుకున్నాడు. అదీకాక తనభార్య తనవిషయం ఓర్పుతో కొంతకాలం ఉండటంకూడా గమనిస్తాడు. చివరకు తల్లిదండ్రులకు ఎదురుతిరుగుతాడు. భార్యతో సుఖంగా ఉంటాడు. అదీ కథ. సీత కథరాసినవాణ్ణి చాలమెచ్చుకుంది. "ఈ మాత్రంబుద్ధి అందరికీ లేదేం? అతనిభార్య ఎంతసుఖపడుతుందో?" అనుకున్నది.

సీత చదువులో పడిపోయింది. ఆమెదృష్టి పుస్తకాలమీదికి మారింది. ముఖ్యంగా తండ్రిచేత ఆమాసపత్రిక కొనిపించి చదువుతూండేది. ఆకథరాసిన అతనుప్రతిసారీ కథరాస్తునే ఉన్నాడు. సీతకుమగవాళ్లందరిమీదా కోపంఏర్పడ్డది—తనతండ్రిమీదా, ఆకథలురాసేఅతనిమీదా తప్ప!

## 3

అతిగర్వికి దూరాలోచనఉండదు—ఉంటే గర్వికాక నేపోను. పట్టాభిరామయ్యకు అంతఅనుభవముండి సీత తనఇంట్లో శాశ్వతంగాఉండదు అన్న స్వల్పవిషయం తెలియకపోయింది! పూర్ క్రీచర్! నిజానికి తప్పుతనదే.

ఒకరోజున ఎవరోబంధువువచ్చి సీతవిషయంఎత్తాడు. పదహారేళ్లా? ఆశ్చర్యపడ్డాడు. ఈపాటికి కాపురానికి వెళ్ళవలసిందేనే! పట్టాభిరామయ్యకు అర్థమయింది. ఇంకోరోజున మరొకడొచ్చాడు. మామూలే! సీత అత్తవారింటనించి ఎప్పుడొచ్చింది?—ఇంకా కాపరానికి పోలేదు? చిత్రం! అయినా ఎక్కువవయస్సు కాదు కాబోలు! ఎంత? అహా! అయినావెళ్లవచ్చును! ఇప్పుడిప్పుడు పదహారేళ్ల దాకా ఉంచుతున్నారు! అయిపోయింది. లోకమంతా తనవిషయం గుసగుసలాడుతున్నారని గ్రహించాడు పట్టాభిరామయ్య.

తనతండ్రి లోకంలో అందరితోటివాడుకాడుఅని సీత ఉద్దేశ్యం. ఆయనకు లోకభీతిలేదనుకున్నది. ఆయన క్రమంగా మెత్తబడటంచూసి సీత భయపడ్డది. తానెంతో నమ్ముకున్నతండ్రి ఇలాఅయిపోతే తనకు నమ్మకం కలవాళ్లెవరు? అహో! ఆకథలురాసేఅతనైనా!—అతనుమాత్రం! తనకుఆప్తులులేరు. ఇలాలోకం ఎలాసాగుతుంది చెప్మా! లోకంమంచిదేఅయి నేను చెడ్డదాన్నేమో! నేనొక్కతెనే మంచిదాన్నయి లోకం చెడ్డదవుతుందా? లేక—కాక ఇంకాఎక్కడైనా పొరబాటున్నదా? హాలులో సందడిఅయింది.

"ఏమైంది?"

"ఏమయిందా? మన్నయింది! మాఅల్లుడికెంతపొగరు? నేనుపోయి ఆదొల్బాజిఅల్లికాళ్లు పట్టుకుంటే తాను వాయింటికి వస్తాట్ట! టాంపాయ్! ఏమీ అక్కర్లేదు. లోకంఎట్లాచచ్చినసరే!" పట్టాభిరామయ్య రొప్పటంమొదలు పెట్టాడు. ఆయనవేదనపడుతున్నట్టు సీత గమనించింది. ఆవేదన గర్వంవల్లని ఆమెకు తెలీదు. అతను గర్వంతో పోట్లాడుతుంటే లోకంతోనూ, దుర్మార్గంతోనూ పోట్లాడుతున్నాడనుకున్నది సీత.

పాపం తనతండ్రి తనకోరకు ఎంతశ్రమపడుతున్నాడు!

పట్టాభిరామయ్య గర్వం చచ్చిపోతున్నది. అటువంటి లుచ్చాజంతువు ఒక్కసారిచావదు. తనవియ్యపురాలితో మంచిచేసుకోవటం తనకుగౌరవమే! అన్నిఅనుకోటంలో ఉన్నది.

పట్టాభిరామయ్య తిరిగి అల్లుణ్ణిసమీపించాడు. సౌక్యంగామాట్లాడబోయి ఆత్మగౌరవంమాట మరచిపోయినాడు! వియ్యపురాలు వెంటనే సమ్మతించింది.

"ఏమైంది?" అన్నదిభార్య.

"ఆ! ఏమున్నది? నేనెప్పుడువస్తానాఅని కాచుకకూచున్నారు! నేను పెళ్లి లాంఛనంగా మనలోమనకు ఎందుకు వెధవతగాదాలుఅన్నాను. ఇద్దరూ సమ్మతించారు. సీతను ఎల్లుండి తీసుకెళ్లుతున్నా!"

"పిల్లనుచంపుకుతింటారేమో పంపిన మర్నాటినించీ!" అన్నదిభార్య.

పట్టాభిరామయ్య గదిలోకిపోతూ "గడ్డిపెట్టనూ!" అన్నాడు.

సీతకు అత్తగారిమీద అసహ్యంకలగటానికి తండ్రి కారణమయినప్పటికీ ఆమెకూ ఆయనకూ ఒకభేదమున్నది. పట్టాభిరామయ్యకు గర్వహానికలిగింది. సీతకు మనస్సేవిరిగిపోయింది. అత్తగారుచిక్కులు పెడతారేమో అన్నఆలోచనవచ్చింది. ప్రాణమన్నావదిలేస్తాను కాని వారికి బానిసగా ఉండను! ఈశరీరం నాది! అధర్తకు ఆహుతిచెయ్యను. దీనిమీద ఇంకోరి కధికారంలేదు! అనుకున్నదిసీత.

ఆరుసంవత్సరాలు దాటినతర్వాత భార్యాభర్తా ఒకరినొకరు చూసుకున్నారు. పూర్ణానందంకళ్లు చలించినాయి. ఒక్కక్షణం: రెండోక్షణం సీత అతనివంకచూసింది.

రెండుకళ్లల్లో భగవంతుడెంత పెట్టాడు! ఆదృష్టి అతనిమీదపడగానే అతను మారిపోయినాడు. అతనికళ్లల్లోకాంతి నశించింది.

సీతకు తనమీద ప్రేమ లేదు!—అభిమానంలేదు. ఆరెండుకళ్లల్లోనూ పెద్దఅక్షరాలతో ఆసంగతి వ్రాసి ఉంది. ఆమెచెక్కులమీద సిగ్గులేదు. ఆమెకళ్లల్లో కోపంఉన్నా ఎంతోఅందంగా ఉండేది!

రెండుమూడేళ్లనించీ పూర్ణానందం సీతనుగురించి ఆలోచించనిరోజులేదు. కాని ఒక్కసారీ అతనికీఆలోచనతట్టలేదాయెను!—సీతకు తనమీద అసహ్యంఉంటుందని. అయినా తనవల్లతప్పేమిటి? పూర్ణానందానికి శాస్త్రిమాటలు జ్ఞాపకంవచ్చినాయి. తనవల్ల తప్పులేకేమి?

ఆరాత్రి సీత ఒంటరిగా లభించింది. సీత కొంతదూరంలో నిలుచుంది. ఆమెముఖాన అగ్నిహోత్రుడు తాండవమాడుతున్నాడు.

"నామీద నీకభిమానంలేదనుకుంటాను!" అన్నాడు పూర్ణానందం చాలమొరటుగా! ఆమెపేరు అందామనిపించిందికాని నోటివెంటరాలేదు.

"లేదు!" అన్నది సీత గంభీరంగా.

"ఎందువల్ల?"

సీతమాట్లాడలేదు.

"నాతో కాపరంచెయ్యటం ఇష్టంలేదు నీకు?" అన్నాడు మరీ పెళుసుగా!

"లేదు!"

"నేనెంత మంచిగాఉన్నా నీతో?"

"నాతో మంచిగా ఉండనక్కర్లేదు!" అన్నదిధైర్యంగా.

"మంచిది!" అన్నాడు పూర్ణానందం లేస్తూ.

ఆమాటసీత ఎందుకనాలి? తనచేతనైనపని చేశాడు.

సీతఉద్రేకంవేరు. ఒకవేళఅతను తనతో మంచిగా ఉండదలచుకుంటే ఇదివరకే తనకోసరం వచ్చేవాడు. ఇప్పుడు మెత్తబడ్డం ప్రేమవల్లకాదు—సుఖంకోసరం. ఆమెఇటువంటి మెత్తదనానికి వశంకాదలుచుకోలేదు. అక్కడికి భార్యాభర్తల సరససల్లాపమంతమయింది.

పూర్ణానందం లేచినచోటే నిలుచున్నాడు ఆలోచిస్తూ. "చూచావా? నీయిష్టంలేకుండా నిన్ను ముట్టుకోను—నీకిష్టంఉన్నా ముట్టుకోననుకుంటాను!" అన్నాడునవ్వుతూ.

- సీత మండిపడ్డది. అప్పటికైనా అతను తనమీద ప్రేమఉన్నదనిచెబితే సీత నీరైపోయేదే! పూర్ణానందం ఆమెకోపాన్ని లెక్కచెయ్యలేదు. "కాని లోకానికి మనగుట్టు తెలియటం నాకిష్టంలేదు. నీకూఇష్టంలేదనుకుంటాను. అవతల గది ఖాళీగానేఉంది. నువ్వందులో శయనించవచ్చును. తెలిసిందా? తరువాత. ఈ ఇంట్లో నీకుకావలిసినంత స్వేచ్ఛ. నీతినిదాటనంతవరకూ నీకేపని చెయ్యటానికైనా అధికారంఉంది. అర్థమ—"

"నానీతినిగురించి ఇంతవరకు ఎవరూతప్పుపట్టలేదు!" అన్నది సీత గర్వంగా.

సీత తనభర్త తన్ను నేకవిధాల హింసిస్తా రనుకున్నది. అప్పుడు తనవీరత్వం చూపిద్దామనుకుంది. కాని ఇదేమిటి? తనభర్త కంతకౌర్యం లేదుకాబోలు. దుర్మార్గంఒకతప్పు! అదిచూపలేకపోవటం ఇంకోతప్పు! తనభర్త దుర్మార్గుడుకాదన్నఆలోచన ఆమెకురాలేదు. ఉత్తఅనాథఅన్నఆలోచన వచ్చింది.

సీత అవతల గదిలోకి వెళ్లి తలుపుగడియ వేసుకున్నది. ఆమెకు చాలసేపటివరకూ నిద్రపట్టలేదు. "ఎక్కడో పొరబాటున్నది! ఎక్కడో!" అన్న ఆలోచనే. అకస్మాత్తుగా అవతల గదిలోనించి మాటలు వినిపించినై. పూర్ణానందం ఏమి చేస్తున్నాడో చూస్తే! ఛీ! తన కెందుకు కలనిజోలి!

సీత తలుపుసందునించిచూచిన బాగుండేది. అతను కుర్చీలోకూర్చొని చేతుల్లో ఒకఫోటో పెట్టుకుని దానివంక ప్రేమతో చూస్తూ "ఏమైంది సీత? ఏమైపోయింది నాసీత!" అనుకుంటున్నాడు. ఆఫోటో సీతపెళ్లి నాటిది.

౪

నెలరోజులు గడిచిపోయినై. సీత అత్తవారింట్లో స్థిరపడిపోయింది. ఆమె అత్తగారితో గాని భర్తతో గాని స్వయంగా ఎన్నడూ సంభాషించలేదు. పూర్ణానందం తల్లికి కోడలిసంగతి కుమారుడిద్వారా తెలిసింది. ఆమె చాలఓర్పుగలమనిషి. సాధ్యమైనంతవరకూ ఆమె సర్దుకుపోతూవచ్చింది. అందరితోనూ కోడలిని గురించి మంచిగానే చెప్పేది.

ఏమైనా కావలిస్తే తన్నడగమని చెప్పాడు పూర్ణానందం సీతతో రెండోసారి మాట్లాడినప్పుడు. కాని సీతకు అడగటం ఇష్టంలేకపోయింది. తనకు కావలిసిన మాసపత్రికలకోసం ఇంకా ఏదో చిల్లరవస్తువులకోసం ఉత్తరాలు రాసి ఇంటినౌకరుచేత పోష్టులో వేయించేది. వచ్చినవస్తువులు తానే స్వయంగా తీసుకునేది. పూర్ణానందం గ్రహించా డీవ్యవహారమంతా.

"పోనీ దానికిక్కడ కష్టంగా ఉందేమో పుట్టింటికైనా తీసుకుపోరా!" అన్నదితల్లి.

పూర్ణానందం నవ్వాడు.

"ఎందుకే? అంతపోవాలని ఉంటే తండ్రికి ఉత్తరం రాయగలదు!" అన్నాడు సీత వినేటట్టుగానే. సీతకు చెప్పరానిమంటవచ్చింది.

"ఎలాఉంటయిరా స్థితిగతులు, పూర్ణా!" అన్నాడు శాస్త్రి ఒకరోజున.

"ఏంచెప్పను? ఇంతవరకు మాఆవిడకు నాతో గాని అమ్మతో గాని పరిచయం కలగలేదు!"

"అంటే?"

పూర్ణానందం విప్పిచెప్పాడు.

"చిత్రం! నెలరోజులనించీ అలాఉందా? నువ్వేమైనా తిప్పాలని ప్రయత్నంచేస్తున్నావా?"

"ఏమిటిప్రయత్నం? బలవంతాన మనస్సువిప్పితే అది శాశ్వతంగా ఉంటుందా?"

"ఇంతప్రయత్నం వ్యర్థం!"

"ఎంతప్రయత్నం?"

"నేనే మీ మామగారికి చీవాట్లుపెడుతూ ఉత్తరం రాశాను. అమ్మను శాంతపరిచాను. నన్నుక్షమించు, పూర్ణా! నిజంగా నీకు సుఖంకలుగుతుందనుకున్నాను. నీఅవస్థచూసి జాలిపడ్డాను. ఇప్పుడు నీ అవస్థచూడ లేకుండాఉన్నాను. నీకెంతఓర్పురా!"

అతని కెంతఓర్పో అతనికే తెలుసును!

శాస్త్రి వెళ్లిపోయినాడు. నౌకరు ఉత్తరంఒకటి తెచ్చిచ్చాడు—తనమామగారిదగ్గిర్నించి. శ్రావణ మాసం నోములకు కుమార్తెను తీసుకెళ్లుతానని రాశాడుమామగారు. ఈవృత్తాంతం తల్లికి సీత వినేటట్టు చెప్పాడు. మర్నాడుదయం పట్టాభిరామయ్యగారు గొడుగుతో దిగాడు.

పూర్ణానందం మామగారితో చాలామర్యాదగా సంభాషించాడు. పూర్ణానందం విషయం కనుక్కోటం మర్చిపోలేదు.

పట్టాభిరామయ్యగారు సాయంత్రం కుమార్తెతో బయలుదేరాడు. ఎప్పుడైనావచ్చిపొమ్మని పూర్ణానందాన్ని పట్టాభిరామయ్య ఆహ్వానంచేశాడు. పూర్ణానందం అట్లాగేనని ధైర్యంచెప్పాడు.

సీతకు పుట్టింటికిరావటం కులాసాగానేఉన్నది. ఆమెవచ్చిందని తెలియగానే చుట్టుప్రక్కలమ్మలంతావచ్చి చుట్టుముట్టారు. "పాపం, సీతనుబాగా చూస్తారా అత్తవారు?" అని ప్రశ్నించిం దోటితిగల అత్తగారు కోడల్ని. అందరూ ఈప్రశ్న అందుకున్నారు. సీతను సమాధానంచెప్పనీకుండా ఆమెతల్లి "అయ్యో, తల్లీ! పెళ్లినెలరోజులుకాలేదు. లక్కపిడతల దగ్గర్నించీ పంపించమని నాకు ఉత్తరాలురాశిందమ్మా!" అన్నది. అక్కడినించీ పలుగురూ సీతనుఅత్తవారుపెట్టేబాధలు ఊహించటం మొదలుపెట్టారు. అప్పుడు సీతకు చాల సిగ్గు కలిగింది. నిజంగా వాడుతన్ను కష్టపెడితే ఎంతబాగుండేది?

"సరస్వతిక్కడే ఉన్నదే సీతా!" అన్నారెవరో.

"ఆపిల్లదానికష్టాలీదేరినాయమ్మా! దానిమొగుడుపాపం పెట్టవలిసినబాధలన్నీపెట్టి లేచిపోయినాడు. చండాలుడు. ఇప్పుడుదాన్ని గుర్తుకూడా పట్టలేం!"

సీతకు మనస్సుకాలిపోయింది. అట్లాఅవస్థపడుచున్న సరస్వతి పక్కనఉంటుంటే తన్నుచూసిజాలిపడతారేం? ఆరాత్రికి సరస్వతి, సీతా కలుసుకునే అవకాశంలేకపోయింది ఇద్దరిళ్లాదగ్గరేఉన్నా.

మర్నాడు సరస్వతిని చూచి సీత దుఃఖము ఆపుకోలేక పోయింది.

సరస్వతి దీనంగా "పాపం! నీస్థితికూడా నామాదిరిగానేఉన్నదని విన్నానే, సీతా! నేనంటేఎందుకూ పనికిరానిదాన్ని! నీకేమే?"

సీత కొంచెము ఆలోచిస్తూ "నేను నీ స్థితిలోఉన్నాననుకుంటావా?" అన్నది.

"ఏమి? నీఅత్తగారు, భర్తా నిన్ను సరిగా చూడరట. నీకేదికావలిసినా ఇవ్వరట!"

"నేనుఅడగను. నేనడిగితే ఇస్తారు!"

"ఏమిటే?"

"అంతావిని ఆశ్చర్యపడు, సరస్వతీ!"

"చెప్పు, వింటాను!"

సీతకు తనవల్లతప్పులేదని ధైర్యంఉంది. సీత సరస్వతికి మొదటినించీజరిగినసంగతి పూసగుచ్చినట్టు చెప్పింది. సరస్వతి నేలవంకచూస్తూఅంతావిన్నది.

"ఏమంటావు సరస్వతీ?" అన్నదిసీత అనుమానిస్తూ.

సరస్వతి మాట్లాడలేదు.

సీత నిర్ఘాంతపోయింది.

"నువ్వు చెప్పిందంతా నిజమేనా?"

"ఆ!"

"నేనేంచెప్పను? నాకెక్కువ తెలీదు మనుష్యులసంగతి! నేననుకునేది తప్పుకావచ్చును!"

"నువ్వేమనుకుంటున్నావు?"

"నన్నిప్పుడు వెళ్లనీ, సీతా! తరువాత మాట్లాడుదాం—ఇంకోసంగతి!" అంటూ సరస్వతిలేచింది

"నన్నిప్పుడు వదలిపెట్టిపోతావూ!" అన్నది సీత నోటమాటరాకుండా.

"నేనేమీమనుకోను. నామనస్సు సరిగాలేదు!"

సరస్వతి నాలుగడుగులువేసి గడియమీద చెయ్యివేసి వెనక్కితిరిగిచూచింది. సీత మంచంమీద బోర్లపడి ఏడుస్తున్నది. సరస్వతి తిరిగివచ్చి సీతను కౌగలించుకొన్నది.

సీత బలవంతంగా దుఃఖము ఆపుకుంటూ "నేను మొదటినించి ఏదోపొరబాటుఉన్నదని అనుకుంటూనే ఉన్నాను. ఏదో నామట్టిమెదడుకు తట్టలేదు! ఎందుకు నీకంతకోపం నామీద?" అన్నది.

"అయితే నీభర్త చేసినతప్పేమిటి? నీకెందు కతనిమీద అసహ్యంకలిగింది?"

సీత మాట్లాడలేదు.

"మీతండ్రికి, మీఅత్తగారికి విరోధంవచ్చినప్పుడే నేను విషయంవిరుగుదును. పైగా నీతండ్రివిషయం నాకు తెలుసును. అప్పుడైనా నీకు నీభర్తమీద అనుమానమున్నదని తెలిస్తే చెప్పేదాన్నే. నీతల్లిదండ్రులు నీభర్తను దూషించారు. కాబట్టి నీభర్త చెడ్డవాడయినాడా? పోనీ నువ్వక్కడికివెళ్లినతరువాత నీఉద్దేశంసరిగా ఉన్నదోలేదో చూసుకున్నావా? నిన్ను మొదటిరోజున అడిగినప్పుడు నీకు తనమీదఅభిమానం ఉన్నసంగతి అడిగాడుకాని తనకు నీమీదఅభిమానం లేనట్టుచెప్పాడా? ఇటువంటివిషయాలు నీవంటిదాని కింకొకరు చెప్పాలా? నీభర్తమనస్సు ఎంతవిరిచావో ఊహించుకోగలవా? ఇప్పటికే అంతామించిపోయిందేమో! ఎంతతెలివితక్కువదానివి సీతా! భార్య తెలివిగలదైతే భర్తఎందుకు విముఖంగాఉండాలి. భర్తనుసంతోష పెట్టేది ఒక్కచక్కదనమేనా? అంతకన్న ఆకర్షించేమార్గాలులేవా? నేను నాభర్తను ఏవిధంగానైనా ఆకర్షించగలిగితే ఇప్పుడీస్థితిలో ఉంటానా? ఇప్పటికైనా బహుశమించిపోదు. భార్యకు భర్తదగ్గిర అభిమానంఉంటుందా? గర్వంఉంటుందా? నీతండ్రి వాళ్లనెందుకట్లా అనాలి? నీదే తప్పని నీభర్తదగ్గిర చెప్పుకోటం నీకభిమానమా?"

సీతకుతనతప్పు సరస్వతి రెండువాక్యాలతోనే తెలిసిపోయింది. సరస్వతికొంచెముసేపుండి నిట్టూర్పు విడిచి నవ్వింది.

"కాలమహిమ! నీకు నేను చెప్పవలసివచ్చింది!"

"అలాఅనకు! నీకు, నాకూ ఎంతభేదంఉంది!"

"బోలెడు!"

"నీకు నాభర్తలాంటివాడెందుకుదొరకలేదు? సరస్వతీ!"

"ఎవరుచెబుతారు? కానిఒకటినిజం. నీభర్తలాంటివాళ్లు అరుదు!"

"ఛీ! ఛీ! ఛీ! మాఅత్తగారిముందరా, ఆయనముందరా ఎంతకోతిగాప్రవర్తించాను!"

"తిరిగి వారినిచూడటానికి సిగ్గుగాఉండదూ? సీతా!"

"రోగమా? చేసినపనికి!"

సరస్వతి నిట్టూర్పువిడిచింది. "ఇక చిక్కులేదు!"

రోజులుగడిచిపోతున్నై. శ్రావణమాసం అయిపోయినా పూర్ణానందంరాలేదు—ఎందుకువస్తాడు? సీత కనుమానంజాస్తయింది. పూర్ణానందం శనివదలిందని ఊరుకున్నాడేమో!

భాద్రపదం గడుస్తున్నది! సీతకు భయంఎక్కువయింది. పట్టాభిరామయ్యకే అనుమానంకలిగింది. "అమ్మాయిని ఇంకాకొద్దిరోజులుంచుకోటానికి అభ్యంతరంలేదనుకుంటాను" అనిఉత్తరంరాశాడు. "ఎంతమాత్రంలేదు" అనిజవాబువచ్చింది.

ఉత్తరంవచ్చినరోజున సీత రహస్యంగా ఏడిచింది. అతనికి తనవిషయం ఎట్లా తెలుస్తుంది? తనను అత్త వారింటదింపమనటాని కామెకుసిగ్గుగాఉంది.

చివరకు సీత కొకఉపాయంతట్టింది. ఒకసాయంత్రం తమ్ముణ్ణిపిలిచి కవరుపకటి తెప్పించింది. తమ్ముడి పేరు భర్తపేరుఒకటేకావటంచేత పేరుపెట్టిపిలవటం అలవాటుకాదు.

“ఒకరహస్యంచెబుతా రారా అబ్బాయి!”అని వాణ్ణి రహస్యంగాతీసుకుపోయి ఒకకలంకాగితంతెచ్చి “నేనుచెప్పేదిరాయి!” అన్నది.

పూర్ణంఅప్పుడే ఎ బి సి డీలు నేర్చుకుంటున్నాడు. కాని అతనికింకా కలంతో రాయటంచేతకాదు.

“నాకుచేతకాదు!” అన్నాడు.

“చేతయినట్టు రాయి!”

“చెప్పు!”

మ-రా-రా-శ్రీ—

“నువ్వురాసి చూపించు—”

లాభంలేదు. తానొకకాగితంతీసుకుని వాడురాయలేనిమాటలు తానురాస్తూ ఉత్తరంపూర్తిచేసింది.

“బావగారికి నమస్కారములు:—మీరువెంటనేవచ్చి అక్కయ్యనుతీసుకుపోవలెను. పూర్ణం.”

ఈవిధముగానే ఎడ్రసురాయించి పోస్టాఫీసులోవేయించిది.

“చూడు, ఇదంతా ఎవ్వరితోనూ, చెప్పకు!” అన్నది తమ్ముణ్ణిబుజ్జగిస్తూ.

“నాకెందుకేం?” అన్నాడు పూర్ణం గంభీరంగా!

అంతటితో సీతమనస్సు కొంతతేలికయింది. ఆరాత్రి ఎట్లాగోగడిపింది. మర్నాడు ప్రారంభమయింది. ఉత్తరం పదిగంటలకందుతుంది. సాయంత్రం ఆరింటికిరావచ్చును. సీత తనముందుగతి ఆలోచించటం మొదలు పెట్టింది. ఎట్లా తెలియజేస్తుంది తనపొరబాటు భర్తకు? ఇంతలోగడియారం పదకొండుకొట్టింది. ఇంకా ఏడు గంటలకు తనభర్త—వస్తాడా?

“పూర్ణం!” అన్నది పైటచప్పుడువిని. జవాబులేదు. సీత బద్ధకంగా కూర్చున్నచోటినించీలేచి తలుపు తెరచింది. పూర్ణానందం సూటుకేసుతో సహా లోపల అడుగుపెట్టాడు.

అతనికి ఉత్తరం అందలేదన్నమాట. అందితే అప్పుడే వచ్చిఉండడు. ఎంతదురదృష్టం! ఆఉత్తరం చాలసహాయం చేసేదిసీతకు. రాకరాక అతను రెండుమూడుగంటలు ముందుగా బయలుదేరాడు!

పూర్ణానందం సీతను పలకరించలేదు. ఆమె అతనిముఖంవంక చూడలేకపోయింది—తనజన్మకు మొదటిసారి.

సీత మెల్లిగా గదిబయటికిపోయి వంటఇంట్లోకిచురుగత్తింది గుండెలు గబగబాకొట్టుకుంటూ.

“ఏమిటేఅమ్మా!” అన్నది తల్లి పొయిదగ్గర కళ్ళుచికిలిస్తూ.

“మీఅల్లుడొచ్చారు!” అన్నది సీత కళ్ళుపెద్దవిచేసి.

“ఏమిటే? అంత గొణుక్కుంటూ మాట్లాడతావేమే?”

సీతదగ్గిరకెళ్ళి తిరిగిచెప్పింది.

తనకుమార్తెకు భర్తనుచూస్తే ఎంతభయం!

“ఎప్పుడురావటం?”

“ఇప్పుడే!”

"మీ అమ్మగారు కులాసా?"

"ఆ! మళ్ళీ ఒంటిగంటబండి కెళ్ళాలి. త్వరగా వంటకానియ్యండి. వారొక్కక్షణంతీరదు. మళ్ళీ సాయంత్రానికి కక్కడుండాలి!"

"అయ్యో! వారూళ్ళో లేరు!"

"ఇర్వాలేదు"

"వంటకావస్తున్నది" అంటూ అత్తగారు లోపలికిపోయింది. అలా గున్నలాగూర్చుంటావేమే? అమ్మాయి! వెళ్ళి స్నానంచెయ్యటానికి నీళ్ళుఇయ్యరాదూ?"

సీత మెల్లిగాలేచి గదిదగ్గిరికివెళ్ళి అనుమానిస్తూ నిలుచుంది. పూర్ణానందం పెట్టిసర్దుతూ తలఎత్తిచూచి "ఏమిటి?" అన్నాడు.

"స్నానంచేస్తారా?" అన్నది సీత హీనమైనగొంతుతో. పూర్ణానందం "ఏమిటీ?" అంటూ దగ్గిరికొచ్చాడు.

"స్నానంచేస్తారా?" అన్నది సీత వణుకుతూ.

పూర్ణానందం అకస్మాత్తుగా సీతచెయ్యిపట్టుకున్నాడు. సీత శరీరంజలదరించింది. ఆమె చెక్కిళ్ళు కొద్దిగా ఎర్రబారినాయి. సీత చెయ్యినిమురుతూ, "ఆడవాళ్ళు సిగ్గుపడడంలో అందంలేదని ఒకడంటాడు, సీతా!" అన్నాడు మెల్లిగా పూర్ణానందం.

సీతకేమీతోచలేదు. ఒక్కక్షణంలో మూర్ఛవచ్చేటట్టుంది.

"నామీద నిజంగా నీకు అభిమానంఉందికాదూ? సీతా!"

సీతకేమి చెప్పాలో తెలియలేదు.

"నీకు నామీద అభిమానం ఉందని తెలిస్తే నాకెంత సంతోషంగాఉంటుందో తెలుసునా? అందుకోసరం నేనారేళ్ళు కనిపెట్టుకున్నాను సుమా!"

సీతకు మనస్సు కరిగిపోయింది. "పాపం!" అన్నది సీత మొదటిసారి తలఎత్తి.

"నన్నికవదలిపెట్టవుకదూ?— నేనెంత దుర్మార్గంగాఉన్నానీతో—"

"నన్నుక్షమించరూ?" అన్నది సీత.

పూర్ణానందం ముగ్ధుడైపోయినాడు. అతని నోటివెంట మాటరాలేదు. సీతను గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు.

## భగవల్లీల

శ్రీమతి పాకనాటి శ్రీలక్ష్మీకామేశ్వరి గారు

తరమె వర్ణింపఁగా పరాత్పరునిమాయ
మహిమ తెన్నంగవశమానె మనకునెల్ల
అఖిలమును భగవల్లీలయగునెగాదె
జగము నాటకశాలగ దగనొనర్చి
నటకులనుగాఁగ జీవులనాడఁజేసి
శాశ్వతము లనిపించు సంసారమెల్ల
అంత నాదనిపించు దురాశమించ
దీనిమూలంబు రవ్వంత తెలియలేక
గాలమున జేప చిక్కినకరణి నహహా
గాఢతిమిరంబునంబడి కాలమెల్ల
గడపనెంచదవేల చీకాకులేక
జన్మసార్థకమాచర్య జగతిలేదె
"మంచినెంచుచు మంచినేమెంచిచేయ
సార్థకంబగుగాదె ఈజన్మ" మంచు
బుధులుచెప్పెడినట్టి ఈబుద్ధివినుము
పాపకూపానబడకు మోహాంధమనస!

## ఒక మాట

సోదరా!

అంతమేలేని ఆమహామహుని కరుణాపారావారములో నొక్కచినుకు ఇటువచ్చినది. దానిమాధుర్యమును గ్రోలు పిపాసివినీవు. నీకు శుభమగుఁగాక!

మహావీరక్షాత్రరుధిరస్రవంతికలు ఇంకి నీమాతృభూమిలో సుశ్రావ్యశాస్త్రకావ్యముల వల్లరీయుతముగ మొలిపించినవి. అవి చిగురొడకుండఁ గానవలసినదీవు. నీకు శుభమగుఁగాక!



క్షామదేవతకోడి, పరాజితులై, భయార్తులై నీదేశీయులు చేతులెత్తి మొఱలిడుచున్నారు. వారి కుపకరించునవి తియ్యనిపలుకులును, ఉచితచేష్టలును. వారికి తనివి తీర్చవలసినవాడవునీవు. నీకు శుభమగుఁగాక!

అస్తమించెననుకొనిన జ్ఞానమూర్తి మఱలఁ బ్రాక్దిశ నుదయింపనున్నాడు. నీమాతృభూమి యాతనికి స్వాగతమొసగుచున్నది. మహాత్ములు తద్దర్శనార్థము సన్నద్ధులైనారు. ఇఁకలెమ్ము. నీకు శుభమగుఁగాక!

ఇతరులను, ఇతరదేశీయులనుగూడ అతులవచనరచనాకౌశలమునఁ దేల్పవలసినవాడవు నీవు. మేల్కొనుము. నీకు శుభమగుఁగాక!—

సోదరా!

అద్దంకి
సుబ్రహ్మణ్యముగారు

# విజయ లేక విజ్జక

సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు

కాలగర్భమునంబడి యెందఱు కవయిత్రుల గ్రంథములు స్వరూపనాశనమై పోయినవో యెందఱు విద్వాంసురాండ్ర యశశ్చంద్రికలు కాలమబ్బులలో నజ్ఞాతవాసము నొనర్చుచున్నవో యొకపరి గీర్వాణవాణి వంక దృష్టిని బోనిచ్చి చూచినచోఁ దెలియఁగలదు. మనకుఁ బ్రస్తుతయగు విజయ లేక విజ్జకయను విదుషీమణి కూడ మీఁదితరగతికిఁ జెందియేయున్నది. ఈమె యేకాలమునాఁటిదో యీమె రచించిన గ్రంథమేదియో కూడ నిప్పటికిని దెలిసికొనుట చాలదుర్ఘటముగనున్నది.

ప్రాచీనాలంకారికుఁడగు దండ్యాచార్యుఁడు తనకావ్యాదర్శపు మంగళశ్లోకమున సరస్వతీదేవిని 'సర్వశుక్ల'యని స్తుతించెను. విజ్జక తన చమత్కారమును బ్రకటించుచు "నీలోత్పలదళమువలె నల్లనైన సరస్వతి యగు నేనుండుటచే దండి సరస్వతి సర్వశుక్ల యని చెప్పుట పొసఁగ"దని చెప్పికొనెను 1. దీనింబట్టి విజ్జకకు సరస్వతియను నామాంతరమున్నట్లు తేలుచున్నది.

విజ్జక రచించినవని ప్రసిద్ధములగు రెండుపద్యములు కవీంద్రకర్ణాభరణమునఁ గన్పించుచున్నవి. 2. ఆరెండు పద్యములును మమ్మటాచార్యుని "శబ్దవ్యాపారవిచారము" నందును "ధన్యాసియాకథయసి ప్రియసంగమేపి" అనుపద్యము "కావ్యప్రకాశము"నందును గన్పించుచున్నవి. 3. ముకుళభట్టాచార్యుని "అభిధావృత్తిమాతృక"యందు "దృష్టింహేప్రతివేశిని" అనుపద్యముకలదు. 4. మమ్మటాచార్యునికంటెఁ బ్రాచీనుఁడగు ముకుళభట్టు క్రీ. శ. 925 సం॥ ప్రాంతమువాఁడు కావున నీవిజ్జక క్రీ. శ. 850 సం॥ ప్రాంతముననుండెనని నిశ్చయింపవలయును. 5.

జల్హణకవి విరచితమగు సూక్తిముక్తావళియందు రాజశేఖరమహాకవి చెప్పిన యొకసూక్తి కానవచ్చుచున్నది. 6. మీఁదఁజెప్పఁబడిన విజ్జకయు నీవిజయయు నొక్కవ్యక్తియేయని యందఱు నొప్పుకొనియున్నారు. 7. ఇరువురికిని సరస్వతియను నామాంతరముండుట మీఁదివిషయమునకుఁ బ్రమాణమగుచున్నది. ఇందు విజయ కర్ణాటియనుటంబట్టి యీమె రెండవపులకేశి ప్రభువుయొక్క జ్యేష్ఠపుత్రుఁడైన చంద్రాదిత్య

---

1. చతుర్ముఖముఖాంభోజ వనహంసవధూర్మమ
మానసే రమతాంనిత్యం సర్వశుక్లా సరస్వతీ [కావ్యా 1-1]
నీలోత్పలదళశ్యామాం విజ్జకాంమామజానతా
వృథైవ దండినాప్రోక్తం సర్వశుక్లాసరస్వతీ [శార్ఙ్గధరపద్ధతి 180 పెం]
2. "ధన్యాసియాకథయసి ప్రియసంగమేపి" 298.
"దృష్టిం హేప్రతివేశిని! క్షణమహాస్యస్మద్గృహే" 500
3. చూడుము. కావ్యప్రకాశము. చతుర్థోల్లాసము.
4. అభిధావృత్తిమాతృక. నిర్ణయసాగరప్రతి. పుట 12.
5. See History of Alankara Literature by P. V. Kane; Introduction to His Sahityadarpana Edition, P X L
6. సరస్వతీవ కర్ణాటీ విజయాంకా జయత్యసౌ
యావైదర్భగిరాంవాసః కాళిదాసాదనన్తరమ్.
See శార్ఙ్గధరపద్ధతి. 184.
7. Vide Nerur Plates and Kochreni Plates.
I. A. Vol 7, P 163, ఇం V. 8. P. 45.

మహారాజుయొక్క రాణియని చెప్పుచున్నారు. రెండవపులకేశి ప్రభువు క్రీ. శ 660 సం. ప్రాంతీయుఁడగుటచే విజ్జకకూడ నప్పటిదేయని కొందఱు నిశ్చయించుచున్నారు.

ఏదియెట్లున్నను విజ్జకయను నొకగీర్వాణకవయిత్రి ప్రాచీనకాలమున నుండెననియు నామె కవిత్వము చాల సరసమయియుండెననియు నిశ్చయింపవచ్చును.

"ధన్యాసియాకథయసి" "దృష్టిం హే ప్రతివేశిని" అను నీపద్యములు చాలరసవంతములను సంశయము సహృదయవేద్యము. అలంకారగ్రంథములయందుదాహరింపఁబడిన యీపద్యములం జదివినపుడు వీనికర్తృత్వ మంగూర్చి విచారింపవలెనను నుత్సాహమును నింతటి సరసములును స్వభావవిలసితములునగు పద్యములు స్త్రీకర్తృకములేయైయుండవలయునను నిశ్చయజ్ఞానమును నాకుఁగల్గినవి. తదనుసారముగఁ గొంతకాలమునకియ్యవి స్త్రీకర్తృకములను ప్రమాణముకూడ మీఁదికిని లభించినది. స్త్రీలాడుకొను చమత్కారప్రసంగములను నిరూపించుటలో వారికేగాని పురుషుల కంతటి నేర్పుతనముండుట దుర్ఘటము. ఇదివఱలోఁజెప్పిన "నీలోత్పలదళశ్యామా"మ్మను పద్యముకూడ నామెకుఁగల భాషానైదుష్యమును జాటఁగలదు. విజ్జక రచియించిన గ్రంథమేదియో యాగ్రంథము యద్విషయమైనదో కూడఁ దెలిసికొనుట చాలదుర్ఘటము. ఆవిషయమై యింకను బరిశోధనలు సల్పవలసియున్నవి. దశరూపకాదులలోఁగూడ మీఁదిపద్యములే యుదాహరింపఁబడియున్నవి గాని పద్యాంతరములేమియు లభించకున్నవి.

N. B. విజ్జకచే రచింపఁబడిన పద్యములు రెండును నాభాషాంతరీకరణములతోఁగూడ సందర్భప్రదర్శన పూర్వకముగ నిచట లిఖించుచున్నాను. వానియందలి విషయమునుబట్టి విపులముగ వానిని నిరూపింప నవకాశములేకపోయినది.

శ్లో. ధన్యాసియాకథయసిప్రియసంగమేఽపి
విస్రబ్ధచాటుకశతాని రతాంతరేషు
నీవీం ప్రతిప్రణిహితే తు కరే ప్రియేణ
సఖ్యశ్శపామి యదికించిదపిస్మరామి.

గీ. పడఁతి! సంగమమున నాథుపటిమఁదెలియఁ
జేయుచుండుటధన్యవు; చెప్ప కేమి
నావిభుఁడు వల్వముడివంటి నాఁడొ లేదొ
ఒడలఁదెలివన్నదున్న నొట్టిడుదునమ్మ!

[స్త్రీలందఱును గూడుచుండి వారివారి పడకటింటిరహస్యములు చెప్పుకొనుచున్న సమయమున నొక లేమ తననాయకుని బొగడుచు నేమేమో చెప్పఁగా నీకంటెనానాథుఁడే నేర్పరియను నభిప్రాయమును మనమున నిడికొని యొకవనిత చెప్ప సమాధానమిందుఁగలదు.]

శ్లో. దృష్టిం హే ప్రతివేశిని! క్షణమిహాప్యస్మద్గృహే దాస్యసి
ప్రాయేణాస్యశిశోః పితానవిరసాః కాపీరపః పాస్యతి.
ఏకాకిన్యపియామితద్వరమితః స్రోతస్తమాలాకులం
నీరంధ్రాస్తనుమాలిఖన్తు జరఠచ్ఛేదానలగ్రంథయః.

చ. పొరుగుబడంతి! నీకగునుపున్నెము చూతువె? ఒక్కమాఱిటే
చిరుతనితండ్రి చేదగుట 'నీ' యని రోయును నూతినీటి నొ
క్కరితెనయ్యు శుద్ధజలకాంక్షనె దూరమునున్న యేఁటికే
నరిగెదఁ జెట్లముండ్లుపడి నంగము చేరిన జీరనిమ్మటన్.

[వెలిచవులువములఁగిన యొకయువిద నీటినెపమునఁ జీకటిచెట్లుకలనదికేఁగుచు ముందు నెలువడు తన తప్పు నిప్పటినుండియుఁ గప్పిపుచ్చుట యిందుఁగానవగును.]

# ప్రేమ

శెట్టిపల్లి వేంకటరత్నంచౌదరిగారు

ప్రేమ గభీరము. అగాధము. ప్రశాంతము. వర్ణనాతీతము. జగద్బాంధవు డుదయగిరిశిఖరి నధిష్ఠించుచున్నాడు. చరణవిహీనుడగు యనూరుడు శప్రుసహితుడై రథము నాయత్తముజేసి సూర్యభగవానుని పాదసరోజముల చెంతనుంచుచున్నాడు. కమలములు ప్రఫుల్లమందహాసనయనముల నివాళి యొసగుచున్నవి.

కురంగము సజలనయనయై చింతాభరమున పదింపదిగ నాకసమును వీక్షించుచు మాటిమాటికి తనపాదములచే భూభాగమును నొవ్వజేయుచు మృతి నందిన తనప్రియురాలి ధూళిధూసరితమూర్ధమును మూర్కొనుచున్నది.

శయనించియున్న తనమాతృదేవి యెదురొమ్ములపై నెక్కి గంతులు వేయుచు యొకపరి యామె స్తనములపై నున్న పయ్యెదను దొలగించుచు రవికెను తన చిన్నిహస్తముల లాగుచుకొట్టుచు చనవున గంతులువేయుచున్నా డాబాల మూర్తి.

ప్రాణిసముదయ "మంబా అంబా" యని అరచుచు దిక్కులుజూచి మోర లెత్తి వాపోవుచున్నవి. కాలయమునిరీతి దండధరుడై యొకభయంకరమూర్తి తన కరాళవదనమునెత్తి మాతృప్రేమకై తహతహలాడుచున్న నాయమాయక జంతుకోటిని మాటిమాటికి కర్రనుసారించుచు అదలించుచున్నాడు. ఇంతలో దేవతాస్వరూపుడు నిరాడంబరమూర్తి వదనతలమున ప్రజ్వలించుచున్న తేజః పుంజములచే దర్శనీయుడై యున్న నొకవ్యక్తి యకస్మాత్తుగ గోచరించినాడు. కృపణుడగు నాదండధరుడొక్కయుదుటున తనపాపముల క్షమించుడని పాదములపై నొరిగినాడు. చరణములబడిన నాదీనుని తనహస్తపల్లవములనంది "వత్సా! నీపాపములు క్షమించబడినవి. భగవంతుడు నీకు సద్బుద్ధిని ప్రసాదించుగాత" యని దీవించినాడు.

ఓహో! ఏమి యాదృశ్యము? ఆమహాపురుషుని బాహువులమధ్యనిరికి ఆయన ముఖమండలమును నిరీక్షించుచున్న దామేషము.

ఆహా! వీటియంతరములమధ్య నిండి నిబిడీకృతమైయున్న పరమరహస్య మేమి?

# కామమ్మ సహగమనము

శేషాద్రి రమణకవులు

౧

* ఇది నూఱుసంవత్సరముల క్రిందట యథార్థముగా జరిగినకథ. గోదావరిమండలములోని పిఠాపురమున వైశ్యకుటుంబములు పెక్కులుగలవు. అందు సదాచారము, సద్వర్తనము, పాపభీతిగల నుకపట్లవారివంశము ప్రథమగణ్యము. ఆకాలమున వచ్చిన ఘోరక్షామవశమునఁ బేరొందిన లక్ష్మయ్య వెంకమ్మయను పుణ్యదంపతులు ఏండ్లునిండని పసికూనయగు కామమ్మనువిడిచి యిహలోకయాత్రముగించిరి. పెదతండ్రియగు రామన్నయుఁ బెద్దతల్లియగు వెంకమ్మయు సుతనిర్విశేషమగు ప్రేమతోఁ గామమ్మను బెంచి పెద్దదానిని గావించిరి.

కామమ్మ కులమునఁ బేదరాలైనను గుణమున పాటివారిలో మిన్న. తలిదండ్రులతోఁ బాటు పొలము పనులలోఁ బాల్గొనుచుఁ బెద్దలకడఁ బురాణకథల నాలించుచు వీలైనపుడు చిన్నిపుస్తకములుచదువుచుఁ జిన్నతనమునందే కామమ్మ గుణవతియని పేరొందెను. తలిదండ్రులులేనిబిడ్డయనియు, గుణవతియనియు, రూపవతియనియుఁ దోడివారామెనుగూర్చి గారాబమునఁ జెప్పుకొనుచుండిరి. కులవృత్తినెఱుంగక సేవాధర్మములతోఁ గాపురముచేయు నేమర్యాదస్థునకేని కామమ్మ నొసంగవలయునని తలిదండ్రులు తలంచిరి. అనురూపవయస్కుఁడు, సుస్వరూపి, మేనల్లుఁడునగు మారయ్యకుఁ గామమ్మనొసంగి మహావైభవముగఁ బెదతండ్రి వివాహము గావించెను. ఆవివాహసమయమునఁ గామమ్మకుఁ బదియేండ్లునిండెనో లేదో చెప్పఁజాలము. అవ్యాజమగు ప్రేమతో, అవ్యక్తమగులజ్జతో, అనన్యమగు నానందముతో నాదంపతులు సంసారబంధబంధితులైరి. సిగ్గెఱుఁగని కామమ్మ చిఱునగవుమొగముతో మారయ్యనుజూచి మహోత్సాహముతో దోగాటయందును, బంతులాటయందును, దాగిలియందును మిన్ననైతినని వాలుచూపులతో భావప్రకటనముగావించును. వివాహానంతరము దంపతులిరువురు తమతమ గృహములకుఁజేరి భవిష్యదానందజీవితార్థులై కాలముగడుపుచుండిరి.

౨

పామఱ్ఱకోటలోనున్న వైశ్యకుటుంబములలో మారయ్యకుటుంబము చాలగౌరవపాత్రమైనది. తరతరములనుండి యీవంశజులకు సేవకవృత్తియే జీవనము. కన్నులుదెఱవని పసికూనలగు మారయ్యను రెడ్డియ్యను బోషింపలేక వారితండ్రి మదరాసునకుఁ గొలువుచేయఁబోయి యచటనే గతించెను. నాటనుండి తల్లియగు చెల్లమ్మ కూలినాలిచేసి బిడ్డలను బెద్దవాండ్రగావించి తగిన సంబంధమని యన్నకూతురగు కామమ్మనిచ్చి మారయ్యకుఁ బెండ్లిగావించెను. మారయ్యనెట్లో యొకయింటివానినిగావించి గంపెఁడుబలగములో విడిచితిని. రెడ్డియ్య చిన్నవాఁడు. వానిసంగతి యన్నయే విచారింపఁగలఁడని చెల్లమ్మ తృప్తినొందెను. తల్లి పెద్ద

* కామమ్మకథయను గేయముననుసరించి యీకథ వ్రాసితిమి. గేయకర్తనామము తెలియదుగాని యిది యథార్థచరిత్రమనుట కనేకాధారములు గలవు. కథయందలి వ్యక్తుల సమన్వయించి చారిత్రరూపమున నీకథను సమర్థింపవలసియున్నది. సావకాశముగ నాపని నింకొకమాఱు జరుపఁదలఁచితిమి. కామమ్మకథవలె నాంధ్రనారీమణులగు లక్ష్మమ్మ, బాలనాగమ్మ, చిన్నమ్మ, తిరుపతమ్మ, నూకలమ్మ, ముసలమ్మ మున్నగు సాధ్వీమణుల కథలుకూడ గేయగ్రంథములనుండి విడదీసి చరిత్రానుకూలముగఁ గథారూపమునఁ బ్రకటించుట యత్యవసరము. ప్రజాభిరుచిననుసరించి యీపనికిఁ గ్రమముగఁ బూనుకొందుము.

తనమునఁ గూలివాలికిఁబోఁజాలదని మారయ్యయే కుటుంబభారమువహించెను. ఒకదినమున కాకినాడకుఁ బోయి మారయ్య కలక్టరునుజూచి తనకు బంట్రోతుపని దయచేయింపుమని కోరెను. నెలకు మూఁడువరహాల జీతముతో మారయ్యను కలక్టరు తనవెంటనుండు బంటుగాఁదీసికొనెను. స్వల్పాదాయముతో నొకపూట గంజిద్రాగి మిగిలిధనము కుటుంబమునకుఁబంపుచు నిలువుజీతపుఁజాకిరి యెన్నిదినములు చేసినను కలక్టరునకు మారయ్యయెడఁ కనికరముగలుగలేదు. ఒకదినమున మాటపట్టింపుమీఁద కలక్టరు మారయ్యను దుర్భాషలాడెను. అగౌరవపుబ్రతుకు నొల్లక వెంటనే మారయ్య తన యుద్యోగమునకు రాజీనామయిచ్చి తనకు రావలసిన యాఱునెలల జీతముగైకొని యిల్లుచేరెను. నాలుగుదినము లింట కాలముగడిపి మారయ్య తల్లియగు చెల్లమ్మదగ్గఱకుఁబోయి అమ్మా! కాకినాడనౌకరిమానుకొంటిని. తెచ్చిననాలుగురూకలు కర్చుపడుచున్నవి. ఇపుడే వేఱొకనౌకరి వెదకుకొనవలసియున్నది. చెన్నపట్టణమునకుఁబోయి నేను పటాలములోఁజేరెదను. పంపుమని ప్రార్థించెను. చెల్లమ్మ బొటబొట కన్నీరుగార్చి తండ్రీ! నిన్నువిడిచి నేనుబ్రదుకగలనా? చెన్నపట్టణపునౌకరి మనకచ్చిరాదు. మీనాయన నౌకరికిఁబోయి చెన్నపట్టణములోనె చనిపోయినాఁడు. అందుచే మనము దిక్కుమాలినపక్షులమైతిమి. కావ నీప్రయత్నము మానుకొమ్మని మారయ్యను బతిమాలెను. మారయ్య పట్టినపట్టువిడువలేదు. విధిలేక తల్లియంగీకరించెను. అప్పుడు మారయ్య ఒకతులసిమొక్కనుదెచ్చి తల్లికిచ్చి అమ్మా! నాపేర నీమొక్కనునాటి పోషింపుము. ఇది వృద్ధినొందిన నే క్షేమముగనుంటిననుకొమ్ము. ఎండిపోయెనా నేను మరణించితిననుకొమ్మని గుర్తుచెప్పి చెన్నపట్టణమునకుఁ బయనమయ్యెను. తల్లి బాష్పదృష్టితోఁ గుమారునిఁబంపెను. తమ్ముఁడగు రెడ్డియ్య కాకినాడవఱకువచ్చి యన్నయగు మారయ్యను పొగరోడయెక్కించి విచారముతో వెనుకకుమఱలెను.

3

మనకథాకాలమునాఁటికిఁ బొగబండ్లులేవు. పడవప్రయాణమునఁ గొన్నాళ్లకు మారయ్య చెన్నపురి చేరి పెద్దనాయనిపేటకుఁబోయి జోడునిమ్మపండ్లుగొని వాలీసు, మేలీసు అనునిరువురు తెల్లదొరలను సందర్శించెను. వారు మారయ్యకులశీలములవిచారించి యిరువదిమందిబోయిలపైఁ బెద్దబోయిగ మారయ్యను నియోగించిరి. నెలకైదువరహాలు జీతము. పొట్టకుఁబట్టకుఁబోను మిగిలినరొక్కము సామర్లకోటకుఁబంపుచు మారయ్య ఎటులో ఐదేండ్లుగడిపెను. చిరకాలప్రవాసముచే శుష్కించినఁదనహృదయమున జిగురుబుట్టునను నాశతో మారయ్య సామర్లకోటకేగఁదలంచి తమ యజమానుల సెలవడుగ వారు శ్రీరంగపురము బెంగుళూరులు ముట్టడులుముగిసినపిదపఁ గానియింటికేగ వీలుగాదనిరి. విధిలేక బెంగుళూరు ప్రయాణముముగించుకొని మారయ్య యధికారుల సెలవుకోరెను. దుబాసీ చెంగయ్య మారయ్యకురావలసిన ఆఱునెలలజీతమునిచ్చెను. మారయ్య బజారునకుఁబోయి తల్లికి బొమ్మంచుచీర, తమ్మునకు బొమ్మంచుచాపు, భార్యయగు కామమ్మకు అద్దాలరవిక, నిమ్మపండ్లచాయరవికగొని గృహోన్ముఖుండాయెను. చేతిలోనిరొక్కము కర్చుపెట్టఁజాలక మారయ్య కాలిబాటను బయలుదేరి యిరువదినాలుగవదినము సాయంకాలమునకు కాకినాడఁజేరెను. నాఁడు మారయ్యకు అఖండముగా జ్వరమువచ్చెను. కడుపునొప్పి యెక్కువయయ్యెను. ఉపచారములుచేయు దిక్కులేదు. ఎటులో మూఁడులంకణములుజేసి నాలుగవనాఁడు మారయ్య సామర్లకోటచేరి తానుదెచ్చినధనము తల్లికప్పగించి మంచమెక్కెను. దినదినము మారయ్యస్థితి యపాయకరముగ మారుచుండెను. ప్రాణముల యాసవదలి యంత్యసమయమునఁ దనయర్థాంగలక్ష్మియగు కామమ్మను జూడదలంచితినని మారయ్య తల్లితో విన్నవించెను. కుమారుని దురవస్థకుఁజింతిల్లు చల్లమ్మ తన యసహాయస్థితికేని జంకక వెంటనే చిన్నకుమారుఁ

డగు రెడ్డియ్యనుబిలిచి, కుమారా! మీయన్న మారయ్య మిగుల నపాయస్థితిలోనున్నాఁడు. ఒకమాఱు కామమ్మను జూడఁదలంచినాఁడు. ఆయమ పుట్టినింటనుండి వచ్చువఱకేని మారయ్య బ్రతుకునను నాశ నాకు లేదు. ఐన నేమి? నీవు పిఠాపురమునకుఁబోయి మీవదినె కీసంగతి తెలిపి వెంటఁగొనిరమ్మని పలికెను. రెడ్డి[illegible] గుండెలదరెను. మరణావస్థకుఁ జేరువలోనున్న మారయ్యనువిడువలేఁడు. తల్లిమాట జవదాటఁజాలఁడు. రెడ్డియ్య తనలో "మావదినెను ఏమివేడుకయని పిలుచుకొనివచ్చెదను. ఆమెకు అన్నయ్యదురవస్థ నెటుల విన్నవించెదను." అనుకొనుచు చద్దికట్టుకొని పెందలకడలేచి పిఠాపురమునకుఁ బయనమాయెను.

౪

రెడ్డియ్య మఱుసటిదినము సాయంకాలమునకుఁ బిఠాపురముఁజేరి వీథిలో మామయగు రామయ్యనుగలసికొని తనయగ్రజుఁడు వ్యాధిపీడితుఁడై మరణశయ్యయందుండుటఁ దెలిపి వదినెయగు కామమ్మను బంపుమని కోరెను. వారిరువురు మాటలాడుచు నింటికివచ్చుసరికి కామమ్మ గతరాత్రమునఁదనకు భర్తృవియోగము తటస్థించినటులఁ గలగన్నందులకుఁ బరితపించుచు నేకాంతగృహమునసుండెను. వీరిరువురు కామమ్మనుదరిసి స్థితినెఱింగించిరి. కామమ్మహృదయము చెదరిపోయెను. కల సత్యమయ్యెను. ఏనాఁడో పెండ్లిపీటలమీఁద దక్క భర్తను మరలజూచియెఱుఁగదు. అవశిష్టములుతీరినవి. ఇఁకభర్తయింటిలోఁగాలము సుఖముగా గడుపుదమనుకొనుసరికి బిట్టపిడుగువలె నీచిక్కుతటస్థించెను. కామమ్మగడగడవణకి తండ్రితోఁ దన్నుఁబ్రయాణము చేయుమనెను. రామయ్య విధిలేక యంగీకరించి పెద్దకోమటియింటికేగి యేఁబదిపరహాలు ఋణముదెచ్చి కామమ్మకు కోటబొమ్మంచుచీర, అందమైనరవిక, పెద్దకంచము, చెంబు, నత్తు, బన్నెసరము, పావటబొట్టు కొని సారెకొఱకుఁ గావలసిన ఫలాదులు భీమవరపుసంతలోఁగొని తెచ్చి కుమార్తెకొసంగెను. సారెలన్నియు సంతరించి మఱునాఁడు కామమ్మ పయనముకాఁబోవుసరికి అపశకునములెన్నియో యాయెను. ఇవియన్నియు లక్ష్యపెట్టినలాభములేదనియు, భవితవ్యము కాకమానదనియు గుండెరాయిజేసికొని పెద్దలకు నమస్కరించి కామమ్మ అత్తవారింటికి బయలుదేరెను. బంధుగులందఱు చాలదూరమువచ్చి కామమ్మను వీడ్కొలిపిరి. కామమ్మ ప్రయాణాయాసమునననుభవించుచు నత్తవారింటికిరాఁగా చూడవచ్చినవారు తుమ్మిరి. వెంటవచ్చిన సారెకావడుల నింటదింపించి తెచ్చినసారెలోఁ గొంత యత్తగారికొసంగి కామమ్మ భర్తక్షేమమునుగోరి మఱునాఁ డట్లతద్దినోము నోఁచెను. శాస్త్రవిధిననుసరించి వ్రతము సక్రమముగా నిర్వహించి వ్రతకథవిని యక్షతలుగైకొనుసరికి ఇంటిలోఁగొల్లుమనిరి. కామమ్మ ఇంటిలోనికివచ్చి చూచుసరికి మారయ్య కవపానముచేరువయయ్యెను. కనులుతిరిగిపోయెను. కామమ్మ యాదుస్థితిఁజూచి నిలువునీరైయిట్లువలవించెను: 'ప్రాణేశ్వరా! ఈడుతోడుగ నుద్[illegible]ంటిని. ఈడుతోడురూపునూపి మరణించితివా? పాపపుబ్రహ్మ మనబ్రదుకు పాడుజేసెగదా! నాకంఠ[illegible]ముగట్టినసామీ! పుట్టినింటనైదేండ్లనుండి పడియుంటినేగాని యెన్నఁడు నీయండఁ జేరనైతిని. ఇంక నాకుగతియేది?" కామమ్మయేడ్చి ఫలమేమని ధైర్యముదెచ్చుకొని దొడ్డిలోనికేగి తులసితెచ్చి బంధువులఁబిలిచి భర్తనుభూశయనముగావించి నారాయణస్మరణగావించుచుఁ దులసితీర్థము విడుచుచుండఁగనే మారయ్య మరణించెను. రెడ్డియ్య చల్లమ్మ నేలబట్టియల్లాడసాగిరి. కామమ్మ కొంచెము నిర్ఘాంతపోయినట్లు పడి తెప్పరిల్లిలేచి 'అత్తా! విచారింపకుము. మఱదీ! యేడ్చినసేమిఫలము? చచ్చినవారురారు, ఊఱడిల్లు'మని బుజ్జగించెను. అనంతరము కామమ్మ భర్తతోసహగమనముగావింప బంధువులనాజ్ఞవేఁడెను. రెడ్డియ్య [illegible]నెనుజూచి అమ్మా! కామమ్మా! చచ్చినవారితోఁ జావఁగలమా! మాయన్నను బెండ్లాడితివిగాని సంసారసౌఖ్యములనుభవించి యెఱుఁగవు. నిన్ను మేము అన్నకుమారునిగాభావింతుము, నీకన్నవస్త్రములకుఁ గొఱతఁ రానీయము. ఈవట్టిసహగమనయత్నము మానుకొమ్మని బుజ్జగించెను. కామమ్మ రెడ్డియ్యమాటలు సరకు

గోనక విధవనై బ్రదుకఁజాలను. నేఁడుపోగకున్నఁ బదిసంవత్సరములకైని గుండమునఁ బడకమాననని స్పష్టముగాఁజెప్పెను. బంధువులు బదులుచెప్పనోపక కామమ్మనుఁజూచి అమ్మా! ఇదికంపినీవారి పరిపాలనము. కాకినాడలోని కలక్టరు, సామర్లకోట కెప్టెను అనుజ్ఞయిచ్చినఁగాని సహగమనము జరుపనీలుండదు. ముందు సెలవు సంపాదింపుమని పల్కిరి. బ్రదుకుదానికి భయముగాని చావఁబోవుదానికేమి భయమనిపలికి రాణి నాగమ్మగారిసెలవు బడయ రాజమందిరమునకు కామమ్మ బయలుదేరెను.

౫

తొలుత కామమ్మ సామర్లకోటరాజ్యమునకు రాణిగానున్న నాగమ్మదొరసానిని దర్శించి సహగమనమునకు అనుజ్ఞయిమ్మని ప్రార్థించెను. ఆమె కామమ్మను బుజ్జగించి చచ్చినవారితోఁ జావఁగలమా? నీమఱఁదియగు రెడ్డెయ్యను మాఱుమనువుగట్టుకొనుము. నీమగనిజీతమాతని కిప్పించెదను. రెండుకత్తులభూమి ఈనాముగా నిప్పించెదను. నామాటవిని సహగమనయత్నము మానుకొమ్మని నిర్బంధించెను. కామమ్మ యందులకు నండిపడి "దొరసానీ! మాకులమున మాఱుమను మేనాఁడును లేదు. నీదిమాఱుమనువుకులము. ఏడు మాఱుమనువులు మీకుఁగలవు. కాన నవసరమైనచో నీకూతురు రుక్మిణిని నామఱఁదికి మాఱుమనువుగట్టుము. అంతియగాని నాకీదుర్బోధచేయకుము. ఫలమనుభవింతువని పల్కెను. అంతలో రాణికి అఖండముగఁగడుపు నొప్పివచ్చి తన్నుకొనుచుఁ గామమ్మను శరణుగోరఁగా నామెకరుణించి వ్యాధినివారణముగా ననుగ్రహించెను. అంత నాగమ్మ సహగమనమున కాజ్ఞ చెన్నపట్టణములోనున్న కౌరలీయవలసినదగాన పోయితెచ్చుకొమ్మని చెప్పెను. కామమ్మగృహముచేరి భర్తృశవమునకు వలయునుపచారములు పూజాపురస్కారములు గావించి ఇంటిలో నొకమూల పదిలముగా శవమునుంచి మండలాధికారియనుజ్ఞ పడయుటకు కామమ్మ కాకినాడకు బయలుదేరెను. మఱేఁది, తక్కినగలచుట్టములు కామమ్మవెంట కాకినాడకుఁ బయనమైరి. అట్లొద్దకు వానలుకురియుటకలదు గావున నాఁడుమహావర్షముకురిసెను. భీమవరపుకాలువపొంగి పాఱుచుండెను. తన పాతివ్రత్యమాహాత్మ్యమున ఈతనెఱుంగని కామమ్మయేరుదాఁటెను. వెంటవచ్చినబంధువులును ఈఁది యేఱు దాటిరి. ఏడుగడియలప్రొద్దెక్కుసరికి కామమ్మ పరిజనసహితముగా కాకినాడచేరెను. వెళ్లుచునే కలక్టరు బంగళావద్దకుఁబోవ దుబాసి సోమన్నయెదురుగావచ్చెను. కొంతసేపటికి దుబాసి చెంగయ్యవచ్చి కామమ్మ వచ్చిన వృత్తాంతము నాలకించి కలక్టరునకు నివేదించెను. కలక్టరు సహగమనవార్తవిని యాశ్చర్యపోయి కామమ్మను పిలువనంపఁగా నామె యిట్లుచెప్పెను: "దొరగారూ! నాభర్త మారయ్య గతించినాడు. అతనితో నేను సహగమనముగావింప నిశ్చయించితిని. సహగమనముకొఱకు రెండిండ్లస్థలము నాకిప్పింపవలయును, సహగమనము మాకు దేశాచారము, రెండునిలువులలోతున గుండముత్రవ్వి అందుఁగలపవేసి తగులఁబెట్టి నూనె సిద్దెలు కుమ్మరింతురు. అందు దూకుటయే సహగమనము. మాకులాచారమగు నీసహగమనమునకు సెలవిండు." కామమ్మ కోరికను కలక్టరు తృణీకరించి నీవుమాఱుమనువు కట్టుకొమ్ము, వివాహమునకగుకర్చు లిచ్చెదనని పల్కెను. కామమ్మ కోపించి చెవులుమూసికొని దొరా! నీవుచచ్చినచో నీభార్యను మాఱుమనువుగట్టుకొమ్మనుము. నీకూతురుకు మాఱుమనువు కట్టుము. నాకుఁజెప్పుటకు నీవెవఁడవు? శక్తియున్న సహగమనమున కాజ్ఞయిమ్ము. చేతగాకున్న చచ్చినటులుండుము. మించిమాటలాడిన నీతల బద్దలైపోవునని పలికెను. కలక్టరామె సాహసవాక్యముల కదరిపడి నల్సవాయి తిమ్మరాజుకంటె నీమె యధికురాలా? నన్నెంతమాటలడిగినదని కోపించి కామమ్మను పారాలోనిలుపఁబెట్టించెను. కామమ్మ ఏడుదినములుపవాసముతో పారాలో నేయుండెను. ఆమెదేహము మిసమిసలాడుచు నూతనకాంతితో నుల్లసిల్లెను. ఇదియంతయుఁజూచి కలక్ట

రాశ్చర్యపడి రెడ్డయ్యనుపిలిచి మారయ్యశవ మేమైనదియనియడుగ నాతఁడు వదినె కామమ్మయానచొప్పున నింటఁదాఁచితిమని చెప్పిరి. వెంటనే కలక్టరు సామర్లకోటలోనున్న కొత్వాలు నరసయ్యకుఁ దనదుబాసీచేత మారయ్యశవమును దహనము చేయింపుమని యాజ్ఞాపత్రము వ్రాయించిపంపెను. కొత్వాలు నరసయ్య జాము చూచి కామమ్మయిల్లు పగులగొట్టించి మారయ్యశవమును బయటికిఁదీయించెను. నాటి కిరువదినాలుగురోజులు దాటినను కామమ్మ పాతివ్రత్యమహత్త్వమున శవము యథావిధిగానుండెను. తత్క్షణమె కొత్వాలు నరసయ్య గ్రామవాసులసహాయముతో మారయ్యకళేబరమునకు యథావిధిగ నగ్నిసంస్కారము గావించెను.

౬

సామర్లకోటలో భర్తశవమునకు అగ్నిసంస్కారము చేయుసమయమునకుసరిగా కాకినాడలో కామమ్మ నిర్జీవయయ్యెను. వైద్యులు పరీక్షించి మరణించినటుల నిశ్చయించిరి. దీర్ఘోపాసవశమున మరణించి యుండనోపునని కలక్టరుభావించి కామమ్మ కళేబరమును బంధువుల కధీనముగావించుచు జీవముండి బ్రతికిన సరి, మరణించినచో మారయ్యకళేబరముతో జతపఱచి దహింపుఁడని చెప్పెను. కామమ్మ యకాలమరణమునకుఁ బరితపించుచు ఆత్మబంధువు లామెదేహమును సామర్లకోటకు మోసికొనివచ్చుచు మార్గమధ్యమున మూఁడుక్రోసులదూరమునయున్న కొప్పరసోమన్నగుడియొద్దకుఁ జేరుసరికి కామమ్మ కెవ్వఁగేక వేసి లేచి కూర్చుండెను. బంధువు లాశ్చర్యపడి చూచుచుండ కామమ్మ యిట్లుచెప్పెను: "బంధువులారా! నాయాత్మ పరలోకమునకేగి మారయ్యనుజూచి యిపుడె బొందిలోఁజేరినది. నేను సహగమనముగావింప నావిభుఁడాజ్ఞాపించినాఁడు. త్వరగ సామర్లకోటకుఁ బయనముకావలయును." ఇట్లు కామమ్మపలికి యాగ్రామాధికారియగు పాపయ్యకు వర్తమానముజేసి సహగమనకుండిక నేర్పఱుపఁగోరెను. తానుకుంటివాఁడననియు, ఆఱుసంవత్సరములనుండి నడిచియెఱుఁగననియు, దొరతనమువారిసెలవుకావలయుననియు బదులుచెప్పిపంపెను. కామమ్మ దొరతనమువారిసెలవు తెప్పింపగలననియు నీకాళ్లుత్వరలో రాఁగలవు సహగమనము జాడరమ్మనియుఁ బాపయ్యకువర్తమానముజేసి సామర్లకోటకుజేరెను.

సామర్లకోట గ్రామబహిర్భాగమున మారయ్యకాష్ఠము కాలుచుండెను. సాధ్వీరత్నమగు కామమ్మ కాష్ఠముచుట్టు మూఁడుమాఱులుదిరిగి ప్రదక్షిణముముగించి మంటనొకజాము కౌఁగిలించుకొనెను. ఆసుభసమయమున కామమ్మనోటనుండి యప్రయత్నముగ నీమధురవాక్యరత్నములు బహిర్గతమయ్యెను:

"ఎంతచక్కఁగనుండె నీపూలవనము
ఎంతబాగానున్న దీజీవనము."

కామమ్మా! నీవు లోకోత్తరపుణ్యమూర్తివి. భర్తృసేవాపరతంత్రమగు నీజీవితము ధన్యము. త్యాగభూయిష్టమగు నీయాచరణము పరమపవిత్రము. ఆంధ్రజాతిత్యాగధురంధరమై తలయెత్తుటకు నీవంటి వీరకాంతారత్నముల దివ్యాశీర్వాదములేగదా ప్రధానకారణములు?

భర్తృచితికి నమస్కరించి కామమ్మయందుండి కొన్నియగ్నికణములేరి యొడిలోనుంచుకొనెను. వస్త్రముకాలలేదు. క్రొత్తపిడతనొకటితెప్పించి యందు కామమ్మ భర్తృకాష్ఠములోని యస్థికలు మున్నె సంతరించియుంచిన అగ్నికణములు జతపఱచి యొకరావికొమ్మతెప్పించి చితిలోఁబాఁదివేయించెను. నాలుగవనాఁటి కాకొమ్మ చిగురువేసి పెరుగసాగెను. మారయ్య యస్థికలుగలపిడత నారావికొమ్మకు వ్రేలాడఁగట్టి యల్లుజేరెను. పౌరులందఱీదృశ్యముగాంచి యాశ్చర్యపరవశులైరి. కామమ్మ గృహములో నొకభాగము శుద్ధిజేసి యచట దర్భపఱచి దానిపై బరుండఁబోవుచు బంధువులను బిలిచి చిడతాళములు వేయుఁడు.

నేను పిలుచునంతకును దాళములు తెఱువకుఁడని పలికి తాను లోపలఁ గొళ్లెములు వేసికొనెను. హరిహరి నారాయణా యను నస్పష్టస్వరము మాత్రము బయటనున్న వారలకు వినిపించెను. నిర్జీవప్రతిమవలెఁ గామమ్మ శయ్యఁ జుబుకొఱఁగెను. తలుపుసందులనుండి బంధువు లిదియంతయుఁ గని పెట్టి యెప్పుడు పిలుచునో యపుడు ద్వారము తెఱచుదమని వంతులవరుసను వాకిలిని గాచుకొనియుండసాగిరి.

## ౭

కామమ్మ స్థూలదేహము నిర్జీవమయ్యెను. పవిత్రతరమగు నాయమసూక్ష్మదేహము చెన్నపురిజేరి సెంటుజార్జికోటలోనున్న ఛార్లీసు, మేలీసు, పీపీసు అను దొరలకు కలలోఁ గనిపించి తనవృత్తాంతము భర్తమరణము కాకినాడకలక్టరు దండగము సహగమనవాంఛ నెఱింగించెను. అట్లే దుబాసీయగు నయనప్ప మొదలియారికలలోఁగూడఁ జెప్పెను. లాడుదొరవారి పత్త్రము అకారణముగఁ బచ్చబడసాగెను. రెండుమూఁడుదినము లిటులజరుగఁగా నాతఁడు విభ్రాంతుఁడై యిది భూతచేష్టకానోపునను కొనెను. నాటిరాత్రి కామమ్మ కలలో నిక్కివచ్చి "దొరగారూ! నేను దయ్యమును గాను. మీ పెద్దబోయిఁ యగు మారయ్య భార్యను. నా పేరు కామమ్మ. మారయ్య మరణించినాఁడు. సహగమనమునకుఁ గాకినాడకలక్టరు సెలవీయక నన్ను అగౌరవించినాఁడు. పన్నెండుదినములు నిర్బంధించినాఁడు. మీ సెలవుకొఱకు వచ్చితినని చెప్పుకొనెను. మరునాఁడు దుబాసీయు దొరలందఱుఁ గలసి ఫలాహారముగావించుతఱి తమకందఱకు వచ్చిన స్వప్నము నందఱుఁ గలియబలుకుకొనిరి. ఇంకను కామమ్మ సత్యము పరిశీలింపవలయునని వారలందఱు తలంచిరి. అప్పుడు లాడుదొర తనలో "నాతమ్ముఁడు మేడీసు దేశాంతరమేగి యాఱుసంవత్సరములు దాటినవి. వానిజాడ దెలియుటలేదు. ఎచటనున్నది యెప్పుడు వచ్చునది తెలిపినచో నీకు కోరికల సమకూర్తునని" యనుకొని శయనించెను. నాటిరాత్రి లాడుదొరకు స్వప్నములో కామమ్మ కనుపించి "నీతమ్ముఁడు శ్రీరంగపట్నముపకుఁబోయి దానిని జయించిగైకొని వాఁడు, ఆదివారమునాఁడు ప్రాతఃకాలము నీయొద్దకు రాఁగల"డని చెప్పెను. దొరమిగుల నానందించి యా తేది కాగితముపయి వ్రాసికొని సోదరాగమనమునకు నిరీక్షించుచుండెను. నాటిరాత్రి కామమ్మ శ్రీరంగపట్టణములోనున్న మేడీసుకలలోఁ గనుపించి మీయన్న లాడుదొర నీకొఱకు విచారపడుచున్నాఁడు. త్వరగఁ జెన్నపురికిఁ బయనముకమ్మని చెప్పెను. మేడీసు మఱునాఁడు శ్రీరంగపట్టణమునుండి బయలుదేరి నియతదినమునకు నుదరానుచేరి తనస్వప్నవృత్తాంతము అన్నకు జెప్పెను. లాడుదొర కామమ్మ యద్భుతచర్యల కానందించి పరుండ కామమ్మ మఱలఁగనిపించి నన్ను కాకినాడకలక్టరు చాలశ్రమపెట్టినాఁడు. ఆఁటంక పెట్టకుండు నటుల హుకుంపంపుమనియు సహగమనకుండమునకు వలయువస్తువులు మూఁడుకొయ్యలతో ఓడగట్టి సముద్రమున వేయవలసినది, నేను సామర్లకోట రేవునకుఁ జేర్చుకొందును, అని చెప్పుకొనెను. లాడుదొర కామమ్మ సత్యవర్తన కానందించి పంద్రెండు రేవులవారికి కామమ్మ సహగమనము చేయఁబోవుచున్నది ఆటంకపఱుప వలదని జాబులు వ్రాయించెను. కాకినాడకలక్టరునకుఁ బ్రత్యేకించి జాబు వ్రాయించెను. లాడుదొర మూఁడు కొయ్యలలో ఓడ సేర్పఱచి గుండమునకు వలసినన్ని మంచిగంధపుఁగట్టెలు, పసుపుకుంకుమ, నూనెపిడ్డలు వేయించి సముద్రములో విడిపించెను. కలాసులేకున్నను ఓడ తెల్లవారునరికి సామర్లకోట రేవుచేరెను. ఏడు దినములు గడిచినపిదప ఎనిమిదవనాఁడు కామమ్మ లోనిగొళ్ళెములుదీసి బైటనున్నవారితో వాకిలిగొళ్ళెములఁ దీయుమనెను. బంధుమిత్రులు గొళ్ళెములుదీసి కామమ్మనుదర్శించి యానందించిరి. చెన్నపట్టమునుండి దొరలొసంగినయాజ్ఞ గ్రామాధికారి కామమ్మకుఁ బంపెను. కాకినాడకలక్టరు అనుమతించెను. సామర్లకోట రేవుచేరిన యోడలోని సామానులు చుట్టపక్కములు తెచ్చి యుంటజేర్చిరి. కామమ్మ గృహముపెడలి మునుపు

చిన్నమ్మయను పంచమకాంత సహగమనము చేసినపుణ్యభూమిలో సహగమనకుండము త్రవ్వించెను. స్థలమునకు నెల యైదువరహాలు; త్రవ్విన యుప్పరులకుఁ గట్టుచీర, కడియాలు, రెండువరహాలుఒసంగెను. గుండములో లాడుదొర చుట్టుపట్లవారు పంపినకలపదింపిరి. సహగమనవార్త దేశదేశములకెగఁబ్రాఁకిపోయెను.

౮

కామమ్మ సహగమనము జూడఁదలంచి దేశదేశములనుండి ప్రజలువచ్చిరి. తాటిపాకసీమ, వెలనాడు, పాలనాడు, మన్నెము, గోదావరి పట్టె ప్రాంతమునుండి వేలకొలఁది ప్రజలు వేడుకఁజూడవచ్చిరి. చెన్నపురి నుండి తెల్లదొర లరుదెంచిరి. సహగమనక్షేత్రము ప్రజలతోఁ గ్రిక్కిరిసియుండెను. గుండమునఁ గట్టెలువేసి యగ్నిరగుల్కొల్పిరి. మంగళవాద్యము లఖండముగ మ్రోగుచుండెను. భర్తయస్థికలు గుండమునవేసి తాను దూకఁబోవుసరికి మాదిగవెంకఁడు కామమ్మపైకి ఎఱ్ఱమారిని బ్రయోగించెను. కామమ్మ యది గ్రహించి తెల్లదొరలకుఁ బ్రజలకుఁ జెప్పఁగా వారుపోయి మాదిగగూడెముముట్టడించి వెంకనిబట్టుకొనివచ్చి తప్పొప్పించి క్షమాపణముఁగోరించిరి. కామమ్మ వెంకని విడిచిపెట్టించెను. సహగమనోత్సవమునకు మంచాల వెంకమ్మయను బ్రాహ్మణకాంతవచ్చి జనసందృష్టములో మెడలోనినాను పాఱవేసికొనెను. వెంకమ్మయింటివద్ద అత్తమామలు శిక్షింతురని భయపడి యాదిక్కుమాలిన వేడుకకురాకున్న నావస్తువు నాకు దక్కెడిదిగదాయని యేడ్వనారంభించెను. కామమ్మ మంచాల వెంకమ్మ నోదార్చి అమ్మా బుద్ధిపూర్వకముగఁ బాఱవేసికొని పరులదిట్టిన ఫలమేమియని పలికి యావేడుకచూడవచ్చిన రాజమహేంద్రవరమునివాసియగు ముత్యాల రాజన్నను సమీపించి అయ్యా! రాజన్నా! నేను నీకుఁ జెల్లెలివంటిదానిని. నన్ను నిందలపాలు గావింపకుము. నీకు జమ్మిచెట్టువద్ద దొరికిననాను తిరిగియిమ్ము. కుచ్చెళ్ళలోనున్నమూట విప్పుమనిపలికెను. రాజన్న నివ్వెఱపోయి నాను కామమ్మకీయఁగా నాయమ వెంటనే వెంకమ్మకిచ్చివేసెను. ప్రజలందఱు కామమ్మ మహత్త్వమున కమితానందపరవశులైరి. తప్పుక్షమింపుమని వెంకమ్మ కామమ్మ పాదములపయి వ్రాలఁగా నీకచిరకాలమునఁ గొమారుఁడుదయించును. వానికి మారయ్యయని పేరిడుము. కుమార్తె పుట్టఁగలదు. ఆబిడ్డకు కామమ్మయని పేరిడుమని చెప్పెను.

అనంతరము కామమ్మ తెల్లదొరలను జూచి అయ్యా! నేను సహగమనముచేసిన మూఁడవనాఁడు గుండము పరీక్షించినచో నందు నాభర్తరుమాలు నా చేతిగాజులు బొందుతో మంగళసూత్రము పైజారు మారెడు చెఱఁగు కాలకయుండును. అందు మొలచిన తామరపూవుదీసి గుండము పూడ్పించి పందిరివేయించి యందుఁ బ్రతిష్ఠించి పూజాపురస్కారముల కవకాశముగలిగింపుమని కోరెను. దొరలందఱు నందులకంగీకరించి యట్లే చేయుదుమనిరి. కామమ్మ తటాకమునకుఁబోయి స్నానముచేసి మేళతాళములతో రాజవీథినివచ్చుచుండఁ బురవాసులందఱు హారతులొసంగుచు ఫలహారములు నివేదించుచు నాచరించిరి. పెదతండ్రి రామన్న యెదురుగావచ్చి కామమ్మను గౌఁగిలించుకొని చిచ్చులుకఁబోవకుమని పలువిధంబుల బ్రతిమాలెను. లాభములేకపోయెను. కామమ్మ తనసొమ్ములుదీసి గ్రామస్థులకొసంగి యనంతరము తనయర్చావిగ్రహమునకుఁ బూజలు సాత్వికరీతిగ నొనర్పుమని కట్టడిగావించెను. చూడవచ్చిన ప్రజలందఱకుఁ గామమ్మ నమస్కరించెను. దొరలు సలాములుగావించిరి. భగ్గున మండుచున్న గుండములో మారయ్య యస్థికలువేసి కామమ్మ గుండములో దుమికి జాముసేపు భాషించి పరలోకగతురాలయ్యెను. దొరలు మూఁడవనాఁడు చూడఁగ గుండమున నామె చెప్పినగురుతులు కనిపించెను. దొరలానందించి పందిరులువేయించి చెన్నపురికేగిరి. కాకినాడ కలక్టరున కుద్యోగముపోయెను. కన్నులుపోయెను. అతఁడు సామర్లకోటకువచ్చి కామమ్మ గుండమునుసమీపించి

కన్నులు, ఉద్యోగమువచ్చినచో కామమ్మకు మహోత్సవములు చేయింతునని మ్రొక్కుకొనెను. కామమ్మ లాడుదొరస్వప్నములోఁ జెప్పినందునఁ గలక్టరునకు మరలనుద్యోగమువచ్చెను. కనులుగూడవచ్చెను. కృతజ్ఞతాసూచకముగాఁ జేవతాడిచెట్లునఱికించి గొప్పపందిరివేయించి కలక్టరు యాలయముగట్టించెను. కామమ్మ యనుగ్రహవశమునఁ బాదములుబడసిన పాపయ్య కామమ్మకు ఉత్సవవిగ్రహములు చేయించి తొమ్మిదిదినములు జాగరణము మహోత్తరముగ బ్రాహ్మసమారాధనములుజరిపి పూర్ణిమనాఁడు రథోత్సవముజరిగించెను. పాపయ్య ఆలయముచుట్టు పుష్పవనము ఉద్యానవనమువేయించి యాత్రార్థులకు సౌకర్యములుకలిగించెను. తీర్థప్రజలవలె దేశదేశములనుండి ప్రజలువచ్చి యభిమతలాభములు బడయసాగిరి.

పంచాల వెంకమ్మ గర్భవతియై కుమార్తెను గుమారునిగని కామమ్మకుఁగృతజ్ఞతాసూచకముగఁ దూగుటుయ్యేల చేయించి యాలయమునకు సమర్పించెను. పతివ్రతాకులతల్లియు, పుణ్యమూర్తియు, గుణవతియునగు కామమ్మ యాడోలికలోనిమ్మపండువలె, అరటిపండువలె, ద్రాక్షపండువలె, మామిడిపండువలె వలరి వాటికి నేటికి నయ్యాలలూగుచున్నది. సామాన్యగృహమున జనించి త్యాగవశమున ఆంధ్రప్రపంచమున సుప్రసిద్ధురాలైన కామమ్మ దివ్యచరిత్రము వాఙ్మయమున శాశ్వతస్థాయిగఁగవులొనర్చిరి. శిల్పులామెదివ్య రూపమును జిత్రించిరి. గాయకులామెచరిత్రముగానము చేయుచుండిరి. నేఁటికిఁగూడ సామర్లకోట కామమ్మకతన నొకదివ్యక్షేత్రమైనది.

# కష్టములకోర్చనేని సౌఖ్యంబుఁగలదు

శ్రీమతి సామినేని హనుమాయమ్మ గారు

కాయకష్టంబుగా కఠినజాంగలభూమి
చేఁజేత సరిజేసి చెమటలూఱ
దినమురాత్రులనంగ దెలివిలోనాడుచు
ముచ్చెమ్మటల్ గ్రమ్మ నిచ్చనిల్చి
జూచువారల మది చోద్యమంది చెలంగ
పంటవలంతిని బాగుజేసి
కర్త దేవుఁడటంచుఁగని మదిలోనమ్మి
నెమ్మి సద్దానిని నిత్యమరయ
బంకుధాన్యంబు రత్నంపుపంటవోలె
నరయ లోకసౌఖ్యంబున కాటపట్టు
హాలికప్రవరుంకుఁ డా నవనిలోన
కష్టములకోర్చనేని సౌఖ్యంబుఁగలదు.
కన్నులనిద్దురగ్రమ్మి మేనుసెమర్ప
నొకకేల పౌత్రముఱ్ఱూతలాడ

జననీజనకమనోజనితదుర్ఘటకష్ట
నిష్ఠురోక్తులగుండె నిరుగాగ
నిసుకపాతరపోల్కె నేఁదగ్గుతలపులు
దామరతంపరై తగిలియుంపఁ
గడకు బి యే బియల్ గాఁ గృతకృత్యుఁడై
పరిపూర్ణధనవృద్ధిప్రౌఢుఁడగుచు
గన్నవారలు దనుగని నెన్నరాని
సంతసంబునఁ దేల సంసారియగుచు
సత్యధర్మాభిరతి నార్తజనులఁబ్రోచు
కష్టములకోర్చనేని సౌఖ్యంబుఁగలదు.
దుష్టత్వముఁ బోనాడి వి
శిష్టపథంబునను సమతచే భూతాళిన్
తుష్టుఁడై మనుప బూనెను
కష్టంబునఁగల్గుసుఖము ఘనపుణ్యులకున్.

# మాతృప్రేమ

శ్రీమతి తాయి రోజాకృష్ణవేణిగారు

ఆమె నివాస మొకపర్వతాగ్రకుటీరము.

ఆనాడు గాలి హోరునవీస్తోంది.

వానతుంపర కొంచెము కొంచెముగా పడుతోంది.

కన్నులుపొడుచుకొన్నను కానరానికటికచీకట్లో ఉఱుములు భయంకర ధ్వనులతో ప్రతిధ్వనిస్తున్నాయి.

ఆకొండలోయల్లోనుండి ఆపర్వతాగ్రశ్రేణిలోనుండి బయలుదేరిందామె బందుగుల ఇంటికెళ్ళిన తల్లిని తోడ్కొని రావటానికి. ఆవేదనతోటి, భయముతోటి త్వరత్వరగా నడుస్తోంది.

ఇంతలో వర్షం ప్రబలమైంది.........

తల్లి వంటరిగా ఇంటికి చేరుకొన్నది.

ప్రియపుత్రికాముఖసందర్శనము కాకపోయేటప్పటికల్లా హతాశయై పోయిందామె.

ఆ ఉఱుముల ప్రతిధ్వనితో గుండెలు వ్రయ్యలవుతున్నా, చీకట్లో కళ్లు కానరాకున్నా ఆఝంఝామారుతంలో, ఆమెఱుపులక్రీనీడలో ఉద్వేగపూరితమైన హృదయంతో బయలుదేరిందామె కూతును గొంతెత్తిపిలుస్తూ.

ఆభయంకరకాళరాత్రియందు చెట్టనక, పుట్టనక గాలించింది.

కాని లాభంలేకపోయింది.........

చిట్టచివరకు గుర్తించిం దొకప్రవాహమెడ్డున కూతునడుగుజాడలను.

ఆనందంతో వాటివెను వెంటనే తడుముకొంటూ బయలుదేరింది.

అవి వంతెనమధ్యలో ఆగిపోయినాయి......

మరుక్షణంలో ఆనందమంతా దుఃఖంలోకి మారిపోయింది.

"ఇంకేటిబ్రతుకు తల్లీనాది? నీవ్వూచేనూగలసి భగవానుని సామ్రాజ్యంలో అనిర్వచనీయానంద మనుభవిద్దాం" అంటూ ఒళ్లుతెగిపాఱుతూన్న ఆప్రవాహంలో గుభాలున ఉరికింది.

ఇంకేముంది?.........

ఆభయంకరకాళరాత్రి ప్రళయరాత్రైపోయింది.

# ప్రేమలోని కాఠిన్యము

కనకదండి గోపాలకృష్ణశాస్త్రి గారు

మధుకి ఆరోఏడు. సీతకి ఏడోఏడు. ఎంతో స్నేహంగా ఉండేవారు. చిన్నగానులు తోడుక్కొని కలిసి ఆడుకుంటూ వాళ్ళతల్లులకెంతో సంతోషంకలిగించేవారు.

ఓరోజున మధు చేగోణీలు, సీత మిఠాయిఉండలు తెచ్చేరు. అరుగుమీద బువ్వాలాటకి లక్కపిడతలు తెచ్చి వంటలుప్రారంభించారు ఇద్దరూను.

వంటచేసేటప్పుడు మధు కొంచెంమిఠాయి ఎక్కువతినేది. సీత చూడలేదు.

ఓమాటు చూచింది సీత. కోపంవొచ్చి "నాకుమిఠాయీవొద్దు ఏమీవొద్దు అంతానువ్వేతినవే. నేవెళ్ళిపోతానులేవే" అంది.

"ఇంకతిననులేవే. సరదాగా ఆడుకుందాము. వెళ్ళిపోకే, రేపునేనెక్కువ తీసుకువొస్తానే" అని బ్రతిమాలింది సీతని ఎంతో మధు.

"నాకేమీవొద్దులే" అని వెళ్ళిపోబోతోంది సీత.

"ఇదంతానువ్వేతినవే. నేతిననేఇంక. వెళ్ళిపోకే ఆడుకుందాము." అంది మళ్ళీమధు.

సీతముందుకివెళ్ళింది. మధు సీతచెయ్యి గట్టిగాపట్టుకుని "వెళ్ళకే ఆడుకుందాము" అంది. సీత వొదిలించుకొనివెళ్ళింది. మధు "వెళ్ళిపోకే ఆడుకుందాము" అని ముందరజుట్టుపట్టుకుని ముందుకులాగి కూర్చోపెట్టింది.

సీత గొల్లునఏడ్చింది. "ఎందుకే ఏడవటం? ఏంచేశానే ఆడుకుందాం వెళ్ళకే" అందిమధు. సీతగొల్లున కన్నీళ్ళుకారుస్తూఏడ్చింది. మధుకికూడా ఏడుపువచ్చింది. కన్నీళ్ళుకారుస్తూ "ఆడుకుందాము ఏడవకే" అంది.

ఇదంతా కిటికీలోంచిచూస్తూన్న సీతతల్లి వాళ్ళదగ్గరకువచ్చింది. ఇద్దరూ అశ్రులురాలుస్తూ అలాగేఉన్నారు. ఇద్దరినీదగ్గరకుతీసి ముద్దాడి "కొట్టుకోకుండాఆడుకోండి మరి" అంది.

"ఆడుకొందామంటే రావడంలేదు చూచావా?" అందిమధు. సీతతల్లి మిఠాయిఇద్దరికీపెట్టి ఆడుకోండివెళ్ళిఅంది. ఇద్దరూ నవ్వుతూ ఆడుకోడానికి వెళ్ళిపోయారు.

# సీతాపారిశుద్ధ్యము

ఒంగోలు పద్మరాజుగారు బి. ఏ.

సదా శ్రీరాముని వెంట ఛాయవలె ననుచరించుచుండు సీతాదేవిని రాముడు తనతో నడవికి బిలుచుకొని పోవ నిష్టపడనట్టుల కొంతగ్రంథము అయోధ్యాకాండమందు గానవచ్చుచున్నది. అట్టియెడబాటును సహింప నోర్వనిదయి యెట్టికష్టములకైన నోడిగట్టి భర్తతో బాటు తానును యడవికిబోవ నిశ్చయించుకొనిన సీ యనేకవిధముల రాముని వేడుకొనినను యాతడు విముఖుడైనట్టుల యగపడెను. ఒకపరి దేవి యాతని "స్త్రీయం పురుషవిగ్రహము"ని యుపాలంభనోక్తియు జేసినది. విషము బుచ్చుకొనెదననినది. అటను ఆమె యభీష్టము సిద్ధించనట్టుల లేక:—

i "ఈర్ష్యారోషౌ బహిష్కృత్య భుక్తశేషమివోదకం ।
నయమాంవీరవిస్రబ్ధః పాపంమయినవిద్యతే" ॥

యనితనపారిశుద్ధ్యమును పురస్కరించుకొని యుద్ఘోషించినది. అంతట రాముడామెను వెంటబెట్టుకొని పోవుటయు అవలజరిగిన విషాదవృత్తాంతమును యెల్లరకు దెలిసియేయున్నది.

వైవాక్యమున తాను మహాపరిశుద్ధురాలనియు పాపరహితురాలనియు పుణ్యశ్లోకుడును పవిత్రమూర్తి యునగు భర్తవెంట తానడవికిబోవ నర్హురాలనియు సూచించినది. అప్పటికి శ్రీరామునికి సీతాపారిశుద్ధ్యముంగూర్చి యామెమాటయే చాలినది.

సీతాహరణానంతరము యామె లంకలోనుండ హనుమంతునితో మాట్లాడుచుతే "రాముడేల నాయెడల నిర్దయుడైయున్నాడు. రావణునివధించి నన్నేల చెరవిడిపించి తీసికొనిపోడు. ii యెదుటనుండి నచో ప్రీతిగాబోలు" నను మొదలగు విలాపములజేయుచు "అంతరాత్మా హి మే శుద్ధః" iii అనియు తనపారిశుద్ధ్యమును నొక్కిచెప్పినది.

రావణవధానంతరము విభీషణాదులు సీతాదేవిని రామునిసన్నిధికిం గొంపోయి యర్పింప:—

iv "కః పుమాంస్తు కులే జాతః స్త్రియం పరగృహోషితాం। తేజస్వీ పునరాదద్యాత్" అని నిర్దయుడై నిరాకరించినంతట ఆమహాసాధ్వి నిజపారిశుద్ధ్యస్థాపనమునకై చితిం జేర్పించి యగ్నిముఖమున ప్రవేశింపగా లోకసాక్షియు సకలకల్మషపావకుడునునగు అగ్నిదేవు డాపవిత్రురాలిని యంకమునగూర్చుండబెట్టుకొని చితిమధ్యమునుండి యుద్భవించి, v "ఏషా తే రామ వైదేహీ పాపమస్యా న విద్యతే" యని సాక్ష్యమిచ్చుచు vi "విశుద్ధభావాం నిష్పాపాం ప్రతిగృహ్ణీష్వ రాఘవ" యని సీతనంగీకరింప జేసెను.

ప్రస్తుతసందర్భమున వాల్మీకి గొప్ప నేర్పరితనమును జూపియున్నాడు. ప్రథమమున సీత "పాపమ్మయి న విద్యతే" అనినపుడు ఆమె పారిశుద్ధ్యమున కామెయే ప్రమాణమయినది. రెండవమారు "అంతరాత్మా హి మే శుద్ధః" అనినపుడు అందుకుదగిన సాక్ష్యమీయగల సాక్షాద్రామదూతయు పరమభక్తుడును యగు హనుమంతుని సాక్షమయినది.

---

i "త్రాగగ మిగిలిన నీళ్లవలె ఈర్ష్యారోషములను త్రోసివేసికొని ఓవీరుడా! ఆత్మధృతికలవాడవై నన్ను వెంటతీసికొనిపొమ్ము. నాయందు పాపమేమియు లేదు."

ii దృశ్యమానే భవేత్ ప్రీతిః సౌహార్దం నాస్త్యపశ్యతః

iii నాయంతరాత్మ శుద్ధమయినది.

iv "పరుని యింటియందు నివసించుచుండిన స్త్రీని గొప్పకులములో పుట్టినట్టియు తేజస్వంతుడయినట్టియు ఏపురుషుడయినను తిరుగ చేబట్టునా?"

v "ఓరాముడా, యీ వైదేహి నీయది. ఈమె వలని దోషము లేదు."

vi ఓరాఘవుడా! విశుద్ధమనస్కురాలైనట్టియు పాపరహితురాలయినట్టియు యీమెను గ్రహింపుము.

కడపట యుపసంహారభాగమున లోకపావకుడు సాక్ష్యమిచ్చుచు ఆమె పారిశుద్ధ్యమును స్థాపించెను. శ్రీరాముడును

i "విశుద్ధా త్రిషులోకేషు మైథిలీ జనకాత్మజ" యనుచు యామె నంగీకరించెను.

ఒక్కొక్క విషయమునను శ్రీమద్రామాయణమున నిట్టి యద్భుతములగు యుపక్రమోపసంహారములు, వాల్మీకిరచనానైపుణ్యమును, కథాప్రాశస్త్యమును ప్రకటించుచున్నవి. ఇట్టి రామాయణము భరతఖండమునకు కులధనమనవొప్పనుగదా.

i జనకాత్మజయగు సీత మూడులోకములయందును మహాపరిశుద్ధురాలు.

# జాళ్ళకమ్మలు: విద్యార్థినీవిచారము *

శ్రీ క్రియాశక్తి

గీ. పోయినవి జాలకమ్మలు పుణ్యదివస
మనఁదగిన శనివారదినాన, నింట
స్నానమొనరించుచుండి యేస్థానమందు
నుంచితినొ కాక, యెవరు హరించినారొ!

గీ. కలరు పలువురువిద్యార్థినులు గృహాంత
రమున బాలలు-ప్రౌఢలుఁ-బ్రాఁతవారుఁ-
గ్రొత్తవారలు, నందు నేకొలఁదిరూపిన
లెత్తికొనినారొ! తెలియరాదట్టిజాడ.

గీ. నాకనుఁగు నేస్తగత్తె, కన్నాకు చెలుల
కెందు, కలసైన దబ్బుల తెలుఁగఁబోని
దాన యనినమ్మి, నావస్తుజాలమెపుడు
నొక్క పాలఁతివశమ్మున నుంచుదాన.

గీ. ఆమె, యాజాలకమ్మల నాత్మనమ్మ
చేకొని, తనంతఁ బెట్టియఁ జేర్చినట్లు
తెల్పె; నం దవియెందును దెలియరావు
మందస త్రిమ్మఁగనో, వాని చందమేమొ!

గీ. పంటగత్తెకుఁ జెలికిని నంటుచెడని
చుట్టరికమఁట! యామెయో గుట్టుకీడు,
ఇట్టి చెట్టలకెల్ల త్రేవెత్తిచూపఁ
దగుమిటారి. తంటారియై తగిలెనోటు!

గీ. మానవతిగృహనాయిక, భావవీథి
నెవరిపై నెపుడులేని యహీనరక్తి
నూని, సంశోధనకుఁ బూని, కానివారి
నతుల మానహీనవచోదవాగ్ని వేల్చె.

గీ. అరసె నెల్లర పెట్టెల నంబరముల;
నడిగె జ్యోస్యుని; పిచ్చిబియ్యంబు వెట్టె
'దొంగ కుష్మాండవృత్తి యెసంగు' నంచు;
నంతఁ బోవక యొక బీదరాలి నంటె.

గీ. 'తలఁపు తెఱఁగొందు మాటలదారియొండు
చెడ్డు వేఱొండుఁగాఁగఁ గుత్సితపుసరణి
మూలి † గా నెప్ప వర్తించు కూళవీవ
తొడవులు హరించి' తని పెద్ద దూఱఁదొడఁగె.

గీ. అంజనపుఁగప్పుఁజూడ వీరాంజనేయుఁ
డందు మూర్తిభవించి, సాక్ష్యముపల్కె-
'దీన, పొడుగరి, పలుచని చాన-మిగులఁ
దెలిమొగముఁగలది, దుడుకు తీసె' నంచు.

గీ. మందిత లబ్బురమంది 'రీముచ్చు కొంగము
సొమ్ము మాటినదనుట నిక్కమ్ముగాదె?
దానిఁ గ్రక్కించకున్న నాయాన మాన
నే' ననుచు నింటిపెద్ద ఘోషించి మించె.

గీ. 'బడికి నూరికి గురులకు బాలికలకుఁ
గ్రొత్తనయి యెల్లరకుఁ దుష్టిఁ గూర్చుకొఱకుఁ
బ్రీతివర్తించు నాకిట్టి పిట్టపిడుగె?'
యంచు నాబీదరాలు రోదించె మిగుల.

గీ. అయిదునాళ్ళట్టుగడచ నారవదినాన
'అమ్మ! దండాలు; రతనాల సొమ్ములివిగొ;
వెతకఁ గోకమునందె' నని, చాఁకిత మదీయ
గురుకరాంజలి నిడి వాని, నరిగె నెలమి.

గీ. తలఁచితిమి తొడవుపోయిన పలుగూర్చి
మేము మాయపగుణముల మేల్మిఁబట్టి
లోకమిట్టులెయగు గుణలోభకలన
నొక్కచోట సొమ్మనుమాన మొక్కచోట.

గీ. ఆంధ్రగృహలక్ష్ములార! సత్యాంశమిద్ది
యున్నతకులంబు విద్యయు నుచితపదవి
యున్నఁజాలునే? గుణము లేకున్న మేలె?
* కాదె చాకిత గుణహీనకంటెమిన్న?

* అనుభూతియోగము. 28-7-1932.

† ఏమియుం దెలియఁగని యటులుండి లోలోన నవి నీతితంత్రములు విరివిగఁ బన్నునది.

* కాదె చాఁకిత చదువరికంటెమిన్న
అని పాఠాంతరము.

# స్త్రీలు: ప్రత్యేక కళాశాలలు

కొస్వర్తి వేంకటరావుగారు

పశ్చిమదేశములతో పోల్చిచూడ భరతదేశమందు స్త్రీవిద్య ఎంతతక్కువగనున్నది ఎల్లరకు తెలిసిన విషయమే. అందునను ఆంధ్రదేశమందు మరింతశోచనీయము. స్త్రీకి విద్యవలయునా లేదా లేక స్త్రీకి విద్యయుండవలెను అట్టివిషయములనే నిచట చర్చించుటలేదు. అట్టివిషయములు చర్చించుచు ఏదారియుకూడ లేకయుండుటకంటె ప్రస్తుతవిద్యావిధానమునే అనుసరించుచు స్త్రీవిద్యకు పాటుపడుట శ్రేయస్కరమని నాఅభిప్రాయము. స్త్రీవిద్యావిధానములో నిపుడు సంస్కరణముల మొదలుపెట్టుట కష్టము. అది నెఱవేరని కార్యము. అదియునుకాక కాలహరణము. అందనిఫలము. కావున ప్రస్తుతస్త్రీవిద్యావిధానము నంగీకరించి యిట్టివిద్య గఱపుటకు ప్రయత్నము చేయుట మంచిది. సంస్కరణములు నెమ్మదిగా చూడవచ్చును.

స్త్రీలకు ప్రత్యేకముగా ఆంధ్రదేశమందంతటను ఒక్కకళాశాలకూడ లేకపోవుట కడుంగడు శోచనీయము. రాజధానిలోనికెల్ల దగ్గరకళాశాలగల పట్టణము చెన్నపట్నము. అందరు విద్యార్థినులును చెన్ననగరమువచ్చి ఉన్నతవిద్య నభ్యసించుటకష్టము. పాశ్చాత్యనాగరకత పూర్తిగనబ్బని మనదేశములో స్త్రీలకు స్వతంత్రముగా పట్నముపంపుటకు మనవారు సమ్మతింపరు. కావున చెన్నపట్నవాసులకు, తత్సమీప గ్రామస్థులకు, యింక కొంతమందికి గాక, మొత్తముమీద రాష్ట్రస్త్రీలకు, అందుముఖ్యముగా ఆంధ్రస్త్రీలకు చెన్ననగరకళాశాల నిరుపయోగము. ఆంధ్రదేశమున ఒక్కకళాశాలఅయినను లేదు. ఉన్నతపాఠశాలలుమాత్రము రెండుమూడున్నవి. దీనికి కారణములు చర్చించుటకు యిచ్చటవీలుపడదు.

స్త్రీలకు ప్రత్యేకకళాశాల యుండవలెనా? యను ప్రశ్నరావచ్చును. తప్పక యుండవలెనని దానికి జబాబు. నూరులకొలది బాలురున్నతరగతిలో ఒకరు లేక యిద్దరువిద్యార్థినులు చదువుకొనుట వారికి కొంచెముకష్టము. అట్టికళాశాలలకు సాధారణముగా తలిదండ్రులు, సంఘుచట్టముల మూలమున పంపరు. కొందరు పాశ్చాత్యదేశాచారములను ఉదాహరించి స్త్రీబాలురు ఒకేతరగతిలో చదువుకొనుట సంఘోద్ధరణకు చాల మంచిదని వాదించవచ్చునుగాని పాశ్చాత్యనాగరకత యింకను మనకు పూర్తిగానబ్బలేదు కావున స్త్రీబాలురు పూర్తిగా కలసిమెలసి తిరుగుట యింకను అదును (Stage) రాలేదు. అట్టిపాశ్చాత్యనాగరికతాప్రభావములు అట్టివిద్యావిధానఫలితములు, వారిసంఘము నెంతవరకు తీసుకొనివచ్చినదియో అందరకు తెలిసినవిషయమే. అదియునుగాక ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ఆంధ్రభాష యందుంచుచుండెడి పఠనీయగ్రంథములు స్త్రీబాలుర కలసియున్నతరగతిలో బోధించుటకుతగనివని చెప్పవలెను. ఉదాహరణమాడుడు: 1930 సం|| ప్రథమ పరీక్షకుపెట్టిన 'పారిజాతాపహరణ' మందలినారదుని పారిజాతవర్ణన. 1931 సం|| ఆతరగతికేయుంచిన "చంపూరామాయణ" మందలి కుమారసంభవభాగము. మచ్చుకు రెండు చెప్పితినిగాని సాధారణముగా అన్నిపద్య భాగములును అట్టివే. ఇట్టిభాగముల సాధారణముగా ఉపాధ్యాయులు చెప్పకవిడచుటయు, దురదృష్టవశమున అట్టివియే పరీక్షలలోవచ్చుటయుకలదు. ఒకకళాశాలలో 'పారిజాతవర్ణన' చెప్పుమని, స్త్రీలున్న తరగతిలో బాలురందరు కోరినందున ప్రిన్సిపాలుగారు పదునెనిమిది రూప్యంబులు జరిమానక్రింద వసూలు చేసిరట, కావున ప్రస్తుతస్థితిగతుల నాలోచించిచూడ ప్రత్యేకకళాశాలఅవశ్యకత అందరకు గోచరించకపోదు.

నూతనపాఠశాలాస్థాపనయందు మునిగియున్న ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులకు, స్త్రీలకు ప్రత్యేకకళాశాలకూడ ఒకటిపెట్టవలెనని తోచకపోవుట ఆంధ్రదేశదురవస్థ. బెనారసు విశ్వవిద్యాలయమందు స్త్రీలకు ప్రత్యేకముగా ఒకపాఠశాలకలదనియు, అందు ప్రథమపరీక్షవరకు గలదనియు అందరకును తెలిసినవిషయమే.

అటులనే మనవిశ్వవిద్యాలయమందుగూడ కనీసము ప్రథమపరీక్షవరకైనను ప్రత్యేకకళాశాలనొకటి యుంచిన బాగుండును.

ఈవిషయమున ప్రభుత్వమువారిపై నాశయుంచుకొనుట నిరర్థకము. ఉన్నవే తీసివేయుసమయమున క్రొత్తకళాశాలస్థాపనము గొంతెమ్మకోరిక. కాని మనవిశ్వవిద్యాలయాధికారులు ఒకపని చేయవచ్చును. ఇప్పుడు విశాఖపట్టణమందున్న స్త్రీఉన్నతపాఠశాలను కళాశాలగామార్చుటకు ప్రభుత్వమువారిని కోరుట గాని లేక తామే పూనుకొనుటగాని మంచిమార్గముగా గనుపించుచున్నది. దీనివలన ఎక్కువధనవ్యయము కలుగదు. ఉన్నతపాఠశాలోపాధ్యాయురాండ్రనే, కళాశాలతరగతులకుకూడ బోధింపమనవచ్చును. ఇది నూతనవిషయముగాదు. అనేక కళాశాలలందు, హైస్కూలునకును కళాశాలకు ఒకటే Staff కలదు. విశాఖపట్టణమందలి ఎ. వి. ఎన్. కళాశాల, విజయనగరంమహారాజావారి కళాశాల, బందరు హిందూకళాశాల మొదలయినవన్నియు నిట్టివే. కావున విశాఖపట్టణమందలి మేరీపాఠశాలయు, యింక తదితర స్త్రీపాఠశాలల వన్నియు యిటుల కళాశాలలగా మార్చవచ్చును. దానివల్ల అదనపుఖర్చు చాలతక్కువ.

అదియునుగాక విద్యార్థినులకు జీతములేకుండ చేయవలెను. విద్యార్థినులు చాలతక్కువ కావున వారికి Stipends కూడ యిచ్చినను అంతగా ఎక్కువధనవ్యయముండదు. ధరఖాస్తు రుసుముకూడ తీసివేయవలెను. అట్టికళాశాలల సమీపములందే లేక సాధ్యమయిన ఆవరణమునందే విద్యార్థినులవసతిగృహము లుంచుటకూడ మంచిది. ఇట్టి పరిస్థితులందు విద్యార్థినుల పంపుటకు తలిదండ్రులు సందేహింపరు.

ఆచరణలో పెట్టుటకు కొంచెము కష్టముగాని వసతిగృహములందు ఈపనులుకూడ ఏర్పాటుచేసి విద్యార్థినులఖర్చును చాలవరకు తగ్గించవచ్చును. కుట్టుపని బాగుగా ఆచరణయందుంచుట వంటల ప్రకారము వంట చేసుకొనుట మొదలయినవి. విద్యార్థినులు చాలతక్కువ యుందురు కనుక వారు వంతుల ప్రకారము వంటచేయుట చాలసులభము. ఇట్టివానివలన స్త్రీలకు ఖర్చుతగ్గుటయేగాక Domestic Science మొదలయినవి నేర్చుకొనుటకు చాల వీలుగానుండును. ఆంగ్లవిద్య నభ్యసించుటవలన స్త్రీలు దొరసానులవుదురని పూర్వాచారపరాయణులు చెప్పుటకు వీలుండదు. ఇట్టి విషయములు మనకు కొంచెము క్రొత్తగనుండును గాని పాశ్చాత్యదేశములందు, అందునను ముఖ్యముగా జర్మనీదేశమందును నిక్కలి హెచ్చుగా ఆచరణయందుండినట్లు తెలియుచున్నది. దీనిని స్వయంసహాయము (Self-help) అని యందురు. కనుక ఇట్టివి కళాశాల అయినను ఉన్నతపాఠశాల అయినను, విద్యార్థినులవసతిగృహములందు ప్రవేశపెట్టుట మంచిది.

నేను పైనచెప్పిన పద్ధతులపై కళాశాలనుపెట్టి, వసతిగృహముల నడపించిన, స్త్రీవిద్యబాగుగ ప్రబలుటయేగాక ఖర్చుకూడ మిగుల తక్కువయగును. కాన స్త్రీవిద్యాభిమానులందరు [illegible] నర్తించెదరు గాక యని ప్రార్థించుచున్నాను.

# ప్రణయాశీర్వాదము

అధికార్ల సూర్యనారాయణరావు గారు బి. ఏ; బి. ఎల్.

జాబిల్లివెదజల్లు చంద్రకళలట్లు
నీకండ్లసౌఖ్యంబు నెగడొందుగాత!
వనమాలికరసాలమున వ్రాలునట్లు
మేను నాకౌగిళ్లలోనుండుగాత!
రవికాంతులనుగోరు ప్రసవంబులట్లు
నీమోవి నాముద్దుకామించుగాత!
మేఘమాలికలోన మెరపుండునట్లు
నిరతంబు ప్రాణేశు దరినుండుగాత!
జానకీ! లోకాన జలధులున్నట్లు
నీయాత్మ ప్రణయంబు నిత్యమౌగాత!

# కార్తికిక కైంకర్యము

హరి రాధాకృష్ణమూర్తి గారు

౧

ప్రావృట్కాలఘనాఘనంబుల నభివ్యంగంసన్ స్నాతయై
పూవల్వల్ ధరియించి క్రొన్ననల సంపూర్ణాభిరామంబునన్
ధీవిన్యాసము నేర్పరించు ప్రకృతిన్ దివ్యానుభూతిన్ శర
చ్ఛ్రీవాల్లభ్యముఁ జూపి పూజనిడె దెంతే ధన్యవే మాసమా!

౨

ఒలసిన ప్రేమ గర్లకనియోగమునం దనరారు కోర్కెలన్
బలిసిన పూర్ణగర్భవతి పంటవలంతి ప్రసారితేక్షణం
సలసమునం జెలంగియుఁ బ్రశంసలఁ బొంది సుఖించుగాదె నీ
వలపునొకింత చూరగొని వారిరుహోద్ధతగర్వభంజనా!

౩

ఊర్జితశక్తియుక్తుఁడు మహోదయుఁ డాహవరంగమందు స
య్యర్జునుమించునట్టి ప్రతిభాయుతుఁడై తనరారు కార్తవీ
ర్యార్జునుగాంచి క్షత్రియకులాభిరతిం జరియించు సత్క్రియో
పార్జితకీర్తి చంద్రిక లనంతములై విలసిల్ల మాసమా!

౪

చెలగియే వేళ శివపూజ సేయునీవు
ద్వాదశిని హరిపూజను దగులనేమి!
హరిహరులపూజ లొకభంగి యాచరించు
మాసమా! యెట్టిజ్ఞానసంపత్తు నీది.

౫

మాలోకంబున కేగుదేరుతరి వ్యోమప్రాప్తమోక్షోదయ
శ్రీలన్ వాహినులన్ విదల్చి మునుకల్ సేవింప వాక్రుత్తువా
లీలన్ సల్పగశీతువడ్డె డిదియేలే యట్టిసౌభాగ్యముల్
మాలోఁ గొందరఁ జల్లినన్ గడిఁగి సన్మానింపమే మాసమా!

# చల్లనితల్లి

కర్రా చంద్రశేఖరన్ గారు

ప్రకృతిదర్పణంలో ప్రతిబింబించే ప్రతీమానవుడికీ దయయానేది పురాకృతపుణ్యాన్న లభిస్తుంది. గట్టిగావీచే స్వభావంకల వాయువుకూడా ఒక్కొక్కప్పుడు గులాబీరేకులురాల్చ డానికి వెరుస్తాడు. ఎందుచేత...? ప్రచండతేజోమార్తాండుడు మంచుబిందువును హరించ డానికి ఒక్కొక్కప్పుడు జలజరించి మరుగుపడతాడు......?

అది ధారాసంపాతదరిద్రసమయం. ఆకశినతరత మానిశీథసమయంలో చెట్టుచెట్టుచాటున–ఇంటింటిచాటున–పతివ్రతామతల్లి ఉన్న జీర్ణకుటీరంలోకి చోరకిరాతుడు — కాడు — కాడు — ఒకడు దొంగప్రవేశించి శతమానావశిష్టమైన ఆమె మెడమీద త్రాటినిముట్టుకొని భయకంపితాంగంతో రెండడుగులు వెనక్కువేసి నేలకొరిగాడు.

నిర్భయానందంతో కష్టసార్జితంలో గంజినీళ్ళుత్రాగి సుఖవ్యవస్థలో సుఖిస్తోన్న పతివ్రతామతల్లిని పామైతేమాత్రం ఏంచేస్తుంది? నిజంతరిస్తే పాము రక్తనాళాల్లో ప్రవహించేది దయే. స్వేచ్ఛగా సంచరించే తనయాత్మకి తృణాగ్రమైనాసరే గుచ్చుకుంటే కొరికిపారేస్తుంది.

స్వేచ్ఛావిహారానికి అడ్డులేనంతసేపు తిరిగితిరిగి కడుపు చల్లనితల్లిని ఏవస్తువుగా ఊహించి పడుకుందో కంఠంమీద పాంపిల్ల. స్వోదరపోషణానికి చతురంబోధిపరీతభూతలంలో న్యాయమైన మార్గాన్నిఅన్వేషించలేకపోతే పాపభీతిలేకుండా ఏకార్యాలకైనా సిద్ధపడేది మానవప్రకృతి.

ఆమె సుఖాపారపారావారంలో స్వేచ్ఛాఝురులమీద నడిచినడిచి సింహావలోకనం చేసి కళ్ళు తెరిచింది. పక్కని రక్తధారారాగంతో సుప్రసన్ననిమీలితనేత్రాలకి అడ్డుపడే బాష్పబిందువుల కష్టజీవిమీద నిష్కళంకప్రేమామృతదయాలోకనాలు ప్రసరించాయి. పర్యంకంమీద ఉండే పతిభగవానుని పాదాలకి విధ్యుక్తంగా మొక్కి లేపి శతమానంచాటున చిందులాడే చిరుపసిడిమువ్వ చేతికిచ్చి రహస్యాలాపనంతో ఏడకో పంపింది. కష్టజీవి కంటిపాపలు పుష్పించేప్పటికే మూర్తిత్రయంలా ఎదురుకుండా తాండవించారు వైద్యుడూ, దంపతులున్నూ. లజ్జాపురస్కృతబాష్పాలని ఆపుకోలేక వేదాంతతత్వోపదేశంచేసే పతివ్రతపాదాలు కడిగాడు, పతివ్రతధర్మంచేత కొన్నాళ్ళకి స్వర్గంలో ప్రథమాసనంగ్రహించాడు.

విశ్వపతి జీవితంబున వేకువైన
ఆదిగోమాతపాదాన అంశమైన
నరులు వసింపలోకాలు మరచినపుడు
ప్రకృతి 'మిధ్య'ని యూహింపరాదె మనము. (తత్వోపదేశంలో ఏకదేశం)




## ధాత నన్నేల వెందు చేత.

శ్రీమతి చావలి బంగారమ్మగారు

[శైలనగన్ ఖిగుల సుఖము ఆ కేపాటను కొంచెం వి లిఖంటుంది.]

ధాతా! నన్నేల వెందుచేత!
దయ జూడవెందుచేత? ఓధరణిజాసమేత! ఓధాతా॥

1 రాతి నబల జేసినావనే—ఖ్యాతినివిన్నాను
కోతులకే సిరులిచ్చిన—దాతవోయన్నాను— ఓధాతా॥

2 పరులవేడబోను—నీపాలనెపడినాను
పతితపావన నిను నే—ప్రణుతి జేసెదను— ఓధాతా॥

## మంగళహారతి

శ్రీమతి బోడ్డుపల్లి బాలా త్రిపురసుందరమ్మగారు

"జననీ!నీకిదె మంగళం" వలె

పల్లవి

హారతి మంగళహారతి| కమలాంబకు, మం॥

అనుపల్లవి

హారతి మనమందరం ప్రేమాతో ఆదేవిముందర వారిజాక్షు
లార! కూడిపాడగాను కోటికనోసగు మనోహారికీ నిపుడు హా॥

చరణం

మేనకముద్దులతనయకు మేదిని
బ్రోచె సువినయకు ఆనందమై ప
రమానందరూపమై అచ్యుతునిసోద
రి అఖిలాంతర్యామి హా॥
దక్షయజ్ఞ సంహారికి దాక్షాయణీ కొ
మారికి అక్షయముగ భక్తవరుల

కు అభయము లిచ్చి కృపజూచు
మహాలక్ష్మి కమలాంబకు హా॥
దండిగా జొగ్గలి పేటలో అందమయి
నా త్రిపురాసుందరికి కుండాలి
శిఖరాగ్రమందుండి వెలుగుచూ
మండలామేలె మాతల్లికమలాంబకు హా॥



# పాకకళ

—ఆనపకాయ ఉప్మా—

ఒక లేతఆనపకాయ తీసుకొనివచ్చి ముచిక కోసి వేయకుండ పైనున్నతొక్క కోసివేసి ఒకగరిటెకాడతోగాని అట్లకాడతోగాని ఆకాయనిండ చిల్లులు పొడువవలెను. ఒక వెడల్పైన గిన్నెలో ఒకసేరుగాని రెండుసేర్లుగాని కాయనుబట్టి నెయ్యిపోసి పొయ్యి మీదపెట్టి కాచవలెను. ఆనెయ్యి కాగినతోడనే ఈ కాయను మునుగునట్లుగా దానిలోనుంచవలెను. కొంత సేపటికాకాయ ఉడికి ఆనేతినిపీల్చుకొనును. అపైని ఆకాయను పైకితీసి ఒకవెడల్పైన పీటమీదకాని చేటలోకాని పెట్టి పనసకాయకొట్టినట్లు సన్నని పొట్టుగా కొట్టవలయును. ఒకబూరెలమూకుడులో నెయ్యివేసి పచ్చిమిరపకాయలు, అల్లంముక్కలు, కరివేపాకు, జీలకఱ్ఱ, ఎండుమిరపకాయముక్కలు, మినపపప్పు, ఆవాలు మొదలైనవానితో పోగుపుచేయించవలెను. పిదప ఆపోగుపులో ఈపొట్టునువేసి దానికి సరిపడిన ఉప్పునువేసి కలియపెట్టి క్రిందికిదింపి దానిలో నిమ్మపండ్లరసముపోసి కలియపెట్టి తినినచో చాలరుచిగానుండును.

—ఆకెళ్ళ రత్నావతీదేవి.

—జీడిపప్పు అరిసెలు—

ఒకసవాసేరు జీడిపప్పుతెచ్చి చిక్కనిగెడపాలు కొంచము తెచ్చుకొని ఆపాలతో జీడిపప్పు గట్టిగా ముద్దవలెరుబ్బుకొనవలెను. దానికి సరిపడుచక్కెర కూడావేసి రుబ్బవలెను. కొంచముఏలకులు పొడిచేసి వేసి కలుపవలెను. పొయ్యిమీద బాణలివేసి దానిలో నెయ్యిపోసి కాగినతరువాత చిన్నచిన్నముద్ద తీసుకొని బాదముఆకుమీదగాని అరటిఆకుమీదగాని తట్టి నేతిలోవేయవలెను. ఎఱ్ఱగావేగిన తరువాత తీసి భుజించినయెడ రుచిగానుండును.

—సూరత్తు నాగమణెమ్మ.

—కొబ్బరిహల్వ—

కొబ్బరికాయలనుకొట్టి తురిమి ఒకకాయకు అరతవ్వ బియ్యమునందుచేర్చి మెత్తగారుబ్బి దోసెపిండి వదునుగా తోడవలయును. మితముగ పంచదారను కలిపి పొయ్యియందుంచి సన్నసెగయందు పెట్టవలయును. జీడిపప్పు, బాదంపప్పు, ద్రాక్ష, చీనాకలకండ చేర్చవలయును. పైపప్పులను నెయ్యివేసి పక్వముగా వేయించి వేయవలయును. దించి కొంచము నెయ్యివేసి కలపి భుజించిన బహురుచిగా నుండును. దీనినే కొబ్బరిహల్వాఅందురు.

—యస్. జ్ఞానప్రసూనాంబ.

—వెన్నముంజలు—

సేరుబియ్యమును నానబోసి, నానినతరువాత బాగుగాకడిగి, నీరుపోవులాగున ఏదేని బుట్టలో పోసి 5 నిముషములువుంచి, నీరుఅంతాపోయిన తరువాత, రోటిలోవేసి మెత్తగాకొట్టి, రెండుమార్లు సన్నజల్లెడతో జల్లించవలెను. తరువాత ½ వీశ ఫేక్టరీ పంచదారనుకూడా రోటిలోవేసి మెత్తగాకొట్టవలెను. పైచెప్పిన బియ్యపుపిండిని, పంచదారనుకలిపి

దానిలో పెద్దనెలగకాయంత వెన్నముద్దనుకూడావేసి రోటిలో ఈమాదిరిని కుమ్మినయెడల ముద్దయగును. బాణలిలో నేయివేసి, బాగుగాకాగినతరువాత పైచెప్పిన ముద్దలోనుంచి పెద్దఉసిరికాయంత ముద్దనుతీసి, ఒకఆకుపై బిళ్ళలవలెచదిమి కాగుచున్న నేతిలో వేసి గోధుమరంగుగావేగిన తరువాత తీసివేయుచుండవలెను. ఇవి చాలమృదువుగాను, రుచికరముగాను ఉండి ఎన్నిరోజులైనను నిలువయుండును. పిల్లలకు బలమును, ఆరోగ్యమునుయిచ్చి, తేలికగా జీర్ణమగును.

## —పెసరట్లఖుర్మా—

పొట్టుతోయున్న పెసరపప్పును నానబోసి, వానినపప్పును పొట్టుపోవునట్లు శుభ్రముగాకడిగి మిరపకాయలు, అల్లం, జీలకర్ర, ఉప్పువేసి మెత్తగారుబ్బవలెను. ఈరుబ్బినముద్దలో ఉల్లిపాయలు ముక్కలుగాతరిగి కలిపి, బాణలిలో నూనెపోసి కాగనిచ్చి, రుబ్బినముద్దను అట్లవలెవేసి, పైన దిగువ బాగుగావేగనిచ్చి తీయుచుండవలెను. అట్లు తయారైనతరువాత ముక్కలుగాకోసి ఒకచోటయుంచవలెను. అల్లం, ధనియాలు, లవంగాలు, ఏలకకాయలు, గసగసాలు, దాల్చినచెక్క వీటిని ముద్దగానూరి, బాణలిలోనేయి కాగినతరువాత, నీరుల్లిపాయలనువేసి, వాటినివేగనిచ్చి అందులో ఈమసాలాముద్దనువేసి వేగినతరువాత, కొంచెము ఎర్రమిరపకాయలు నూరినకారపుముద్దను, ఉప్పు తగుపువేసి వీటినికూడా వేగనిచ్చి తయారుగాఉన్న పెసరట్లముక్కలనువేసి, కుదించి, చిక్కనిపాలను పోయవలెను. పాలు యిగిరేవరకు నిప్పులమీదయుంచి తరువాతదింపి, వేడియుండ భుజించిన చాలరుచిగాను, మంచిపరిమళముగాను ఉండును.

—పాతర్లగడ్డ సత్యవతమ్మ.

## —వెన్నప్పాలు—

పిండికి 3 తవ్వలుబియ్యము శుభ్రముగాకడిగి నానబోయవలయును. నానినతరువాత మెత్తగా పిండికొట్టవలయును. ఆపిండిలో 1 వీశెడుబెల్లము మెత్తగాతరిగిపోసి కలుపవలయును. కలిపినపిండిలో సోలడునెయ్యిఅగు వెన్నకూడకలిపి రోటియందుపోసి దంచవలయును. దంచగాదంచగా మెత్తగా పాకము మాదిరిఅగును. ఆపాకపుముద్దనుతీసి చిన్నబిళ్ళలవలె చేసి అరచేతియందు ఉంచి అరిసెలవలె వత్తవలయును. ఆఅరిసెలను సలసలకాగుచున్న నూనెలోకాని, నేతిలోగానివేసి ఉడికించవలయును. ఉడికినతరువాత మెత్తగాను, రుచిగాను ఉండును. వానినే వెన్నప్పాలందురు.

—చదలవాడ రాఘవమ్మ.

## —పేసంగిమట్లు—

$\frac{1}{2}$ సేరుశనగపప్పు పొట్టు, నూకలేకుండా శుభ్రముచేసికడిగి అత్తెసరువేసినట్లు నీరుపోసి పొయ్యిమీదపెట్టి చిమడకుండావండి దింపి మూతపెట్టిఉంచవలెను. బియ్యము శుభ్రముగాకడిగి రాత్రినానబోసి ఉదయమునేదంచి సన్ననిగుడ్డలో వడకొట్టవలెను. వడకట్టినపిండి గిన్నెడు ఉడకపెట్టిఉంచిన శెనగపప్పు గిన్నెడుకలిపి ముద్దఅవునంత నెయ్యిపోసి మెత్తగా రుబ్బవలెను. అంతయు ఆవిధముగానే రుబ్బి పాత్రలోవేసి మూతపెట్టవలెను. 2 ఎండుకొబ్బరిచిప్పలు తురమవలెను. $\frac{1}{4}$ భాగము జీడిపప్పు సన్నముగా తరగవలెను. కొంచెము గసగసాలు వేయించవలెను. $\frac{1}{4}$ వీశ చక్కెర కొద్దిగాఏకులపొడి వేసి తయారుచేసివుంచి జీడిపప్పువగైరాలుకలిపి ఒకపళ్ళెములో ఉంచవలెను. రుబ్బిఉంచినపిండి నిమ్మకాయంతముద్దతీసుకొని అరచేతిలో బిళ్ళవలెతట్టి తయారుచేసిఉంచిన పూర్ణము పెద్దస్పూనెడువేసి మూతిమూసి పొడుగుగా జిల్లేడికాయవలె చేయవలెను. బానలిపొయ్యిమీదపెట్టి సవాశేరు నెయ్యి పోయవలెను. నెయ్యికాగినతరువాత చేసిఉంచిన పేనంగిమట్లు నేతిలోవేయవలెను. ఎర్రగావేగువరకుఉంచి తీయవలెను. అన్నియు ఈవిధముగా వేయించుకొనవలెను. అన్నిపిండివంటలలోక ఇది చాలారుచిగా ఉండును. జాగ్రత్తగాఉంచిన ఎడల మూడురోజులవరకు నిలవఉండును.

—కోకా ధనలక్ష్మమ్మ.

## విషాదచ్ఛాయ

తుమ్మలపల్లి వేంకటసీతారామారావుగారు [సాహిత్యమండలి]

నాగీతము సమాప్తమైనది. కండ్లు తెరచి ఆమెవైపు చూశాను. 'దేవీ! నాసోదరుడు, సోదరీకూడా ఎందుకు నిన్ను చూడలేదు'?అని ప్రశ్నించాను. 'వాళ్ళందరు నన్ను నమ్మరు. నన్ను సంతోషముతో భజిస్తారు'అని జాలితో ఒకమారు నన్ను వీక్షించి రెండుకన్నీటిబిందువులను రాల్చినది. మానవులంతా ఆమెను అనుకరించారు. అందరు ఆమెతో నైక్యము పొందారు. వారిమూర్తులు సంధ్యారాగములో స్వేచ్ఛగా విహరిస్తూఉన్నవి. నేను ఒక్కణ్ణే. ఏకాకినై నాను. ఈరాత్రి, ఈపగలు, ఈసముద్రము, ఈప్రపంచము నన్ను శాశ్వతంగా ఆవరించినవి. ఏవీ మాట్లాడవు. అన్నీ మానముద్ర దాల్చినవి. నాసంచారాన్ని పరిశీలిస్తూ అనుచరులవలె నావెంటఉన్నవి. అవ్యక్తమైనభయము. అస్వతంత్రత నన్ను ఎక్కడికో యీడ్చుకొనిపోతూన్నవి.

## దైన్యము

ఏ. వి. సీతారామయ్యగారు ఎం. ఏ.

కవీశ్వరుడనుగాను నాకవితాధోరణిచే నిన్ను మెప్పించుటకు, ఒప్పించుటకు. ధనికుడనుగాను పెద్దపెద్దగోపురములుగల దేవాలయములు కట్టించి పుణ్యమార్జించుటకు. బలిష్ఠుడనుగాను యెండవానలకు లక్ష్యముచేయక తపస్సుచేయుటకు. మనోబలముగలవాడనుగాను యెల్లప్పుడూ నిన్నేస్మరించుటకు. నిష్కల్మషుడనుగాను పవిత్రహృదయముతో నిన్ను సమీపించుటకు.

* * *

ఛందోబద్ధములయిన ప్రార్థనాగీతములచేత దప్ప సాధ్యుడవుగావా? శరీరమంతయు తపోవేడిమిచేత మాడ్చినగాని దర్శనమీయవా? కాషాయాంబరములుదాల్చి భక్తవేషము పూనినగాని నన్నాదరింపవా? నాకుటీరమునుండి ఎప్పుడో ఒకప్పుడు స్మరించిన తృప్తిపడవా? నిష్కల్మషుడగానని గుర్తించితిని. సమీపించుట కనుజ్ఞనీయవా? దేవా! దేవా!

 స్త్రీలు: వినోదపరిశ్రమలు 

# పూసలతో చెట్టు కట్టు విధము

శ్రీమతి సూరత్తు నాగమణెమ్మ గారు

సన్ననిఇత్తడితీగ చుట్టలుచుట్టలుగా చుట్టి ఆచుట్టలు డజన్లలెక్కగాగాని విడిగాగానిఅమ్మెదరు. పొయిలో నిప్పులు బాగాఉన్నప్పుడు ఆవి నిప్పులలోవేసి ఎర్రగాకాల్చి తీయవలెను. కాల్చకముందు బిరుసుగావున్న తీగ కాల్చినతరువాత మెత్తగావంగుచుండును. స్త్రీలు మెడలోవేసుకొను నల్లపూసలంతంత సన్నపూసలుఅన్ని రకములలోను దొరుకును. ఆకుపచ్చపూసలుకొన్ని ఎర్రపూసలుకొన్ని పసుపుపచ్చపూసలుకొన్ని తెచ్చుకో వలెను. మెరుగుపూసలు బంగారుకలరులో దొరుకును. అవికూడా కొద్దిగాతెచ్చుకోవలెను. పైనికాల్చి ఉంచుకొన్నతీగ పావుగజముచొప్పున కొన్నిముక్కలుత్రుంచి ఉంచుకోవలెను. ఒకతీగముక్కతీసుకొని ఒక బంగారురంగు మెరుగుపూసగ్రుచ్చి దానిసరసనురెండు ఆకుపచ్చపూసలుగ్రుచ్చి ఆతీగరెండు వైపులకు సమముగావుంచి అటుతీగ రెండుఆకుపచ్చపూసలలోనుంచి తీసి బిగించినయెడల మెరుగుపూస పైకెన్ని ఆకు పచ్చపూసలు 2 క్రిందికిన్నివచ్చితీగ 2 వైపులకు సమముగాఉండును. తిరిగి ఒకప్రక్కతీగకు 3 ఆకుపచ్చపూసలు గ్రుచ్చి రెండవవైపుతీగ తెచ్చి తిరిగి ఈ 3 పూసలలోగ్రుచ్చి తీసి బిగించవలెను. ఈలాగునవే 6 పూసలు వరకువేసి బిగిస్తూవుండవలెను. తరువాత ఒకొక్కపూస తగ్గించుకొంటూవచ్చి చివరను ఒక్కఆకుపచ్చ పూసవేసి బిగించి 2 వైపుల తీగకలిపి మెలిపెట్టినయెడల ఊడిపోకుండాఉండును. ఇట్లుచేసినయెడల ఆకు ఆకారముగాఉండును. ఇది ఆకులుచేయువిధము. పువ్వులుచేయు కెట్లనిన ఒకతీగముక్కతీసుకొని ఏడు ఎర్రపూసలుగ్రుచ్చి చివరకుతీసి రెండవకొన తెచ్చి మొదటిపూసలలోనుంచి తీసి బిగించినయెడల ఆపూసలు గుండ్రముగావచ్చును. అలాతీసి బిగించిన తీగ కేతిరిగి ఏడుపూసలుగ్రుచ్చి ఈ 7 పూసలలో మొదటిపూసలో నుంచి తీగలాగి బిగించినయెడల అది వకరేకుగా గుండ్రముగావచ్చును. ఈలాగు 5 పార్లు చేసినయెడల 35 పూసలుపట్టి 5 రేకులుగాఉండి పువ్వుఆకారముఏర్పడును. 2 కొసలుకలిపి పూసలుఊడిపోకుండా మెలిపెట్ట వలెను. కాయలుకట్టుమెా సరు. జానెడుజానెడు తీగముక్కలు 2 తీసుకొని ఒక మెరుగు పూసగ్రుచ్చవలెను. గ్రుచ్చినపూస మధ్యకుతీసి తీగలువంచినయెడల 4 ముక్కలుగాఏర్పడును. ఒకొక్కతీగకు 5 చొప్పున పసుపు పచ్చపూసలు 4 తీగలకుగ్రుచ్చి 4 తీగలుకలిపి మెలిపెట్టవలెను. ఈలాగు ఆకులు పువ్వులు కాయలు తయారుచేయవలెను. కాయలుకొన్ని ఆకుపచ్చపూసలతోకూడా చేయవలెను. పచ్చికాయలవలెఉండును. ఒకపువ్వుతీసుకొని దానికి 3 ప్రక్కల 3 ఆకులువేసి మెలిపెట్టవలెను. అప్పుడు పైనపువ్వున్నూ 3 వైపుల ఆకులువచ్చును. వాటికి కొంచెముక్రిందుగా 5 ఆకులువేసి చుట్టవలెను. వాటికి కొంచముక్రిందుగా 7 ఆకులు వేసి చుట్టినయెడల చిన్నకొమ్మగాఏర్పడును. దానికేమధ్యగా ఒకకాయ, ఒకపువ్వువేసి చుట్టవలెను. ఇంకా ఆకులు కావలసినయెడల రెండుమూడు వేయవచ్చును. ఆకులు, పువ్వులు, కాయలు ఊడిపోకుండా తీగగట్టిగా మెలిపెట్టుచుండవలెను. ఒకపావుగజము గొడుగుపూచ తెచ్చి తయారుచేసి ఉంచుకొన్నకొమ్మవకటి పూసపైన పెట్టి తీగతోకట్టవలెను. దానికి కొంచముక్రిందుగా 3 వైపుల మూడుకొమ్మలుపెట్టి తీగతోగట్టిగా కట్టుతూ రావలెను. తరువాత 5 కొమ్మలు తరువాత 7 కొమ్మలుపెట్టి గట్టిగా తీగతోకట్టుతూ మధ్యమధ్య విడిఆకులు, విడిపువ్వులు, కాయలుపెట్టుతూ కట్టుతూవచ్చినయెడల చెట్టుమెాస్తరుగా తయారవును. గొడుగుపూచకు 2 వం తులవరకు కట్టవలెను. తరువాత ఒకచిన్నకుండీతెచ్చి ఈచెట్టునిల్చుటకు ఏమయినాబరువుగా కుండీలోపోసి ఈచెట్టుపెట్టి మేజాబల్లమీద పెట్టినయెడల అందముగాఉండును.

# నీతి

కె. కుటుంబరావుగారు

నీతంటే ఏమిటి? దాని ఆవశ్యకత ఏమిటి? నీతిలేనందువల్ల కలిగేనష్టమేమిటి? ఈప్రశ్నలు ప్రతిమనిషీ తట్టితీరాలి. అనేకమంది నీతినితప్పించుకుని తిరుగుతూ అందువల్ల కలుగుతున్నబాధలను అర్థంచేసికోలేకుండా ఉన్నారు. ఈప్రశ్నలను నాబుద్ధికి తోచినప్రకారం చర్చిస్తాను.

మొదటి ముఖ్యవిషయం ఏదంటే నీతి ఒకరికోసం ఏర్పడ్డదికాదు. సంఘంకోసం ఏర్పడ్డది. సర్వసంగత్యాగంచేసి అడవిలో తపస్సు చేసుకొనే మునీశ్వరుడికి నీతి అవసరంలేదు. నేను నీతిగాఉండి నన్నుద్ధరించుకునేదేమీలేదు. ఒకసంఘంలో ప్రతివ్యక్తీ నీతిగాప్రవర్తిస్తుంటే సంఘబలం వృద్ధవుతుంది. సంఘానికి నీతిని మించిన శాసనంలేదు. నీతికి ధర్మంతో పనిలేదు. ఎవరికివారు ధర్మంగా ప్రవర్తించవచ్చునుకాని మనప్రవర్తన ఇంకొకరికికూడా సంబంధించినప్పుడు నీతికూడాచూడాలి. దీనికో చిన్నఉదాహరణ ఇస్తాను. మనమనస్సులు పరిపక్వం కాకపోవుటచేతను మనకందరూనచ్చరు. ఒక్కొకమనిషి మనకు అసహ్యంకలిగిస్తాడు. అయినా ఆమనిషితో మాట్లాడవలసివచ్చినప్పుడు మర్యాదగా మాట్లాడడం నీతి—ధర్మంకాకపోవచ్చును. మనస్సులో ఒక అభిప్రాయముంచుకుని పైకొకవిధంగా మాట్లాడటం కాపట్యం. కాపట్యం ధర్మంకాదుమరి. అవిధంగానే అనేకపర్యాయాలు అబద్ధంఆడటం నీతవుతుంది—అబద్ధంఆడటంవల్ల ఎవరికీనష్టంలేక నిజంవల్ల ఇంకొకరికి బాధకలిగినప్పుడు. స్వలాభాపేక్షతో అబద్ధంఆడటం అధర్మం; నీతీకాదు, అవినీతీకాదు! విశ్వామిత్రుడు హరిశ్చంద్రుణ్ణి తనవిషయం అబద్ధంఆడించాలని చూశాడు కాని నీతికి భంగంగా అబద్ధంఆడించాలని ఎన్నడూ చూడలేదు! విశ్వామిత్రుడి కీతిరుగుడు తెలియదో? లేక ఆయన ఉద్దేశంప్రకారం అబద్ధం స్వలాభాపేక్షతో కూడుకున్న అనృతమేనో? పురాణాదుల్లో అక్కడక్కడా ధర్మసూక్ష్మాలు వస్తూంటై. అవి వేరేఏమీలేదు! నీతిబాహ్యమైనధర్మాలు. అటువంటిసమయంలో ఎప్పుడూ నీతే గెలుస్తూవస్తున్నది. ధర్మరాజు బాగా ధర్మం తెలిసినమనిషి. ఎవ్వరూ ఆతన్ని ధర్మంలో పడగొట్టలేరు. అందుచేత ఆయన బొందితో స్వర్గానికి పోయేసమయంలో యముడు కుక్కరూపంగావచ్చి ఆయననీతినే పరీక్షించాడు. కుక్క తనవెంట రావాలనటంలో ధర్మరాజుకు కుక్కమీద మమకారం ఏమీలేదు. అటువంటి మమకారాలున్న ధర్మరాజు ఒక్కొకసోదరుడే తనవెనక శరీరంవిడుస్తుంటే వెనక్కైనా తిరిగిచూడక పైకి సాగిపోతాడా? దాని నీతేమిటంటే మనం ఎంత వేదాంతులం కానివ్వండి సంఘంలో ఉండలేమనుకుంటే ప్రయోజనంలేదు. గాంధిమనను స్త్రీపురుష సంయోగాని కతీతమైపోయింది. అందుకని మహాత్ముడు తనస్థితికికానివారిప్రశ్నలు తోసేశాడా?

బాలవితంతువులు పునర్వివాహం చేసుకోకపోవటం ధర్మంకావచ్చును. అవునా కాదా అని శాస్త్రాలు తిరగచేసి నోరునొప్పెత్తేటట్టు లెక్చర్లిచ్చి ఏంప్రయోజనం? బాలవితంతువులు నిర్బంధంలో ఉండటంచేత సంఘం వారిపట్ల అవినీతితో ప్రవర్తిస్తున్నది. ఒకవంశం నిర్మూలంకావటం నీతికాదనితోచి వ్యాసమహర్షివంటివాడు పిల్లలనుకన్నాడు.

నీతిచేస్తున్న పనేమిటి? అనేకవృత్తులవారిని అనేకరకాలవారిని కలుపుతున్నది. ఐకమత్యం కలగచేస్తున్నది. అందరికీ ఒకటేవిధమైన సంఘంలేదు. ఒక్కొకరికి తమభార్యాపుత్రాదులే సంఘం. ఒక్కొకరి జీవితం తమ గ్రామందాటిపోదు. మహాత్ముడిజీవితం జగత్తంతా ఆక్రమించింది. మననీతి మనసంఘపరిమాణాని కనుగుణ్యంగాఉండాలి. అస్పృశ్యులవిషయం తీసుకోండి. బహుశా ఒకప్పుడువారు మనసంఘానికి చెందినవారుకారు, కాని క్రమానవారును మనను సమీపించారు. మనలను సేవించటం మొదలుపెట్టారు,

మన అవినీతివల్ల మనరక్తం వారిరక్తం ఒకటైపోయినై. అందువల్ల కలిగిన బాధ్యతలను మనంతోసివేసి ఏం ప్రయోజనం? మనం వారితో నీతితో ప్రవర్తించవలసిన అవసరంవచ్చింది. అనవసరమా అవసరమా అని అనేక వేలసంవత్సరాలు పూర్వంనించీ వస్తున్న వేదాల్లో చూస్తే ఏంతెలుస్తుంది? నీతి అన్ని జీవులకూ ఒకటిగా లేదు. కుక్కలకు, పశుపక్ష్యాదులకు పనికివచ్చేనీతి మనకు పనికిరాదు. ఒకదేశంనీతి ఒకదేశానికి పనికిరాదు. ఒక ఆంగ్లయువతిని పరపురుషుడు నృత్యంచెయ్యటానికి రమ్మనిపిలవటం నీతిబాహ్యంకాదు. మనదేశంలోనో? ఆవిధంగానే ఒకకాలపునీతి మరోకాలానికి పనికిరాదు. కొద్దికాలంలో మనకు ప్రస్తుతపాశ్చాత్యనాగరికత అబ్బవచ్చును. దానికితగినట్టే మననీతికూడా మారుతుంది.

అనేకసాంఘికప్రశ్నలను ఏవిధంగా తేల్చవలసిందీ మనవారికి తెలియలేదు. నీతిఅనేది ఒక్కటి విచారిస్తే మనసంఘం అనేకమార్పులు వెంటనే తెచ్చుకుంటుందని నానమ్మకం. మనలో చాలామంది శాస్త్రప్రకారం ప్రవర్తించి ధర్మంగా న్యాయంగాఉండి నీతినితెలుసుకోక చివరకు నరకానికెందుకు వచ్చామాఅని ఆశ్చర్యపడబోతారు, చూస్తూండండి! ఒక్కమనిషికి నీతిలేకపోవటంవల్ల ఎంతమందిజీవితాలు నరకతుల్యం కావచ్చునో ఊహించుకోండి.

నేనింకా ఈవిషయం ఏమీశోధన చెయ్యలేదు. కాని ఇటువంటిప్రశ్నలు ఎవరిమట్టుకువారు మనతలకు మించినవని అనుకుని వదిలేస్తే ప్రయోజనంలేదు. నేను చెప్పినవిషయాలు అందరికీ ఏవిధంగాతోచిందీ తెలుసుకునేవరకూ నేనింతకన్న విశేషించివ్రాసి ప్రయోజనంలేదు.

## కానన విహంగమా!

శ్రీమతి యశోదాబాయిగారు

కాననవిహంగమా! నీదుగాన మతిమ
నోహరసుధామధురమైననుఁ దనిపె; నెగు
రనుబలాటపడెడి నెంతో మనసు; పైకి
నెగిరిపోవుదు నీతోడ నీశుకడకు
హాయిగా గానమొనరింపు మహాహా! మనసు
తేలె సంతసపుంగెరటాలపైని.
ఇంతమాధురి నీపాట కెట్లు కలిగె?
ఫలసుధావినిమయరసపాయి వగుట
నొక్కొ గాన మొనర్పు నీడోద్భవంబ!
గమగమవలచు పూవుఁదీఁగలఁజెలంగి
గుబురుగా నున్న చెట్లజొఁకునను డాఁగి
తళతళలు మీఱు జలజలమలలనుండి
యిసుకపైఁ దొల్కులాడుచున్న సెలయేటి
తీరమునఁ గంతమెత్తి మది వికసింప
నేర్పుకోలదిని బాడుము నీడజంబ!
కనులపండువొనర్చు నీకాననంబు
నందమును వర్ణనము చేసి విందొనర్పు
మతిముదావహమైన యీయామనిసిరి
నుతియొనర్చి మనంబు సంతోషవార్ధిఁ
దేల్చు మోపిట్ట! నీవు మోదింపుమమ్మ
దీని వర్ణింపుమనుచు నద్దానిబాను
మనుచు నిన్ను బాధించుట యంతెకాక
విసువును విరామమునులేక విశ్వమెంత
దనుకనుండు నందాఁక సంతతముఁబాడ
నీకుఁ దలమైన నీశ్వరుసృష్టిచిత్ర
మును సగంబు వర్ణింప నగునె? ద్విజంబ!
నీపగిదిఁ బతంగంబనై నేనుగూడఁ
దలిరుఁజివ్వఁలఁ బండ్లకొమ్మలఁ జరించి
యాఁకటికిఁ బండులరసంబు నాని సత్ప
థమున నెగురుచు నీశ్వరునిమహిమంబు
పాడుకొనుచుఁ గులాయనివాసినై ప
విత్రజీవనమొనరింప వేడ్కపుట్టె.

# శాంతమతి

కీ. శే. ఆలూరు వాసుదేవయ్యగారు

## వెలలేనిరత్నాభరణము శాంతమతికి లభించుట

ఇవ్విధంబుండఁగా నాపద్మావతీపురమహారాజగు ప్రశాంతుండు తనభార్యయగు నిందిరాదేవికి నమూల్యరత్నంబు లనేకదినంబులుగనార్జించి కంఠాభరణంబొకండుచేయించి యొసంగియుండె. ఆయిందిరాదేవి యొకనాఁడు మంగళస్నానంబునేయంబూని భూషణంబులుదీసి, పెట్టెయనిడి కంఠమునంగల యాభరణముతీయమఱచి స్నానంబుచేయుచుండి చూచుకొని యారత్నాభరణమునుదీసి యందొకచిలుకకొయ్యకు దగిలించి జలకంబాడి యానగనెత్తుకొనుట మఱచి యంతఃపురంబునకేగినదయ్యె. "ఒడలెఱుగనమ్మకు నొడవెలు బరువెఱుంగునా!" యనుసామెతవలె ఆహా! ధనమదాంధమెంత మఱపునుగలుగఁజేయుచున్నది? అంత స్నానముచేయునపుడు చిలుకకొయ్యకుఁదగిలించిన కంఠాభరణంబును గ్రద్ద యొకటి యాకసంబునందిరుగుచుండి, సూర్యకిరణంబులకు నాకంఠహారము తళతళయని కనులకు మిఱుమిట్లుగొల్పు మెఱుపులుతుఱంగలించుటంజేసి కనుంగొని, అదేదియో దినుపదార్థంబనితలంచి హఠాత్తుగ నాయాభరణంబును గాళ్లతోఁదన్నుకొనివచ్చుచుండి ముక్కునఁబొడిచిచూడఁగాఁ దనకుపయోగములేకుండె.

శాంతమతిభర్తయగు భానుగుప్తుఁడాదినము పల్లియకేగివచ్చునపుడు ఆతనికాదినము వ్యాపారమున నేమియు లభించకపోయినందున నేఁటికీశ్వరుఁ డిట్లుచేసినవాఁడుగదా! యని చింతించుచు నాపురసమీపమునకురాఁగా, శాంతమతి యదివరకు రిక్తహస్తముతో నింటికి రారాదనిచెప్పినమాట స్మరణకువచ్చి యేదైనంగొనిపోవజూడ నందేమియు నగుపడక యచ్చటఁజచ్చిన చిన్నపామొకటి పడియుండుటంజేసి దానితోఁకనుబట్టుకుని యెత్తుకునివచ్చి తానుండుగుడిసెమీఁదఁ బాఱవైచి గృహంబులోని కేగినవాఁడయ్యె. "దైవతంత్ర మచింత్య" మన్నట్లు దేవునితంత్రమును గనిపెట్టుట కెవరితరము? ఆహా! అంత నాగ్రద్ద యుపయోగములేనివస్తువని తలఁచి భానుగుప్తుని గుడిసెమీఁదుగ వచ్చుచుండఁగా నతఁడు దెచ్చిపాఱవైచినపాముగబ్బుగుబులుకొనుటంజేసి యాకంఠాభరణంబును గుడిసెపై విడచి యందుండినపాము నెత్తుకొనిపోయినదయ్యె.

మఱునాఁడు శాంతమతి వంటసేయుటకు గుడిసెమీఁదనెండఁబెట్టిన పిడకలు రెంటిం దెచ్చుటకు వచ్చియెత్తుకొనుచుండఁగా నందుండు రత్నాభరణకాంతులు రవిరస్మివలన మెఱయుచుండఁజూచి యేమదియనితలంచి కఱ్ఱతో దగ్గఱకుఁ ద్రోసుకొనిచూడఁగా నది వెలలేని సొమ్మగుటంజేసి చూచి యచ్చెరువొంది యీభూషణం బీగుడిసెపైకి నెట్లువచ్చియుండు ననితలంచి దానినెత్తుకునివచ్చి చూచుచుండ, నాదండకు వేయఁబడిన పతకమునందు వెనుకప్రక్క "ప్రశాంత" యనివ్రాసియుండె. అదిగని "ఓహో! యీరత్నాభరణము ఈపట్ట

ణాధిపతియగు ప్రశాంతునిదిగనున్నది. లేకుండినచో నిట్టియమూల్యాభరణము సామాన్య జనులకునుండునె? అయిన నీహారంబును భద్రపఱచి సమయంబువేచి యెవరిసొమ్మో వారి కిచ్చివేయుదము. వెల్లడిచేసితిమేని దీనివలన నేమికీడుమూడునో యెఱుంగము. మఱియుఁ బరద్రవ్యమెప్పటికైనను దారిద్ర్యంబునుగల్గించుటగాక యశోహానియు నరకప్రాప్తియు, వంశహానియుఁగల్గును. “అనభిధ్యాపరస్వేషు సర్వసత్త్వేషు సౌహృదం” అనునట్లు పరుల ద్రవ్యములందు నాశలేకుండుటయు, సకలభూతములయందు దయగల్గియుండుటయు నివిముఖ్యమయిన సత్కర్మములు. ఈసత్కర్మములవలన నొకప్పుడైన భగవంతుఁడు దయగల్గి రక్షింపక మానఁడు. దురాశవలన దుష్కార్యములుచేసినను స్వర్గపాత్రులుగాక యిహలోకసౌఖ్యమించుకేనియుఁబొందుటలేదు.

శ్లో. ఈశస్య కంఠలగ్నోపి
వాసుకిర్వాయుభోజనః
మహతాంస్థాన మాశ్రిత్య
ఫలం భాగ్యానుసారిహి.

అనునట్లు వాసుకియనుసర్పము ఈశ్వరునకుఁ గంఠాభరణంబుగ నుండినను అది గాలి నాహారము చేసుకొనుచున్నదిగాని మఱెట్టియాహారముచేయు భాగ్యమునొందలేదు. అదృష్టములేనిది గొప్పవారి నాశ్రయించినను ఫలంబుండునె? కాఁబట్టి యిట్టిసొమ్ముకాశపడి నందున నొకప్రయోజనములేదు. అనితలంచి యానగను భర్తకుఁజూపక యొకపాత్రలోఁ బెట్టి దాఁచి తనకార్యంబుననుండె.

అనంతరము రాజగృహంబునఁ బ్రశాంతమహారాజు సంతసంబునఁ బడకటింట నిందిరాదేవితో సరసోక్తులాడుచుండు సమయంబున భార్యంజూచి “ఏమిది యిందిరా! నీకంఠబునఁ గ్రొమ్మెఱుంగులు తుఱంగలించురతనాలదండలేకుండుటకు హేతువేమి?” యనఁగ నా యిందిరాదేవి కరంబున మెడందడవుకొని, హారములేకుండుటంజేసి “హా! యేమి నామంద బుద్ధి? స్నానముసేయునపుడు చిలుకకొయ్యకుఁదగిలించిన హారంబునుచేకొనిరాక మఱచితి” అనికడువడిలేచివచ్చి చిలుకకొయ్యనుజూడఁగ, నందుఁదాఁగిలించినదండ లేమింజేసి చెలికత్తెలనురావించి భయంబుజూపి దండపోయినహేతువడుగ నెవరును మాకుఁదెలియదనిచెప్పిరి. అందుపైఁగడుకోపంబున రాజుకడకేగి స్వామీ! యారత్నాభరణము చెలికత్తెలుతక్క మఱెవ్వరుడాఁచినవారుగారు. నిశ్చయంబిదియని చెప్పుటంజేసి, రాజు వారలరావించి నయ భయోక్తులనడిగినను, వారు దేవునినానఁబెట్టి యానగఁజూడ లేనిది దృఢంబుగఁజెప్పిరి. ధనముపోయినయింటఁదనవారినడుగుట వాడుకగనుండినను తమరినెల్లప్పుడుసేవించు పనివాండ్ర గుణాగుణంబులు గనిపెట్టక యూరకనిందమోపుటదగునె? ఆహా! ధనమెంతనిర్దయ గలది? ధనమెంత యసత్యముగలది? అంత నారాజు చెలికత్తెలతో రేపుదయము మీరు

రత్నాభరణంబు దెచ్చియీవలయు, నట్లు లేకుండినచో మీతలలు దెగనఱికించెదనని చెప్పి భార్యతోడ శయ్యాగృహంబున నిద్రించి యొకసమయాన లేచి యిట్లు తలంచె: "హారము చిలుకకొయ్యకుఁదగిలించి మఱచివచ్చినపు డాదండనుజూచి, తినెడుపదార్థమని తలంచి, కాకి గాని గ్రద్దగాని కాళ్ళనిఱికించుకొని యెటకేనియుంబోయి నేలంబడవేసియుండినచో నేమి సేయనగును? అట్లు లేకుండినచో, నానగను బనివాండ్రెత్తుట కెంత ధైర్యము? అట్లుడాఁచుటకు నేర్చియుండిరేని యిన్నాళ్ళవఱకు, నగరిలో నెంతసొమ్ము డాఁచియుండరు? రంకుతనము, దొంగతనముడాఁగదన్నట్లు ఇందాక యట్టిదొంగపనిచేసినట్లు చెప్పఁగావినలేదు. అట్లుండ నూరక వీండ్రఁబీడింపనేటికి? అయిన నాకంఠాభరణంబువలె నొకయాభరణంబుసరిరాదు. దానికెంతయుధనంబు వ్యయమొనర్చితి. అభూషణముపోవుటచేత నెంతయుంజింత మనంబు నఁగిలఁత వెట్టుచున్నది. దానివలె మఱియొకరత్నాభరణము చేయింతమని తలంచినచో నిఁక నెన్నాళ్ళకట్టి రత్నంబులుసంపాదించి చేయించుటదుర్లభంబు. కానిమ్ము. దీనికేదైన నొకయుపాయంబు పన్ని నగవచ్చునట్లు చేసుకొనవలయును" నని నిశ్చయించి మరునాఁడు కొలువుకూటంబునకువచ్చి మంత్రిరాక కెదురుచూచుచుండె.

అనాఁటిరాత్రి మంత్రికి సర్పముకఱచుటంజేసి మంత్రతంత్రౌషధంబులు చేయించుకొనుచుండియు మరునాఁడు జామువ్రొద్దుకు మృతినొందె. ఆమరణవార్త మఱికొంత తడవుకు సేవకులవలన రాజువిని అక్కటా! ఏమి నాకాలబలము! రెండుమాసంబులవుడు చేయించిన యమూల్యాభరణముపోయిన జాడ తెలియకపోయె. అది యొకదుష్కాలమని తలంచియుండఁగా, మంత్రిమరణవార్తయొక్కటి వింటినిగదా! యిట్టి వికృతభయవచనంబులు మఱింకెన్ని వినవలసియున్నదో తెలియలేదు. ఏమి నాదురదృష్టము? అని మంత్రికి సంస్క్రియలు బాగుగ జరిపించివచ్చి యిట్లుచింతించె:

ఆ-గీ. రాజు కొక్కహాని రాకుండ రాజ్యతం
త్రములొనర్చుకొంచు ధర్మమెఱిఁగి
హితముగోరునట్టి మతిమంతుఁడేగదా
మంత్రియనఁగనొప్పు మహిఁదలంచ

అనునట్లు రాజుకొకయాపదరాకుండునట్లు రాజ్యతంత్రంబులు గడపుచు న్యాయమార్గంబుననుసరించి మేలుగోరుచుండువాఁడుగదా మంత్రియనంబడు? అట్టిమంత్రిలేనిరాజేంద్రునిపదవియేల? మఱియు జ్ఞానంబులేని మనుజజన్మంబును, మృదుమధురవచనలాలనంబులేని భార్యతోడికాఁపురంబును ధైర్యసాహసౌదార్యాయువులులేని పుత్త్రింకను, నిశ్చలచిత్తంబు లేని తపంబును, బాహువులులేని యుద్ధక్రమంబును, శిరంబులేని శరీరంబును, ఎట్లు ప్రయోజనములేదో యట్లు సచివోత్తముఁడులేని రాజ్యము ప్రయోజనమేమి? ఇంతవిశ్వాసముగల మంత్రివర్యునివంటివాని నిఁకెందుండి వెదకి తెత్తు? గులకఱాలవలె జగంబున నెందఱుమనుజు

లుండినను, గుణంబులతో మెఱవడించురత్నంబులవలె మనుజులుండుట దుర్లభము. ఉండినను మంత్రిపదవికి లభించునట్టివాఁడరుదు. లభించినను రాజుకు హితముగోరి కపటవృత్తిలేక, పాపంబునకు వెఱచి, సత్కార్యములచేత లోకులచేఁబొగడ్తఁజెంది, మానప్రాణంబులు కాపాడుకొంచు, రాజునురక్షించువాఁడు లభించుటకష్టము. కానిమ్మింతకు, "సహసావిధదీన క్రియా," మనునార్యోక్తివలె యోచింపక యొకకార్యము త్వరపడిసేయరాదు. "వెనుక చింతించుట వెఱ్ఱితనము" అనునట్లుచేసి వెనుక అయ్యో! యీరీతిచేసితిమిగదా! యని చింతించుకంటె వెఱ్ఱియేమున్నది. అనుచింతతో రెండుమాసములవఱకు నగరిలోఁబోయిన కంఠాహారమునుగురించి తలంపులేకయుండె.

ఇవ్విధంబుండ నొకనాఁడు భార్యదగ్గఱకేతెంచి "మంత్రిమరణచింతతో నింటఁబోయిన యమూల్యాభరణచింత మానినట్లున్నది. దానివెదకిదెప్పించుప్రయత్నము సేయకున్నారేల?" అనినవిని రాజేంద్రుఁడట్లు సేయింతుననిచెప్పి ఏరీతిఁ బ్రయత్నించినచో నారత్నాభరణంబులభించు? అని కొంతతడవుయోచించఁగాఁ గట్టకడ నొకవెఱవు మనంబున కుత్తమంబనితోఁచి యొకభటునిరావించి యిట్లనియె:

రాజుగారింట రత్నాలహారంబొకండు పోయియున్నదనియు నది దెచ్చియిచ్చువారికి సత్యంబుపరికించి గొప్పబహుమానంబిచ్చుటగాక వారిపేరు జగత్ప్రసిద్ధిగనుండునట్లు వారు చెప్పినచొప్పున జరిగింతురనియు, నీపట్టణంబెల్లఁ జాటించుమని చెప్పుటంజేసి యాభటుండట్లు చాటించినవాఁడయ్యె. అట్లుచాటించినది శాంతమతిబాగుగవిని మనంబున నానందమొంది పొరిగింటికేగి యుత్తడిపళ్లెరంబొకండు దీసుకునివచ్చి, భర్తనుబిలిచి నాథా! నాచెప్పిన చొప్పుఁదప్పక యీయవరహాగొనిపోయి, నిమ్మపండ్లును, అనంటిపండ్లును, ఆరంజిపండ్లును, ద్రాక్షాఫలకండంబులును, సుగంధపుష్పంబులును, ఏలకలవంగములును, జాపత్రిజాజికాయ వక్కలాకులును, గొనిరమ్మనిచెప్పుటంజేసి భానుగుప్తుండు శాంతమతిచెప్పినపండ్లు మున్నగునవి దెచ్చియిచ్చె. అవన్నియు శాంతమతిపళ్లెరంబునఁ బొందుపఱచి యందునం దనకులభించిన యమూల్యాభరణంబునిడికొని భర్తను దలపాగనిడుకొమ్మనిచెప్పి యిట్లనియె:

"ప్రాణేశ్వరా! నాతోడ రాజమందిరంబునకురండు. వచ్చి నేనారాజుకు సాష్టాంగ నమస్కారముసేయునపుడు నాతోడఁదామునుజేయుఁడు. నేను లేచునపుడు తాము లెండు. రాజుతో నే నన్నియుమాటాడెదను" అనిచెప్పి తనకు నాయమూల్యాభరణము లభించినవృత్తాంతమునుజెప్పె. అందులకు నాతండునగుచు సరిసరి! యిది చచ్చినపామువలన లభించినదని పాముసంగతి శాంతమతికిఁజెప్పె. పిదప నాపళ్లెరంబునెత్తుకుని దంపతులిద్దఱు రాజమందిరంబునకేగి, సింహాసనాసీనుఁడై యుండు రాజుముందట నాపళ్లెరంబిడి యిద్దఱు సాష్టాంగనమస్కారంబులుచేసి లేవక యూరకయుండిరి.

శాంతమతి ప్రశాంతమహారాజువలన శ్రీలక్ష్మీవ్రతంబునకు నుత్తరువడుగుట

అంతఁ బ్రశాంతమహారాజు పళ్లెరంబునఁ బెట్టియుండు రత్నాభరణంబుఁజూచి చేతికెత్తుకొని, తనయింటఁబోయిన కంఠాభరణంబగుటంజేసి సంతసించి యాదంపతులంజూచి లెండని చెప్పెనుగాని వారు లేవక యూరకుండిరి. అప్పుడు రాజు దగ్గఱకేతెంచి, "దొంగతనమువలన నీదండఁబోయినందులకు మిమ్ము దండింతునని భయంపడకలెండు. పట్టణంబునఁ జాటింపించినట్లు కట్నంబేదైననిత్తు. కపటవృత్తి మిమ్ము విపత్తునకుఁద్రోయుటలేదు. ఆడినమాట తప్పుట లేదు." అనఁగ విని శాంతమతి "నాయనా! ఆడినమాటతప్పుటలేదుగదా! ముమ్మారుచెప్పి, నాచెప్పెడుమాటను బాలించితివేని చాలు" ననుచు నిద్దఱులేచినిలువంబడిరి.

రాజాదంపతులంజూచి ఆడినమాట తప్పుటలేదని ముమ్మారుపల్కఁ కంఠాభరణ వృత్తాంతమడుగుటంజేసి శాంతమతియిట్లనియె:

"నాయనా! మేముండెడుగుడిసెమీఁదఁ జచ్చినపాముపిల్లయొకటి యుండినది. గ్రద్ద యొకటి యెందుండియో యీకంఠాభరణంబును గాళ్లనిఱికించుకొనిదెచ్చి గుడిసెపైఁబడవేసి యాచచ్చినపాము నెత్తుకొనిపోయినది. ఇది దైవసంకల్పమువలన జరిగినకార్యమనితలంచి వెన్నడి నేనీయాభరణమును గఱ్ఱతోఁద్రోసి యెత్తుకొనిచూచి

క. పరధనము నపహరించినఁ
బరలోకసుఖంబు సెడును బరమేశుఁడు న
త్కారుణంజూడఁడు గష్టము
లరయఁగఁబైఁబైనవచ్చు నవనీనాథా!

అనుసీతింబాటించి పరద్రవ్యమపహరించుటవలన దురితంబును, బరలోకసుఖహానియు గల్గును. మఱియును

శ్లో. కోటరాగ్నిర్యథా శేషం సమూలం పాదపం హరేత్
ధర్మార్థౌ తు తథాల్పోఽపి రాగదోషో వినాశయేత్ ॥

అనునట్లు చెట్టుతొఱ్ఱయందు నిప్పుకొంత నిల్చియుండినపక్షంబున నాచెట్టును వేళ్లతోసహగంటనెట్లుకాల్చివేయునో, యట్లు పేరాశయనుదోష మించుకయుండినచో నిజమగు మేలయిన ధర్మార్థములను నాశనముసేయుచున్నది. కాబట్టి పరద్రవ్యమును హరించుట శ్రేయంబుగాదనితలంచి డాఁచిపెట్టియుండి యీయాభరణము విషయమై యెవరైన నడిగెదరో వారికిత్తమనియు, లేక కొన్నాళ్ళుచూచి అనాథధనంబునకు మానవనాథుండు నాథుండను సామెతవలె నీకంఠాభరణబును రాజుకీఁదలంచియుంటిని. "పల్లముండుచోట నీరునిల్చునట్లు" ఏసొత్తు ఏచోటచేరవలెనో యాచోటఁజేరుకాలము వచ్చుటంజేసియును దాముపట్టణంబున భూషణముదెచ్చి యిచ్చువారికి బహుమానం బిత్తుననియుఁ జారుని వలనఁ జాటింపించినందున విని, పరమానందభరితనై యిట్లుదెచ్చి భవచ్చరణారవిందంబుల కడ నిడితి, మేము కడుపేదవాండ్రము, మాకీయూరనిలుచుటకు నిల్లులేదు. మేము వైశ్య

కులసంజాతులము. మాకుఁదామేమియు బహుమాన మీయఁబనిలేదు. నామనంబున నొకతలంపున్నది. అదిపరిపూర్తిగావించితివేని చాలు" ననఁగ నాప్రశాంతమహారాజు శాంతమతి నిజధర్మంబునకు సంతోషించి యిట్లనియె:

"అమ్మా! యీయాభరణమ్మును డాఁచిపెట్టి యమ్మకొనక యిమ్మెయిందెచ్చి ముదమ్ముగల్గించువారిమ్మహింగలరే? నీసచ్చరిత్రమ్మునకు మెఱమెచ్చువాఁడ. భవదభీష్టమ్మెఱింగించితివేని యవ్విధమ్మునజరిగింతు. ఇంతప్రాయమ్మున నెంతయుఁజక్కనినీతులు పల్కి జగమ్మునఁగొమ్మలమిన్నలకు యశమ్ముదెచ్చితివిగదా?" యని యాదంపతులపెల్లడిగి దెలుసుకుని సంతసించుచుండ శాంతమతి రాజేంద్రునకిట్లనియె:

"నాయనా! యీయవనీతలంబున, "అర్థాస్సాధారణా ఏవ వియుజ్యంతే స్వభావతః" అనునట్లు ద్రవ్యాదిపదార్థములు సర్వజనసామాన్యములుగాని వేఱుగాదు. మఱియుఁగొన్ని దినంబులకు నవి నశించిపోవునవిగనున్నవి. దానంజేసి నాకట్టివిధములయిన బహుమానములవలదు. ఈశ్రావణశుద్ధపౌర్ణమికి ముందువచ్చు శుక్రవారమునాఁడు వరలక్ష్మీవ్రతము వచ్చుచున్నది. ఆవ్రతదిన మీపట్టణంబున నెవరుగాని వ్రతముచేయఁగూడదనియు, ముందు దినము మూసినవీథితల్పులు తెఱవకూడదనియు, నొకవేళ యెవరైనఁ దల్పుదెఱచియలికి ముగ్గులిడిరేని దగుదండనవిధింతుననియు నిట్లుపురంబునఁ జాటింపించితిరేని చాలును." అన విని రాజేంద్రుఁడు "భళా! శాంతమతీ! ధనధాన్యములును, భూములును, భూషణాంబరములును, గ్రామంబులును, గోరక కట్టకడ యేమిట్లుగోరితివి? అయిన నీయభీష్టంబుచొప్పున నిప్పుడచాటింపించెదఁబొమ్ము." అనిచెప్పి శాంతమతి యభీష్టప్రకారంబుగ నప్పట్టణంబంతయుఁ జాటింపించె.

అనంతరము శాంతమతి భర్తందోడ్కొనివచ్చి గుడిసెఁజేరె. పురంబునఁగల జనులందఱారాజునానతికి నచ్చెరువందిరి. ఇవ్విధంబుండ నావ్రతదినము వచ్చుటంజేసి శాంతమతి తానుండుగుడిసెను బాగుగనలికి ముగ్గులిడి యెఱ్ఱమన్నుబూసి, ద్వారంబునకు మావి, మఱ్ఱి, రావి గుత్తులతోడఁ బూగుత్తులఁజేర్చి తోరణంబుగట్టి వ్రతంబునకువలసిన వస్తుసముదాయంబును సేకరించుకొని భర్తకు మంగళస్నానంబుసేయించి తానుంజేసి శుద్ధవస్త్రంబులలంకరించుకొని శక్తికొలఁది భక్ష్యభోజ్యాదులొనర్చి సాయంసమయంబున నాగుడిసెయందుత్తరభాగంబున, నొకమండపము కదళికాస్తంభంబులచే నిర్మించి, వివిధపుష్పపత్త్రింబులచే నలంకరించి యామంటపమధ్యంబున నొకపీఁటపైఁ గ్రొత్తతండులంబులుపోసి యందు లక్ష్మీకలశంబొండిడి యిరుప్రక్కలయందు దీపంబులువెలిగించి, తానదివఱక వ్రతంబుకల్పప్రకారము చేయించుట కొకవిప్రోత్తముని రావించుకొనియుండుటంజేసి యాతని పూర్వకంబుగ భర్తయుందాను నిశ్చలభక్తిం బ్రథమంబున గణేశునారాధించుకొని యావల నా లక్ష్మిని ననేకవిధంబులంగొనియాడి విధిప్రకారము వ్రతంబొనర్చుచుండిరి.

## శాంతమతికి లక్ష్మీదేవి ప్రసన్నమగుట

ఇవ్విధంబుండ నాదిన మాపురనివాసియగు లక్ష్మీదేవియందందుఁదిరిగి యెందుంగాని పరిశుద్ధమగుచోటు లేనందులకు నచ్చెరువంది వచ్చుచుండి శాంతమతియుండు గుడిసెకడం జూడఁ గడురమ్యంబై యుండుటంజేసి యానందంబు నొంది యటకు

సీ. కెందమ్మివన్నియ నొందినసెమ్మెముఁ గళికల్వశోరగు గన్నుదోయిఁ
దుమ్మెద ఱెక్కలఁ దుఱఁగలించెడు కురుల్మిసిమిని కస్తూరిచుక్క యొసఁగునొసలుఁ
నిగ్గుటద్దంబుల నెఱిఁదాల్చుచెక్కిళ్లు బంజులకమ్మలు పఱలుచెవులుఁ
బలువింతనొప్పుసొమ్ములసోయగంబు నొప్పెడుచేయిదమ్ములు మెడయుపదముఁ
గ్రొమ్మెఱుంగులపోడిమి జిమ్ముపసిఁడి
వలువఁ జెన్నొందునొడలునందెలు పెలంగు
నడుగుదమ్ములఁ దనరార విడిగివిడగ
నట్టితోగదమ్మిపువుఁగేల నందియొలమి.

అడుగుదమ్ముల నందియలు మ్రోయ లేనగవు నెమ్మొగంబున మొలకలెత్త, వచ్చి వీథిగుమ్మముకడ నిలుచుటంజూచి శాంతమతి యించుకతడవు పూజమాని కనువడిఁ బ్రియుండోడ్కొని యెదురేగి యీమెలక్ష్మియని నిశ్చయించి

శ్లో. మహాలక్ష్మీ నమస్తుభ్యం
నమస్తుభ్యం సురేశ్వరి
హరిప్రియే నమస్తుభ్యం
నమస్తుభ్యం దయానిధే
నమః క్షీరార్ణవసుతే
నమస్త్రైలోక్యధారిణి
వసువృష్టే నమస్తుభ్యం
రక్షమాం శరణాగతమ్.

అభిధ్యానంబుంజేసి దండప్రణామంబులాచరించి యాదేవితో నిట్లనియె: "తల్లీ! నీవెల్లలోకంబుల నుల్లాసంబుగఁ గ్రుమ్మరుదానవు, నాయనుగుమాటలకుఁ గనుంగృప నుత్తర మీఁదలంతు. మఱియు నిన్నన్యాంగన యిది యెవతో వచ్చెనని తలంపక హరిప్రియయని నిశ్చయించి వేఁడుదాన"ననఁగ నాయిందిర కరుణార్ద్రచిత్తయై శాంతమతింజూచి "అమ్మా! యిమ్మహాపట్టణమ్మున నెందేని మంగళకరమ్మగుచోటు లేమింజేసి యందందుఁ గ్రుమ్మరి యిందు మనమ్మునకు సంతసమ్ముగనుండ వచ్చి నీవడిగెడువరమ్ములిచ్చి యుండించుకగూర్చుండి పోవనెంచినదాన. నీవేమో యడుగనెంచినది యడుగుము" అనఁగ శాంతమతి, "లోకమాతా! ఈకరణింజెప్పు టుచితంబుగాదు. కాఁబట్టియ మున్నడిగ "లోకంబులంగ్రుమ్మరుదానవని యంటిని. అట్లు తడయక యిపుడపోవనెంచితివేని నాయింటికడనిలువక నాకెట్టి వరంబులేని యీఁక యెందేనిపొమ్ము. వచ్చినదానవు నిశ్చలము నాయింట మఱియేమ్వ

రతోనుండుము. మఱియు నాస్వప్నంబున నిదివఱకే ప్రసన్నంబయి నన్నాదరించితివేని నీయభీష్టాపూర్తి సేయుదానవని వచించినదానవు. అడిగినమాటదప్పక నావేఁడికోలియకొని యుండుము. కాదంటివేని గుడిసెలోని కడుగిడక తడయకపొమ్ము. నాలేమితో నిపుడుండు నట్టుండెద. లేడికిలేచినదే ప్రయాణమన్నట్లు యీదినమిక్కడ రేపింకొక్కయెడ మూడవ నాఁడు మఱొక్కెడ యిట్లు సంచరించుట నించుక నీవలన సుఖంబుగనుప్పట్టదు. రెన్నాళ్ల రెడ్డితనానికున్న దున్న నమ్మి డంబముగ దిరిగినట్ల నీవు రెండుదినంబులు నాగుడిసెనుండి లేనిపోని వెఱ్ఱివేషంబులపాలు సేయకుము. దయగల్గి నామాట కియ్యకొంటివేని గుమ్మము దాఁటి లోనికేగుము. నిర్దయహృదయముగల దానవైనచో నీక నేఁజెప్పఁబనిలేదుగదా! దిట్టతనంబుగ మాటాడుదానవని యాయాసంపడకుము. ఎట్టివారికింగాని యొకసంగతికిఁ గట్టడయుండుటమేలు. కాఁబట్టి యిందుండనేల?

కం. అమ్మా! మాయింటికిరా
వమ్మా! యందెలును మ్రోయ నడుగులిడుచు ని
త్యమ్మును మావలనంజే
కొమ్మా! పూజలను జెలఁగి గురుకృప జననీ!

అని ప్రార్థించుటంజేసి శాంతిమతి వచనంబుల కత్యంతసంతోషచిత్తయగుచు నాహరి కాంత నీవభ్యర్థించినట్ల నీయింటనుండుదానవని వచించి రెండడుగులు గుమ్మముదాఁటి గుడిసె లోనికేగి యంతర్హితయయ్యె. అంత నాశాంతమతి భర్తందోడ్కొని లోపలికేగి జరుపు చుండిన వ్రతంబు సంపూర్తిగావించి వచ్చియుండు విప్రోత్తమునకు శక్తికొలంది దక్షిణ తాంబూలంబులొసంగి యాతని శుభదాశీర్వచనంబులంది యతనింబంపి యావలదాను భర్తతో, నాలక్ష్మీదేవిని యనేకవిధంబుల వినుతించి, భర్తయుందాను భుజించిరి. మరు నాఁడు యథావిధి పునఃపూజచేసుకొని యెప్పటియట్ల యుండిరి. —కొదువ.

## అర మోడ్పు

కొప్పునమంచి జోగయ్యశర్మగారు

ప్రేయసీ! యేల నీవిట్టిబేలవైతి?
వెలసమయంబులందు నేనింటికడనె
యున్నచో, కార్యజాలంబులన్ని బుగ్గిఁ
గలసిపోవె? విదేశంబుగమన మేను
వ్యర్థముగనిచ్ఛగింతునే! యాలసింప
కె దుదినములలోన, నేనన్నిపనుల
సరగఁగావించి, యింటికిమరలివత్తు
నంచు, నెట్టకేలకునునొప్పించి, పోన
పయనమగునంత, గన్నుల బాష్పకణము
లలముకొన, వీథికడనున్న యరుఁగుపైని
మందమారుతకంపితమాధవీల
తికముపోలిక నిలిచి, మదీయగమన
మగుపడెడునంతవఱకు, ననన్యదృష్టిఁ
గాంచి, దైన్యంబు మోమునఁ గడలుకొనఁగ
నరుణుఁ డపరాద్రి కేగెడు నవసరమున
నర్థముకుళితవికసితాక్షాంబుజద్వ
యంపుశోభామనోహరం బతకరించి,
మద్వియోగవిషాదసంభ్రాంతయగుచు,
సొలపుచూపులతోడ నన్ జూచునట్టి,
మగువ యరమోడ్పుకన్దోయి మరువఁదరమె?

# దీపావళి నాడు

శ్రీమతి కవులిగ లక్ష్మీబాయమ్మగారు

౧

“ఇదిగో. మిమ్మల్నే. అబ్బ! యీపాటికి లేద్దురూ” అంది సావిత్రి భర్తను లేపుతూ.

“...........”

“లేవరటండీ...చాలాపన్లున్నాయండీ!”

“ఊర్కే ఒహటే అల్లరి.—కాస్సేపైనా పడుకోనియ్యవ్.” అన్నాడు ప్రకాశరావు ముసుగుతీస్తూ.

“మీపడక్కి రోజూ అడ్డమొస్తున్నట్టు...రోజూ లేపుతున్నానా?...ఇవ్వాళ కాస్త పనుందిగదా అని పండగరోజాయను. వాళ్ళపిల్లలుచూడండి ఎలాఆడుకుంటున్నారో పొద్దున్నే లేచి.”

“నన్నూ ఆడుకోమన్నావేంటి?”

“ఆడుకోండి. తప్పేంటి?”

“అ...యిహ ఆదొక్కటే ఉండిపోయింది. మాఅమ్మవింటే ఏంజేస్తుందో తెలుసా నువ్వు నన్ను ఆక్షేపిస్తున్నావని.”

“లేవకుండానే కబుర్లుచెప్తారేం? అదిగో మీఅమ్మపిలుస్తున్నారు. వినబడుతోందా? త్వరగా లేచాద్దురూ. చిన్నబ్బాయిని బతిమిలాడినట్లు బతిమిలాడాలీ.”

“అ బతిమిలాడొద్దూ? మాఅమ్మకు నేను చిన్నబ్బాయినికానూమరి.”

“సరే, బతిమిలాడవలసివచ్చినప్పుడు బతిమిలాడతాల్లెండి...లేవరుగదూ?”

“నాకిప్పుడు నీళ్ళేమిటి? నీకేంమతిపోయిందా ఏమిటి?”

“అయ్యో! అలాఅంటారేమిటి? పండగరోజుగదూ? మీరుపోసుకోకపోతే నేనూపోసుకోనూ. రారూ?”

“పిచ్చిదానా! నాకెందుకే ముసిలివాణ్ణయాను.”

“అప్పుడేముసిలివాళ్ళయారూ యిద్దరుపిల్లల్నికనగానే...మీరేమన్నాసరే యిహతప్పదు.”

“ఏమిరా! అబ్బాయి! ఇంకా లేవలేదుగా? నీతరవాళ ఎంతమందిపోసుకోవాలో చూదూ.” అంటూ కామేశ్వరమ్మవచ్చింది చేతిలో చెంబొకటిపట్టుకొని.

“వాళ్ళందరికి పోశాక నేనూ.”

“చిన్నపిల్లలా...ప్రొద్దున్నే లేపుతే మారాంపెడతారు. మూడుఘంటలకి లేచాం నేనూ, అదీనీ.”

“ముందు దానికి పొయ్యి.”

“అలాకాదంటుంది. నీకు పోశాక అదిపోసుకుంటుందిట...కాస్తచలితగ్గాక పోస్తా దానికి.”

“ఆహా! దానికిచలిట, నాకుచల్లేదుట, ఇదేపక్షపాతం.”

“నీసణుగు...అయ్యో! అప్పుడేనాలుగున్నరయిండి. లే త్వరగా. నేనింకా నీకూ, దానికీపోసి పొయిదగ్గరకెళ్లాలి...వడ్డిమంగలాడుగావల్ను తలుపుతట్టున్నాడు...ఆ వస్తున్నా” అని తలుపుతీసివచ్చింది కామేశ్వరమ్మ.

“ఇవ్వాళ పిండివంటేమిటే?”

“ఏమిటో నువ్వే చెప్పు.”

“గాంధీ అస్పృశ్యతాఒడంబడికఅయాక ఏంచేశావు?”

“ఏమీలేదూ నాకు ఒంట్లోబాగుండక, అదియింట్లోకిరాక—అతర్వాత దశరాకి వాళ్ళింటికెళ్ళామా? మరిపీలైందికాదు.”

“ఐతేయిప్పుడు...పోనీదాన్నడుగు.”

“ఇది బాగుందన్నిటికన్నాను” అంది సావిత్రి తల తిప్పుతూ.

“ఓస్. సిగ్గుపడక. మొన్న మీయింటికివచ్చినప్పుడడగలేదూ నన్ను ఏంచెయ్యమన్నారని.”

“చెప్పవే? సిగ్గెందుకు.” అంది అత్తగారు.

“నాకేంవద్దు.”

“ఏంవద్దూ...అమ్మా! దానికి జిలేబీలిష్టంట. మొన్న చెప్పింది.”

“ఓస్, అటపా నామీదెందుకూ? మీకిష్టమంటే

చెయ్యరా ఏమిటిది?"

"ఇదోకరకమైనసిగ్గు. అమ్మా! అవ్వేచెయ్యి."

"ఆ...లే...పద..."

2

"బాబు! బాబూ! లేఅమ్మా! లే లే చూడూ కళ్ళు తెరు...ఇదిగో నీళ్ళరాముతో బాగాచూడూ."

"ఊఁ" అంటూ రెండోపక్కకితిరిగి పడుకున్నాడు చిట్టి.

"లేవరాబాబు! లే!లే! అమ్మా, లే! బాబువుగదూ, లే. చూడూ అక్కయ్య ఎంచక్కనీళ్ళోసుకుంటోంది. ఆ నువ్వెక్కడలేస్తావ్. ఆ అయ్యకొడుకువుగదూ ఒహంతట లేస్తావూ?"

"నాకొడుక్కాదని ఎవరంటారు." అంటూ వచ్చాడు ప్రకాశరావు.

"అమ్మయ్య! లెమిలాదూ...బతికాంబాబూ యింటిల్లిపాదీనీ...మీకొడుక్కాదని ఎవరనగలరు. రూపురేఖావిలాసాలు గుణాలు అబ్బాయి మూడుమూర్తులూను,...లే,అమ్మా,లే."

"అబ్బ! ఏంటే"

"నీళ్ళోసుకోవూమరి. టపాకీలవండగ్గాదూ!"

"నీళ్ళొద్దే...టపాకీలుకావాలి."

"నిన్న నువ్వు బాజాలువిన్లేదూ నీళ్ళుపోసుకోని వాళ్ళకిటపాకీలివ్వమని."

"ఐలే పద"

"నువ్వు మంచివాడువమ్మా, మీనాన్నలాకాదు, మళ్ళాపడుకొంటున్నావా?... బామ్మపిలుస్తున్నారు. లే, మరీ."

"అదుగో చిన్నపిల్లత్తో కూడ రిపోర్టే నామీద... ఇదుగో యిలారా."

"చాల్లెండి, వేళాపాళాలేదు...అబ్బ...మీఅమ్మ పిలుస్తున్నారు. పోవాలి...పిల్లాడుకనబట్టంలేదూ? సిగ్గులేకపోతేసరి."

"సిగ్గా?"

"అబ్బ...అత్త...య్యా?"

3

"నాన్నా! టపాకీలునాన్నా!"

"కొంటానమ్మాకొంటా, కాస్తచల్లబడ్డాకవెళ్ళితెస్తా."

"మీనాన్న పాపం చాలా అలిసిపోయ్యారా మరి ఆపన్నీతిని, అంచాత చల్లబడ్డాక తెస్తారు."

"నన్నసలు తిన్నిచ్చావు? నేనుతినేస్తే నీకుండదేమోఅని ఒహటేకేకలు లెండిలెండని."

"అబ్బో! అసలు నాదాకారానిస్తారూ?" అంది చెయ్యితిప్పుతూ.

"నాన్నా! ఎప్పుడుకొంటావుమరీ."

"చల్లబడ్డాకవెల్తా. సరేగానినీకేంగావాలిచెప్పు."

"నాకా! మరేం నాకేం మరి చీమటపాకీలూ,"

"ఇంకా."

"మరి...చిటపటలు"

"నాన్న! వాడు చిటపటలుకాల్చలేడు నాన్న!" అంది కమలం తల్లిఒళ్ళోకూర్చొని తాంబోలం వేసుకుంటూ.

"ఆ కాల్చలేకేం పాపం. నేకాలుస్తా,నాన్నా!"

"అవెలాకాలుస్తావురా? చిట్టీ!"

"అది ఓస్ నాకుతెలీదుగావుల్సు, దీపానికి ముట్టించిపారేస్తేసరి."

"అమ్మాయి నీకేంగావాలే."

"నాకేంవద్దు" అంది తలతిప్పుతూ.

"నాన్న!అక్కకేం"అన్నాడు చిట్టిఅక్కయ్యకేసి చూసి నవ్వుతూ,

"ఆ ఏంకావాలందిరా? బాబూ!"

"మరేం...అమ్మో కొడుతుందిబాబూ."

"చెప్పమ్మా మరేమీ అందు చెప్పు."

"చెప్పనా మరి. ముంగుడుకావాలట."

"నీతో ఎప్పుడుచెప్పిందిరా? ఆ. ఆ. వాణ్ణేవనక. ఊరికే అన్నాడు. చిన్నపిల్లాడుకాదూమరి."

"ఆ.ఊరికేఅన్నాడుపాపం.చూడుతంతానో లేదో"

"పోనీ వాడితో ఏంగావి నీకేంగావాలో చెప్పు."

"నాకేంవద్దు"

"కోపంవచ్చిందా ఏం? యిలారా కోప మెందుకూ? ఏంకావాలో చెప్పమరి."

"టాటాకుటపాకీలు, కాకరపువ్వొత్తులు, మతాబాలు, అగ్గిపెట్టెలు..."

"నాన్నా! నాకూ కావాలి నాన్నా! అగ్గిపెట్లు."

"సరేలే...యింకేంకావలమ్మా."

"ఇంకానా...మరి అక్కాదేవుంటే అవి."

"ఒరేయి మీఅమ్మనడగలేదని కోపమొచ్చింది కోయి. నీకేంగావాలోయి" అన్నాడు సావిత్రితో.

"నాకేమక్కర్లేదు."

"జానూ నేనుండగా యివన్నీ ఎందుకునీకూ?"

"నువ్వెందుకు నాన్నా"! అన్నాడు చిట్టి.

"చాల్లెద్దురూ...సరసం ... ఎవర్ని చూడకుండా మాట్లాడతారేం? చిన్నపిల్లలు, రేపు యివే వాళ్ళకు ఆటలు ఈకబుర్లే."

"సరేలే. క్షమించు. లెక్చరుతో ధణుతెగరగొడుతున్నావు."

"క్షమించడవా యికా!"

"పోనీ శిక్షించు—పంచబాణాలు కావాలా—కాముకుల ఆయుధం నీదగ్గరేఉంది."

"చాల్లెండి యిహాకవిత్వంగాబోలు—నాకో ఖద్దరుచీర తెద్దురు చాలు."

"అది సరేలే. కాల్చుకోడానికో."

"నాకేంఒద్దుగాని రంగంటపాకీలు మరచిపోకండేం."

"ఎందుకూ? నామీద ప్రయోగించటానికా?"

౪

"అమ్మాయి! అమ్మనిలాపిలు."

"ఆ—వచ్చారూ-ఒరేయి బసవాయి అబుట్ట లోపలికి పట్రారా!" అంది సావిత్రి చేతిలోసగం అల్లుకుంటున్న జడపట్టుకొనివస్తూ.

"అ. ఏమిటో చాలా తెచ్చారే."

"ఇదేంటి నాన్నా!"

"ఒరేయి! దూరంగాకూర్చోవాలి. లేకపోతే పేల్తాయి. అంతాదూరంగా కూర్చుంటారు.

"ఇది నీకు—ఇది అక్కయ్యకి...యిదిఅమ్మకు."

"ఆ—నాకెందుకూ?"

"ఓస్ మొహమాటపడకు."

"నీకెందు కేమిటి నువ్వుమాత్రం కాల్చుకోవూ?" అందికామేశ్వరమ్మ పత్తులు చేసుకుంటూ.

"అమ్మా! యిందే" అనిపొట్లాం చేతికిస్తున్నాడు ప్రకాశరావు.

"నాకెందుకురా—నీకేంమతిపోయిందా?" అంది పుచ్చుకొంటూ.

"అబ్బ యివికావే. విప్పిచూడూ తెలుస్తుంది."

"ఎంతకొన్నావురా."

"పదిరూపాయిలు—బాగుందా?—మూరా, వెడల్పుచూచుకో."

"ఆ బాగుంది—అదేమిటి?"

"ఇది దొరసానమ్మగారికి."

"ఇదెంత?"

"పదిహేనురూపాయిలు—తమరు ప్యానుచెయ్యండి." అన్నాడు సావిత్రితో.

"ఖద్దరేనా?" అందిసావిత్రి పరీక్షచేస్తూ.

"ఖద్దరేఅని సంశయంఎందుకు? ఏమాత్రం అనుమానంవేసినా యిచ్చెయ్యనా? ఖాదీబండారులో కొన్నాను. అటువంటి అనుమానాలక్కర్లేదు."

* * *

"ఒరేయి! రాత్రి నేను యింటికొచ్చాక భోంచేసి కాల్చుకుందాం. ఏం?"

"అలాగేలే—ఏమేఅక్కయ్యా!"

"ఒరేయి! ఇవికొనకపోతే ఏదోగుడ్డకొని వాళ్ళకియ్యరాదూ. డబ్బు కళ్ళకక్కనబడుతుంది."

"దేశంఅంతా కాలుస్తుంటే వీళ్లూరుకుంటారా? ఏదోపిల్లలు కాలుస్తారు. మన కెందుకూ?"

"అంతా పట్టుబద్దా లత్తా! పిల్లల్లోపేరూ ఈయన కాల్చటం. నాకు తెలీదు. లేకపోతే యీతూటాలెందుకూ పిల్లల్కా?"

"అవి పక్కింటిరాముడు తెమ్మంటే తెచ్చా. నాకెందుకూఅవి? చెప్పావ్ గదూ. ఉండునీపని. మరి

సమయం రాదూ? అన్నాడు పెళ్లాంతో నింపాదిగా.

"ఆ. వస్తేం చెయ్యగల్రు అత్తయ్యదగ్గిరుంటే?"

"మరెప్పుడూ రావు కాబోలు పైకి."

"రానేరాను. ఏంచేస్తారు?"

"ఒరేయి! దానిజోలికెళ్లద్దోసుమా మరి."

"అబ్బే. ఊరికే అంటాను గాని ఎప్పుడైనా ఒక చిన్న దెబ్బ కొట్టానా?"

"ఊ. కొట్టలేదు పాపం. ఔను చిన్న దెబ్బ ఎప్పుడూ కొట్టలేదు. పెద్ద దెబ్బ కాని కొట్టినప్పుడల్లా!"

"ఎప్పుడు కొట్టానే. ఇంకా పై పెచ్చు నువ్వే కొడుతున్నావు నన్ను."

"ఆ—పాపం. నా చేత దెబ్బ తిన్నే యిలా చిక్కిపోయారు."

※

రాత్రి అందరి భోజనాలూ అయాయి. టపాకీల అడావడిలో పిల్లలు తిన్నగా భోజనం చెయ్యలేదు. అక్కాతమ్ముడు చెరో అరుగుమీదా కూర్చున్నారు ఏమిటేమిటో కాలుస్తూను. తాంబోలం వేసుకొని వచ్చాడు ప్రకాశరావు పిల్లలేం చేస్తున్నారో అని.

"ఒరేయి జాగ్రత్తరోయి— ఉండు నేనోస్తా" అంటూ పిల్లవాణ్ణి తనవొళ్లో కూర్చోబెట్టుకొని కాలుస్తున్నాడు ప్రకాశరావు. లోపల్నుంచి రంగం కాయిలు పట్టుకొని వచ్చింది సావిత్రి. సమయం కనిపెట్టి పరసగా పేల్చిం దతనివీపుమీద. కోపం వచ్చింది కాబోలు పిల్లాణ్ణి దింపి తనదగ్గరున్న కాయలన్నీ పట్టుకొని సావిత్రిని వేటాడుతున్నాడు. అవి తప్పించుకోడానికి ప్రయత్నిస్తోంది సావిత్రి.

"అయ్యో! అదేమిట్రా. టపాకీలతో కొట్టుకుంటారా ఎక్కడైనా?" అందికామేశ్వరమ్మ తులసికోటదగ్గరున్న దీపాల్లో నూనెపోస్తూ.

"మరేం భయం లేదమ్మా. అవి కాలవు. ఊరికే పేల్తాయి. ఇవి మాలాటివాళ్లకోసమే గాబోలు కనిపెట్టారు" అన్నాడు నవ్వుతూ.

"ఐతే మీయిష్టం. పిల్లలు జాగ్రత్త. దీపావళంటే అసలే భయం బాబూ! నాకూ. కిందటేడు మావాపక్కింటి శీతయ్యగాడికేమైందో? ఆ గాయం వల్ల చచ్చినంత పనైంది."

"అటువంటివి కాల్చకుండా గవర్నమెంటువారు జాగ్రత్తగా ఉన్నారు. ఐనా మనకూ తెలీదూ ప్రమాదమని."

"ఏం జాగ్రత్తో" అంటూ తులసికోట చుట్టూ ఉన్న దీపాలారిపోకుండా ఎగసనదోస్తూ, పిల్లల్ని ఒక్కంట కనిపెడుతూ, కొడుకు తెచ్చిన కొత్తచీర కట్టుకొని "కృష్ణా! రామా!" అంటూ కూర్చొంది ముసలావిడ. సావిత్రి ప్రకాశరావు యింకా వేటలో నే ఉన్నట్టుంది.

## బుద్ధుఁడు

ఆరవిల్లి నరసింహాచార్యులుగారు బి. ఏ.

తేజంబుగలిగిన ధీశక్తికో అవధు
ధిషణగల్గిన శౌర్యదీప్తి నాస్తి
శూరతఁగల్గినఁ గ్రూరుఁడై యగడందు
శీలముండిన నల్పజీవియగును
పూర్ణాయువుండిన భూపతిత్వమునున్న
నృపుఁడైన నాప్తులే రిపులగుదురు
భృత్యులుహితులైన నిల్లాలుజగజంత
దైవోపహతుఁడగుఁ దప్పెనేని
ఇన్నిగల్గినవాఁడు వేయేండ్లకొకఁడు
పుట్టునేని విరాగియై భూపతిత్వ
ముజ్జగించి వనంబులనుండి సుజన
వందితుండయి తుదిని నిర్వాణమందు.
ప్రాజ్యసామ్రాజ్య, మనుకూలవతియగుసతి
మమతఁ బెంచినతండ్రి, నిర్మలులుహితులు,
విశ్వకల్యాణచింత నావేశునాఁగఁ
జాలమికి నీచరిత్రమే సాక్ష్యమొసఁగు
సర్వసర్వంసహాభారసహనచణము
లైనయెగుభుజంబులను ప్రణార్తబాల
మేషవహనంబు సల్పునమేయగుణివి
బుద్ధమూర్తి! యోజగత్ప్రసిద్ధమూర్తి!

# బాలవిజ్ఞానశాఖ

౧. పాటలు

## చిన్నపిల్లల పాట

ఉత్తరము వురిమింది దక్షిణము మెరిసింది
పరిగెకుపోయి రామన్న పదునుచూచివచ్చె
ఇంటికడసీతమ్మ విత్తనాలుచేసె
వారితల్లి వసుదేవి కురులుసవరించె
నేనుచేసింది పన్నెండుధాన్యాల ప్రత్తివిత్తుల్లు
పణతి ఆసీతమ్మవిత్తనాలు వడికట్టె
సీతమొదపట్టంగ శ్రీరాముడు గొఱ్ఱుపట్టు
రంభమొదపట్టంగ రఘురాముడు గొఱ్ఱుపట్టు
ములకాలకఱ్ఱల్లు మున్నూరువేలు
పాపడాగుండెగలు పదహారువేలు

## పిల్లల పాటలు

౧

చిట్టిబొమ్మలపెళ్లి చెయ్యవేడుక
శ్రీరెండువాకళ్లు సిరితోరణాలు
గాజుగుమ్మాలనూ రత్నకంబళ్లు
పసిబాలకుడకలో పచ్చనక్షతలు
అరటిస్థంబాలనీ అమరెపెళ్లెరుగు
చిన్నన్నపెట్టెను చింతాకుచీర
పెద్దన్నపెట్టేడు పెట్టెళ్లసొమ్ము
నాయన్నపెట్టెను నానుతోపుస్తె
నాబొమ్మవెళ్లింది దబ్బల్లుదాటి
నాబొమ్మవెళ్లింది నిమ్మల్లుదాటి
నాబొమ్మవెళ్లింది తోటల్లుదాటి

శ్రీమతి గాలం రంగనాయకమ్మ గారు

అంబలిదుత్తల్లు అవినూరువేలు
జడ్డిగమిసినయట్టి శతకోటియెడ్లు :
నాగేలుదున్నేటి నాచక్కనన్న — :
నాతగవు తీర్చవయ్య.
చెల్లీ! సారెకావలెనా లేక చీరకావలెనా
సారవద్దుఅన్న చీరెవద్దన్న
వదినతో వకమాట ఒప్పించుఅన్న
పాలుకావలెనా నీకు పట్టికావలెనా
పాలువద్దుఅన్న పట్టికావాలి
నీమాటనామాట ఒకటికావాలి.

తులసి లక్ష్మీనారాయణమూర్తి గారు

నాబొమ్మవెళ్లింది అత్తవారింటికి.

౨

చాలాచాలా చెక్కిళ్లా
చెయ్యరానీ బొమ్మల్లా
నీబొమ్మపేరేమి
సీతమ్మ శ్రీరాములు
చక్కనికీలూకడియాలూ
ఎవరు చేయించారు
శ్రీరాములు చేయించారు
సీతమ్మ పెట్టుకుంది.

3

అమ్మగా రమ్మొచ్చెనా

ఆదోండ వండొచ్చెనా
చిలకాల దండొచ్చెనా
కెంపూల సత్తొచ్చెనా
శ్రీలక్ష్మి మొగుడొచ్చెనా
వెంకమ్మ నీపేరు కుంకాలిభరణి.

౪
చిట్టీ చిట్టీ ముత్యాలూ
చెట్టూకిందా పోయించి
ఆరబోసి తెప్పించి
అందిపుచ్చుకు ఇప్పించి
శ్రీరాముని పిలిపించి
సీతమ్మ కిప్పించి.

## తలుపుదగ్గర పాట

శ్రీమతి చదలవాడ రాఘవమ్మగారు

ముత్యాలవానగురిసె ముదితేమీవదినెతడిసె
తలుపూతియ్యవేచెల్లల తడవై యున్నది ము॥
ముత్యాలవానగురిసితెముదితీ మావదినెతడిసితె
తలుపెట్లతీతునన్నా తలపులుండగనూ ము॥

రత్నాలవానగురిసె రమణీమీవదినెతడిసె
తలుపూతీయవెచెల్లెల తడవయియున్నది ము॥
రత్నాలవానగురిసితె రమణీమావదినెతడిసితె
తలుపెట్లాతీతునన్నా తగవులుండగనూ. ము॥

## పాత పాటలు

శ్రీమతి కొసరాజు సీతారామమ్మగారు

ఎంతచక్కనిదమ్మ ఏలూరుకోటా
యెక్కికూర్చున్నారు వెలమనాయకులు
సరులుచక్కనిదమ్మ చల్లపలికోటా
చదురుమీదున్నారు సరికమ్మదొరలు
మానుచక్కనిదమ్మ మామర్రిమాను
మ్రానుమీదున్నాను మామపెదమామ.

## బొమ్మల పెళ్లి

శ్రీమతి చావలి బంగారమ్మగారు

కొబ్బరాకుబూరాలు చుట్టుకుందామ
తాటాకుబొమ్మలు అల్లుకుందామ
కాగితప్పల్లకీ కట్టుకొందామ
బొమ్మలకిబట్టలు కట్టుకొందామ
బొట్టుకాటుకలను పెట్టుకొందామ
బొమ్మలకిపూసల్లు గుచ్చుకొందామ
బొమ్మలాపెళ్ళిళ్లు చేసుకొందామ?
ఎక్కడాలేదేమె ఈలాటిబొమ్మ!
గంధంబుపూయదే గయ్యాళిబొమ్మ.
పురుషుడను నేనన్న పొంకమేగాని,

సరసమేమెరుగునే తాటాకుబొమ్మ!
స్త్రీయంటతన కేమొ సిగ్గెక్కువంట
అందుచేతనుపూయదే ఆడబొమ్మ
నూతనపుదంపతుల లేతఅలుకల్లు
పాతవారలుచెప్ప చేతగాదంచు
మన కేమిమన కేమి మన కేమిటంచు
మనలోమనవారలే మరలదొలగేరు
మన కేమిమన కేమి మన కేమటంచు
మగువతోమగడేమొ మాటాడినాడు.

౨. కథలు

## నమ్మకం

శ్రీమతి తాయి రోజా కృష్ణవేణిగారు

శ్రీశైలశిఖరముచూస్తేనే పాపాలు పరిహారమౌతాయంటారు. అవి యుత్సవపు దినాలు. ఇసుకవేసినారాలనట్లు జనులు తండోపతండాలుగా శ్రీశైలదేవుని దర్శనార్థమై వస్తున్నారు. పార్వతీదేవి అన్నదిగదా పరమేశ్వరునితోటి "ఏమండీ శ్రీశైలశిఖరం చూచిన మాత్రాన్న పాపాలు పరిహారమౌతాయంటారు. వీళ్ళందరు ముక్తిపొందుతారా"అని. "వీళ్ళలో మోక్షార్హులొక్కళ్ళయినా ఉంటారో ఉండరో. ఎవ్వరు మోక్షార్హులో నేనునీకు చూపిస్తా" నన్నాడు పరమేశ్వరుడు. ఇరువురూ వృద్ధబ్రాహ్మణదంపతులవేషాలువేసికొని భూలోకానికొచ్చారు కైలాసంనుంచి. యాత్రికులుపోవుమార్గంలో ఒకబురదగుంటలో మొలలోతున దిగబడ్డాడు పరమేశ్వరుడు. పార్వతి గట్టునకూర్చొని "ఎవరయినా పుణ్యాత్ములుంటే నాభర్తను బయటికితియ్యండి"అని కేకలువేస్తూ ఏడుస్తోంది. "అమ్మా! నేను నీభర్తను బయటికితీస్తా"నని ఒకయాత్రికుడు ఆమెవద్దకువచ్చేడు. "నాయనా! నీవుతీయవచ్చు. దానికేమిగాని నీవు ఏవిధమైన పాపాలుచేసియుండినా నాభర్త బయటికిరారు, సరిగదా గొంతులోతువరకు కూరుకొనిపోతార"న్నదిపార్వతి. "నేనుపుట్టినది మొదలుఎన్ని పాపాలుచేశేనో ఇప్పుడుప్రయత్నించి ఈబ్రాహ్మణహత్యకూడా నెత్తినిగట్టుకొనుటెందుల"కనుకొంటూ వెళ్ళాడు యాత్రీకుడు. అనేకమంది "నేనుతీస్తాను నేనుతీస్తాన"ని వచ్చేరుగాని తీరా సమయం వచ్చేటప్పటికి చప్పబడి వెళ్లిపొయ్యేరు. చిట్టచివర కొకవేశ్యకాంత-యౌవనదశలో అనేక మందిని తనవలలోవేసికొని వారిధనము హరించిన వేశ్యకాంత-పాపపంకిలమందుజిక్కిన వేశ్యకాంత-శ్రీశైలశిఖరంచూస్తే చేసినపాపాలు తుడిచివేయబడతాయన్న నమ్మకంతో ఆదారినేపోతోంది. ఇంతలో పార్వతిఏడుపు ఆమెచెవులకుసోకింది. పార్వతివద్దకు వెళ్లి ఆమె పెదవులగుండా అంతావిన్నది. "అమ్మా! కనుమేరదూరంలో కనబడుతోందే అదే శ్రీశైలశిఖరం. శిఖరంచూచినతరువాత నాపాపాలెక్కడున్నాయి"అంటూ వృద్ధబ్రాహ్మణవేషంలో ఉన్న పరమేశ్వరుని బయటికిలాగి వెడలిపోయింది వేశ్యకాంత. పరమేశ్వరు డన్నాడుగదా పార్వతితోటి "ఈకోటానకోట్లజనంలో ఈమెఒక్కతే మోక్షార్హురా"లని. కథ కంచికెళ్లింది— మనమింటికొచ్చాం.

## దీపముమాహాత్మ్యము

శ్రీమతి జరుగుమిల్లి రామాబాయమ్మగారు

ఒకయూర ఒకబ్రాహ్మణోత్తముడుండేవాడు. అతనిభార్య సుగుణవతి. సాధుశీల. అతనికి ముగ్గురు కొడుకులు. ఆబ్రాహ్మణుడు భార్యనుసుఖపెట్టవలెననితలచి కోడలువచ్చిన సుఖపడునని పెద్దకొడుకునకు వివాహముచేసెను. కోడలు కాపురమునకువచ్చెను. కాని లాభములేదు. ఆమె యొకపనికూడ ముట్టుటలేదు. ఇంక కొద్దిదినములకు రెండవకొడుకునకు వివాహంచేసి కోడలను తీసుకొనివచ్చిరి. పెద్దకోడలు కంచములో చెయ్యికడుక్కొంటే చిన్నకోడలికి పేడమీదకే అన్నముతీసుకొని వెళ్ళవలసివచ్చెను. ఈవివాహములకుఉన్న

సొమ్ము లేమియు వ్యయమగుటవలన మూడవకొమారునకు బీదయింటిపిల్లను వివాహముచేసిరి. అది కాపురమునకు వచ్చింది లగాయితు మామగార్కి, భావగార్లకు సపర్యలుచేయుచు అత్తగార్కి ఏపనియుచేయనీయక ఆమె నిద్రలేచేసరికే పాచిపని మొదలగుపనులన్నియు చేసి యెంతో వినయవిధేయలతోనుండేది. తోడి కోడండ్రిద్దరు దీనిని గేలిచేసేవారు. దానికర్మము అదిపనిచేస్తుంది మనకేమనిదర్జాగాయుండేవారు. అప్పు రాజుభార్య నీళ్లుపోసుకొనుటకు కోనేటికిపోయి అచ్చట తనమెడనున్న రత్నమాలతీసి గట్టుపైనుంచి స్నానముచేసి తిరిగి మాలను వేసుకొందమని చూడ మాలకనబడలేదు. ఏంతయో వెదికి ఖిన్నురాలై ఇంటికి పోయెను. ఆమాల ఒకగరుత్మంతుడు తన్నుకొనిపోవుచు త్రోవలో జారవిడచెను. ఆమాల బ్రాహ్మణుని మూడవకోడలు సమీపమునపడెను. ఆమెఆమాలనుతీసిచాలజాగ్రత్తగాదాచెను. ఇంటిలోఎవ్వరితోను చెప్పలేదు. రాజుభార్యనుచూచి ఏల విచారంబునమంటివని ప్రశ్నించెను. నేడు నేను స్నానముచేసేటప్పుడు మాల గట్టుపై నుంచితిని, తిరిగిచూచిన అదికనబడలేదు. మాలపోయినను అంతవిచారములేదు. ఆమాలలో మీరుకట్టిన మంగళ సూత్రముండుటవలన మిక్కిలివిచారముగానున్నదన రాజుకూడమిగులవిచారించి అయ్యో అది ఏల తీసితివని దీనముగాపలికి వెడలిపోయెను. ఈమాల ఎవ్వరికైనదొరకిన తీసుకొనివచ్చి ఇచ్చినచో తగినబహుమతి ఇచ్చె దనని ఊరంతయుచాటించెను. బ్రాహ్మణునికోడలు ఆచాటింపువిని భర్తతో ఇటులచెప్పెను. "నాథా! నేజెప్పెడిమాట శ్రద్ధతోవినుడు. ఇదిగో మాల నాకు దొరకినది. ఇది రాజుగారికిచ్చివేయుడు. వారు ఏమికావ లయునని మిమ్ములనడుగవచ్చును. ఏమియువలదు. ఊరంతయు ఒక్కరాత్రిదీపములు పెట్టవద్దని చాటింపుడు. మీకోటలోకూడ, దీపము పెట్టవలదనిచెప్పుడు. ఏమియుకోరక ఇటులనడుగమంటివని నన్నుమీరు ప్రశ్నించకు" డని మాలఇచ్చి భర్తనుపంపెను. ఆబ్రాహ్మణుడురాగానే భటులు రాజుసన్నిధికి తీసుకొనిపోయిరి. మాల దొరకినవిధము చెప్పి మాలయిచ్చెను. రాజు చాలసంతోషమున నీకేమికావలయునో కోరుకొమ్మని అడిగెను. భార్యచెప్పినటులనే చెప్పెను. ఇదేమి! డబ్బుఅడుగక ఇటులకోరితివని రాజద్భుతపడెను. చివరకువప్పుకొనెను. ఊరంతయు ఆరాత్రియేయింటను దీపముండరాదని చాటించెను. తనకోటలోకూడ దీపములేకుండచేసెను. ఈబ్రాహ్మణుడుపోయి భార్యతో ఈసంగతిచెప్పెను. అందరును రాజేమనునోయని భీతస్కులై అయిదు గంటలకే భోజనములు చేసి తలుపులుమూసిరి. ఆబ్రాహ్మణునికోడలు చక్కగ ఇల్లుఅలికి ముగ్గుపెట్టి, ఇంట దీపము పెట్టి, తానుతలంటుకొని, అమ్మవారివద్ద దీపములుపెట్టి, భావగార్లనుపిలచి, ఈరోజు నేనేమిచేసినను, ఏమియు అనకొనకుడు. నన్నుమన్నించుడు, మీలోనకరు వీధివాకిలివద్దను, రెండవవారు దొడ్డివాకిలివద్దను నుండుడు. ముందొకస్త్రీవచ్చును-ఆమెను ఇంట్లోకివెళ్ళమనుడు. తిరిగి రెండవస్త్రీవచ్చును, ఆమె లోనికి పోవచ్చునా? యన పొమ్ము తిరిగివచ్చిన చంపెదమని బెదరింపుడు. దొడ్డివాకిలివద్దనున్న ఆయనతో ఇటుల చెప్పెను. ఒకస్త్రీవచ్చును. ఇటులవెలుపలికి పోయెదనన సరేపొమ్ము తిరిగియింటికిరాకుమని తలుపుమూయు డనిచెప్పి, తానుపూజచేయుచుండెను. ఈమెబుద్ధివలన భావగార్లకు అత్తకు, మామకు ఈమెయనిన యెంతో దయ. అందుచే భావగార్లు సమ్మతించిరి. ఆమెమాటమాత్రోసిపుచ్చజాలరైరి. తోడికోడండ్రు, భర్తలను, తోడికోడలిని హేళనచేయుచు మేడపైకయునించిరి. ఈమెచెప్పినటులనే ఒకఆమెవచ్చిన భావగారుతెల్పిరి. రెండవఆమెయువచ్చెను. మొదటిఆమెలోనికిపోయి పాలుగుమ్మాలలు చూచి దొడ్డిత్రోవనుపోయెను. రెండవ ఆమె లోనికిరాగానే ఆయనతలుపుమూసెను. ఆముత్తైదువకు, ఆబ్రాహ్మణునికోడలులేచి నమస్కరించి, పాలు దాహమిచ్చెను. ఆమె సంతసిల్లెను. వెళ్ళిపోవుదమన్న పాలు దాహమిచ్చెనుగదా? పాలుత్రాగినవారి వారికుపకారము చేయకుండనుండకూడదు. అది మనధర్మశాస్త్రముయనున్నది. అజరుగుండిరే యుక్తిపరురా లగుటవలన ఆటుల ఆమెపాలుఇచ్చెను. ఇంకఎటులపోవుటకునువీలులేక అచ్చటనేయుండిపోయెను. ఈముత్తై దువే లక్ష్మీదేవి. మొదటవచ్చినది పెద్దమ్మ. అందుకే ఇకరావద్దని పంపివేసిరి. ఈఅలుకులు, ముగ్గులు

చూచి ఆమెపోయెను. పెద్దమ్మతావు లివికావుగదా? అలంకరించి, దీపములున్నచోట ఆమెయుండదు. లక్ష్మి అపూర ఏయింటచూచినను దీపములేక, పాడువారియున్న గృహముల చెంతపోలేక ఈయింట దీపముండుటవలన, చూచిపోదమనివచ్చెను. తిరిగిపోవుటకు వీలుచిక్కలేదు. తెల్లవారేసరికి ఇంటినిండాధనము-లక్ష్మి తాండవమాడుచుండెను. రాజుబహుమతిక్రింద వందయిస్తేయెంత? ఇవ్వకున్నయెంత? అందుచేతనే ఈనుగుణవతి తెలివిగలదగుటవలన ఇటులకోరమన్నది. దీపములేకున్న లక్ష్మియుండదు. మనపెద్దలు ఇప్పుడుకూడ అసలసందెవేళ లక్ష్మివచ్చేవేళ దీపముత్వరగాపెట్టమని తొందరచేయుదురు. దీపమేలక్ష్మి. పూర్వాచారపరాయణులు దీపముపెట్టి దీపమునకునమస్కరించి,నుదుట కుంకుమపెట్టుకొని ద్వారబంధమునకుకుంకుమ పెట్టుదురు. అసలు దీపముపెట్టగానే ఇల్లుకలకలలాడును. ఆకలకలయే లక్ష్మిచిహ్నము.

## జోహారులు

శ్రీమతులు కొత్త ఈశ్వరీకుమారి, కొమ్మానేని వేంకటరత్న కుమారిగార్లు

శత్రురాజులు మాదు దేశమ్మునందు
కాలుపెట్టిన మామేని కండలూడ
చించిచెండాడెదము వారిజివ్వయందు
తేరిపారచూచుదురె విద్వేషులెందు
దేశకళ్యాణరేఖ సాధించుటకును
ప్రాణమానముల తృణసమానములుగ
నర్పణంబిడువారమటంచటన్న
వీరనారీమణులకు జోహారులిడుదు.

ప్రాణప్రియుని యరాతులు పరిభవింప
ఓర్చజాలక వెంటనే యొరకటారి
పెరికి భర్తకు దోడయి పేరుగన్న
వీరనారీమణులకు జోహారులిడుదు.

దేశమందెల్ల శత్రులు దిరుగుచుండ
యదనున కెదురుచూచుచు మెదలకుండ
నుండి నివురుగప్పిన నిప్పువోలె యపుడు
శాత్రవులదాడి యధికతీక్ష్ణంబుకాఁగ
తోకత్రొక్కినత్రాచు చందానగినిసి
శత్రులను దెగటార్చి యశస్సుగన్న
వీరనారీమణులకు జోహారులిడుదు.

కడలనాల్గింట శత్రులు గ్రమ్మియుండ
యించుకంత చలింపక మించిరాజ్య
శ్రీని గాపాడి యధికప్రసిద్ధిగన్న
వీరనారీమణులకు జోహారులిడుదు.

శత్రుప్రభులు మోసాన రాజ్యంబుగెలువ
యడవుల దిరుగునప్పుడు కనుమెలకువ
యమర ప్రాణప్రియులకు ధైర్యంబుగొలిపి
కార్యదీక్షను గల్గించి శౌర్యమొప్ప
పగఱ నెదిరింపజాలెడి బలముగూర్చి
భర్తలకు మేలుచేకూర్చి కీర్తిగన్న
వీరనారీమణులకు జోహారులిడుదు.

ప్రాణనాథుం డెపుడు విషవ్రణముచేత
బాధపడుచుండగా జూచి పరితపించి
విషవ్రణమ్ము నాఘ్రాణించి ప్రియునిప్రాణ
ములను గాపాడిరాజ్యమ్ము నిలిపినట్టి
వీరనారీమణులకు జోహారులిడుదు.

బుద్ధిబలమున ప్రభులకు ముదముగొలిపి
మంత్రిపదమునుపొంది బ్రహ్మాండమెల్ల
తల్లక్రిందుజేసెడి సమర్థతఘటిల్ల
పుడమిఱేఁడు తనకు కీలుబొమ్మకాగ
పగలు పుట్టించిపెంచియు రగులుకొలిపి
తమలోతమకు యుద్ధంబు సిద్ధంబుగాగ
ఆడసింగంబుమాడ్కి రణాంగణంబు
జేరి శత్రులడీకొని శిరముల నడి
ద్రెళ్ళవేయుచు పేరుప్రతిష్ఠగన్న
వీరనారీమణులకు జోహారులిడుదు.

# మగపుట్టుక

పంతుల విశ్వనాథము గారు

పొరుగు జగన్నాధరావు భార్య శారదకు పుస్తెలతాడు చేయించెనట. ప్రక్కయింటి బంగారమ్మ బనారసుచీర కొనుక్కొనెనట. వాసుదేవరావుభార్యకు వాచీగొలుసు చేయించెనట. ధర్మారావుభార్యకు డైమండ్ సిల్కు జాకెట్టుకుట్టించెనట. చెవులు చిల్లులుపడుచున్నవి ఈలోకాభిరామాయణము వినుసరికి. ప్రొద్దుపోయినది మొదలు తెల్లవారుపఱకు నిదేకథ—ప్రాణము విసిగిపోవుచున్నది. తనకునుకోనమని నాభార్యసీత ప్రాణము తినివేయుచున్నది.

సత్రములో భోజనముచేసి, పావర్టీసర్టిఫికేట్లు ప్రొడ్యూస్ చేసి, సహాయవేతనము సంపాదించుకొని "విద్యాతురాణాం నసుఖం ననిద్ర"యని కష్టములకోర్చి బి. ఏ. ప్యాసయి నౌకరీలో ప్రవేశించి నాలుగువత్సరములైనది. ఇల్లు, వాకిలి సంపాదించితిని. పిల్లపెళ్లి చేసితిని—సాటివారందరు "ఆరువేలప్పుతో తేలడము అదృష్టమే"యనునట్లు.

ఉదయముననేలేచి హెడ్ క్లర్కింటికి పోయితిని. ఏడిచిన ట్లేయున్నది తెల్లవారుసరికి హాజరయ్యెదవు జీతము లెప్పుడిచ్చెదరని—శ్రీనివాసరావు—నిన్నరికార్డు తగులపెట్టితివి యని హెడ్ క్లర్కనెను.

దివానుగారిదర్శనమునకుపోయిన అచ్చటి జవాను సమయము కాదనెను. ఇంటికిపోయిన యడల ఏదీచీర, వాచీగొలుసుకొన్నారూ అని యడుగును సీత.

లేదన్నయడల పోనీండి కాఫీకివేళయిందా యని సీతయనును. కాఫీతాగి ఆఫీసునకు పోవునప్పటికి యుఆర్ లేట్ (You are late) నాన్సెన్స్ (Nonsense) అని మేనేజరనును.

ఏమిమగపుట్టుక?—ఆడదే యదృష్టవంతురాలు—భర్తయెటులనో అప్పోసొప్పో తెచ్చి కోరినసగ అడిగినబట్టయిచ్చి, అప్పులనెటుల తీర్చుటయని యాలోచించుచు తలవంచుకొని భార్యముంగురుల సరిజేయుచుండ—పెండ్లికూతురువలె ముసిముసినగవుల నవ్వుచు, అందముగానున్నానాయని ఆమెయడుగ, నపరరతివలె నున్నావని యాతడన కులుకుచుండును అనెను శ్రీనివాసరావు.

పిన్ననాటను తండ్రియు, పెద్దయైన
భర్త, ముదిమిని తనయుండు, కరలొచు
రక్షణముచేయుచుందురు; రమణిజీవి
తమ్మదెంతటిసౌఖ్యప్రదమ్ముభువిని!
స్వార్థపరులంచుపురుషులన్ వనితకెపుడు
లేదుస్వాతంత్ర్యమనుచును వాదులేల?
మాత శాసించు పురుషు కౌమారదశను
భార్యశాసించు యవ్వనాభ్యంతరమున

పురుషస్వాతంత్ర్యమెంత యపూర్వమొక్కొ?
భారవాహుడు పురుషుడు, భారవాహ
నమ్ము,సంసారశకటము, నాతి రాజ్ఞి,
అధివశించెడివారలు ఆత్మసుతులు
బాంధవులు; కళ్లెములు భవబంధనములు
సారధి తలంప మోహాము జగతియందు
స్వార్థపరులా? పురుషులు, పరార్థపరులా?

# చదువరుల సమాధానములు

## ౧

శ్రీమతి సామినేని హనుమాయమ్మ గారి దసరాసంచికలోని 'పిట్టకథ' యందు 'వస్తాదులు' తమ పౌరుషనామము చేతనే బలశాలులు. కాని యట్టిబలశాలులకు స్త్రీ ప్రదర్శనమును తన చేతిపై జరిపించుకొనిన అవ్వ మఱియు బలశాలినియగుట సుస్పష్టము. అంతకంటె ననేకభద్రగజములను తన పైగుడ్డయందే బంధించిన యవ్వకుమారుఁడింకను బలవంతుఁడు. ఊహాపోహలయందును, పరిమాణమునందును మానవునికంటె మిక్కిలి పిన్నయని యెన్నదగిన గృధ్రము పైఏనుగులమూటను సునాయాసముగా తన్నుకొనిపోవుటచే నది పైయందఱి కంటె బలముకలదనుట నిర్వివాదాంశము. కొంతశక్తి వినియోగింపబడి అంతరిక్షమున కెగురదీయబడిన ఏనుగులమూట నలుసువలె కేవలము లెక్కచేయబడనిదిగా రాజకన్యకతోచుటచే ఆమె మఱింతబలవంతురాలు. కాని పైయందఱికంటె ఒక్క నిశ్వాసనిబిడమారుతముతో ఏనుగులమూటను వికావికలుగనూరంతయు విరజిమ్మిన 'రాజకుమారిదాసి' నిక్కముగ నెక్కుడుబలవంతురాలని చెప్పకతప్పదు.

దసరాసంచికలోని 'రహస్యము' అనుకథలో 'గోపాలబాబు' భార్య మొదట నొకకలగన్నది. ఆస్వప్నమందామె కొకసౌందర్యమూర్తిదర్శనమిచ్చింది. పిమ్మట దేవీపూజ కామె చెలికత్తెయగు 'సుమ'తో వెళ్ళింది. పూజానంతర మొకవృక్షచ్ఛాయ నొకయాగంతుకి ఉమతో మాటలాడింది. అచ్చటనే గోపాలబాబు భార్య తన స్వప్నసుందరియు, సినాతినాగంతుకియు నొకటేయని తెలిసికొన్నది. ఈసతీలలామకు భర్తవలనికష్టములన్నియు ఆగంతుకి శ్రద్ధతో ఉమవలనవిన్నది. హిందూసుందరి సుగుణసంపదకు, పతిభక్తికి ఆగంతుకి బ్రమాన్పడింది. తాను గోపాలబాబుతో సహవాసముచేసి నగలనుహరించినందులకు సిగ్గుపడింది. వెంటనే పశ్చాత్తాపతప్తాశ్రుబిందువు లాగంతుకి నేత్రాల్లోచిందులాడినై. మఱుమాటలేక సురిగిపోయింది. మఱునాడు పతివ్రతాశిరోమణియింటికి తన దాసీచేతికి నగలిచ్చిపంపించింది ఆగంతుకి. గోపాలబాబే పంపినాడనుకొని ఆతనితల్లి వానిని స్వీకరించింది. నాటిరాత్రి ప్రస్తావనలో నగలసంగతి గోపాలుఁడు తెలిసికొన్నాడు. స్తంభితుఁడైనాడు. చేజిక్కినధనమిట్లు చూరవిడుచుటకు తనప్రణయిని దేవీమూర్తియనుకున్నాడు. నిజముకనుగొన్నాడు. పశ్చాత్తప్తుఁడైనాడు. భార్యనుక్షమించమన్నాడు. మఱల అన్యోన్యానురాగలత యూదంపతులనడుమ మొగ్గతొడిగింది. ఈపరివర్తనకుకారణ మాగోపాలునిప్రణయినియగు ఆగంతుకియే. ఇదియే యిందలి రహస్యము. —గాలం రంగనాయకమ్మ.

## ౨

అవ్వ, వస్తాదులలో అవ్వబలవంతురాలు. ఎట్లనగా వస్తాదు చాలబలముగానుండును. ఆటువంటి వస్తాదులనిద్దరును మీదఎక్కించుకొనుట కష్టముగుపనికాని తేలికగాదు. కనుక అవ్వబలముగలది. కథయంతయు రెండుభాగములుగానున్నది. అవ్వకథ తరువాత మరిచెప్పలేదు. అవ్వకొడుకు తనఏనుగులన్నిటిని మూటగట్టెను. తనదగ్గరనుండగానే గ్రద్దతన్నుకపోయెను. అనగా గ్రద్ద ఏనుగులకాపరితో పోట్లాడి అతనిని ఓడించి అతనిదగ్గరనున్న మూటనెత్తుకొనిపోయినట్లు భావము. కనుక గ్రద్ద ఏనుగులకాపరికన్న బలముగలది. గ్రద్ద బరువుచేకాబోలు చాలదూరమువరకు మోసుకొనిపోయి చిట్టచివరకు జారవేసెను. అది రాజుగారికూతురికంటిలో పడిపోయెను. గ్రద్దకాళ్ళలో చిక్కినమూట కంటిలోనలుసుమాదిరిగనున్న ఆమె ఆమూటకన్న ఎన్నియోరెట్లు ఎక్కువబరువుగనుండవలెను. కనుక, దీనినిబట్టి గ్రద్దకన్న ఆమెయే మిగులబలవంతురాలు. ఆ కంటిలోపడ్డనలుసును తనుతీసికొనుటకు ప్రయత్నించగారానందువల్ల కాబోలు ప్రక్కనున్న దాసికిచూపెను. ఆదాసి, మామూలుమాదిరిగానే 'హూ' అని ఊదగానే, ఆమూటవిచ్చి యేనుగలన్నియు ఊరినిండఁబడెను. మనిషిఎంతో బలముగనుంటేనే గాని, మనిషిదేహములోనుంచివచ్చు ఊపిరిగూడా బాగా

గట్టిగా రాదు. కనుక, దాసి ఎంతయోబలముగ నుండేనే గాని, అంత పెద్ద ఏనుగులమూటను ఊదినంతమాత్రమున, మూటవిడగొట్టి ఏనుగులను పడవేయగల్గెను. కనుక వీరలందరికన్న దాసి బలవంతురాలు. కాని మొదటి భాగములో అవ్వ బలవంతురాలు. రెండవభాగములో దాసి బలవంతురాలు. ఎంత పెద్దపస్తాదైనను బరువులో ఏనుగులతో సరికాదు. ఇద్దరుపస్తాదులను మోచినది 'అవ్వ'. ఊరిఏనుగులన్నియును పైకి ఎగురుగొట్టినది దాసి. కనుక వీరలిద్దరిలో దాసియే బలవంతురాలు.

—చల్లపల్లి చలపతిరావు.

3

రహస్యము: అమ్మా! సాధ్వీ! నీవు స్వప్నమందుగాంచినది దేవీమూర్తియే. నీవు కాళిగర్భగుడితలుపువద్ద పడివున్నపుడు ఉమనిన్ను లేవదీసి వృక్షచ్ఛాయవద్దకు తీసుకొనిపోయినపుడు ఉమవల్ల నీభర్తసంగతంతయిని నీకు కనుపించినదియు ఆమెయే. నీభర్త నీఆభరణములన్నియు ఒక్కొకటిగాచేర్చి ఏ చెడునడతగల స్త్రీకి ఇచ్చివున్నాడో ఆస్త్రీయొక్క స్వప్నమందుగూడా నీఇష్టదేవతవెళ్లి నీభర్తను నీకర్పించి నీమార్గము సన్మార్గము చేసుకొనమనియు, నీసొమ్ము నీకు పంపజెప్పమనియు ఆనతిచ్చియుండవలెను. ఆస్త్రీయే ఒక వృద్ధురాలిచేతికి నీనగలన్నియు ఇచ్చిపంపివేసెను. ఇదిఅంతయు దేవికటాక్షము. ఇదిగాక లోకములో కొందరుస్త్రీలు తమభర్తలకు కలిగినదానిలో ఎంతబాగాచూచినను విలువగలచీరలేనిదే సింగారము లేదనియు, సొమ్ములులేకున్న సొగసుకాదనియు, పేరంటమునకుపోమనియు, పెండ్లిండ్లకుపోమనియు అనవసరమైనహఠా విడిచేయుచుందురు. అమ్మా! నీవట్లుగాక వంటిసొమ్ముంతయువదలిచి పతికప్పగించి పతిదర్శనమే పరమభాగ్యం బనితలచిన పతివ్రతవు. నీసదయహృదయమునకు సంతసించితిమి. నీవంటి సతులెందరో నీవలెనే—పతులవల్ల పలుబాములుపడుచున్నారు. వారికిగూడా నీవంటిసతీత్వముగలుగుటకున్ను, వారిపతులను సన్మార్గవంతులుగా జేయుటకున్ను దేవినిప్రార్థింతుముగాక.

శ్రీమతి సామినేని హనుమాయమ్మగారువ్రాసిన పిట్టకథలో సద్భక్తితోగూడినమనస్సు అనేఅవ్వ-ఆనందమనే అన్నముమూట నెత్తినిడుకొని యేగుచుండగా జ్ఞానవైరాగ్యములనిరెండుపస్తాదులను మోచినది. వారు అవ్వనుచూచి మాలో ఎవరుగెలుస్తారని అడిగిన ఇద్దరు నాచేతులయందు సాముచేయుడని చెప్పి చేతులందువుంచుకొని వెళ్లెను. ఇంతలో ఆత్మఅనేకొమారుడు తల్లినిచూచి కామక్రోధాదులనే ఏనుగులను మూటకట్టెను. ఆమూటను అహంకారమనేగద్ద తన్నుకుపోయి పైకిఎగురగా ఆమూట బుద్ధిఅనేరాజకొమార్తె కంట్లోపడెను. బుద్ధి ఇదేమిటోచూడమని వివేకమునుఅడుగగా జారచోరాదికధిదేవతలగు స్త్రీపురుషాదుల యొద్ద యుండునట్లు ఆమూటను రాచకొమార్తెకంట్లోనుంచి వూదివేసెను. ఏచిన్నపనులకయినను మంచిచెడ్డల రెంటికీ-మనస్సువుంచి పనిచేయకున్న పనిపాడగును. కావున వీరందరిలో ఘనురాలు అవ్వఅని నాకుతోచినది.

—దామోదపురపు రామాయమ్మ.

## సాధ్వీ అనసూయ

శ్రీమతి చదలవాడ రాఘవమ్మగారు

మునిశాపమున దేహమునుబాయగానున్న
నర్మదాపతికి ప్రాణంబులిచ్చి,
బ్రహ్మాదులను జిన్నిబాలురఁగాఁజేసి
యనుఁగుపాత్తిళ్ల చన్నవియనిచ్చి,
కాలసర్పము భవత్కంఠమందునవ్రేల
నద్దాని సుమదామమట్లొనర్చి,
లక్ష్మియాసతిని విరాళిఁజేసెడి పంచ
బాణుగర్వము పటాపంచఁజేసి,
నారదుండిచ్చియున్న శంకరనువండి,
అతులభక్ష్యభోజ్యంబులొనట్లొనర్చి,
పరమపతిభక్తి ఫలము కన్పఱచినావు,
సాధ్వి! అనసూయ! వందితజననికాయ!

## నాగులచవితి

కల్యాణసింగ్‌గారు

కన్నుచీఁకటి యున్నప్డె నన్ను లేపి
యక్క తలయంటి దొడ్డిలో మొక్కలందుఁ
బూవులనుగోయ మీవేళఁ బుట్టలోనఁ
బాలుపోయఁగవలయును బూలతోడ
పాపరాజును బూజింపవలయుననియె.
అల్లెపువ్వులఁ దెచ్చి అక్కయ్యకిచ్చి
పట్టులాగుఁ దొడిగి చిన్నిపట్టుకండు
వాపయినివేసికొని పోవఁ బయనమైతిఁ
జిటికలోన; నమ్మయుఁ బట్టుచీరఁగట్టి
వెండిపళ్లెములోఁ జలివిడియు బుఱ్ఱ
గుంజు తేగలు చిమ్మిలి కొబ్బరయును
అరటిపండ్లును వడపప్పు ఆవుపాలు
మంచిసీతాఫలంబులు మఱియుజామి
పండ్లు బెల్లముపెట్టించి బయలుదేరెఁ
బుట్టలోనున్న నాగన్న పొట్టలోనఁ
బాలుపోయఁగ నేనును పూలసజ్జ
జేతఁబట్టి యమ్మవెనుకసిద్ధమైతి.
తోఁటలోనికిఁబోయి యచ్చోటనున్న
పుట్టయొద్దనలికి చక్రముగ్గువెట్టి
పసుపుకుంకుమ పత్తిరి పండ్లు పూలు
చక్కసమరిచి పుట్టముస్తాబుచేసి
ప్రమిదలోవత్తికాల్చి దీపమ్ముపెట్టి
ముమ్మరముగ సాంబ్రాణిధూపమ్మునైచి
హారతియొసంగి యమ్మజోహారుచేయ
నేనుమ్రొక్కితినంత నాగేంద్రునకును.
మాకుచుండెను పొట్ట యమ్మ యపుడొసఁగఁ
దీయనిప్రసాదమును బండ్లుదింటినేను.
అమ్మపెట్టినచలిమిడి చిమ్మిలియును
బుట్టలోనున్న నాగన్న పొట్టలోనఁ
బడెనొ లేదో యెఱుంగ నాకడుపుమాత్ర
మల్ల నాగన్న పుణ్యానఁ జల్లనయ్యె
అమ్మతో మెల్లగా నింటికరిగినాను.

## ఊరట

బండారు అంజనేయులుగారు

మధురవర్చస్వినీ! యెడ మమత లేల?
విగతభాసియునై ప్రాప్తబింబమొప్పఁ
బ్రకృతిలీలల వెలిఁజేయు భానుమూర్తి
అస్తగిరిమస్తకమున విన్యస్తుఁడయ్యె.
లలన! ప్రియమారఁగా నిజగళమునందుఁ
దాల్చు కోమలమందారదామమట్టె
కాలపాశంబుగానగుట కల్గునెడల
విశ్వమందున నెద్దాని విశ్వసింతొ?
జీవహింసయె తననిత్యజీవనమున
సాధనంబుగఁగొన్న (కసాయియైన)
స్వీయజనములపట్ల సుస్నిగ్ధహృదయ
జనితసుమనోనురాగత శాంతిఁజెందు
బాలపికమునకు రసాలపల్లవంబు
సాగరునకు సుధాకరుచంద్రికలును
సమదపుష్పంధయమునకు సారసంబు
నైజపరిపాటి వానిఁ బొసఁగువగలవె?
పంకమున పుండరీక ముద్భవమునొందె
మకరవక్త్రాంతరమున మానికమువెల్గె
ప్రథితపాథోధి బడబానలంబుపుట్టె
క్షీరఫలగర్భకుహరాన క్రిములుగల్గె
ముచ్చటలమూటఁగట్టిన ముద్దరాల?
పూతకదళికి నామూలపాతనమ్ము
వృశ్చికమునకు గర్భనిర్భేదనమ్ము
ఏపురాకృతకర్మమో యెఱుఁగరాదు.

# గ్రంథపరిచయము

**శ్రీ సిద్ధేశ్వరీయము :—**

కే. శే. ఆలూరు వాసుదేవయ్యగారిచే రచితము. తంజనగరము తేరప్పెరుమాళ్లయ్యగారిచే బరిశోధితము. మెకంజిదొరవారు సంగ్రహించిన స్థానికచరిత్రములలోని సిద్ధవటముకైఫీయత్తుకును ఈసిద్ధేశ్వరీయమను పద్యకావ్యమునందలి పౌరాణికకథకును సాదృశ్యములు జతపడుచున్నవి. స్థలమాహాత్మ్యము, చక్కని కథలు, ధారాశుద్ధమైన కవిత్వము, న్యాయములు, సామెతలు విరళముగనుండి ఇందలి శైలి ఆకర్షణీయముగ నున్నది. వలయువారు ఆలూరు రామచంద్రయ్యగారు, 8 మూర్తిలేను, పార్కుటవున్, మదరాసు అని వ్రాయునది. డెమ్మీసైజున 130 పుటలు. వెల 0-10-0 అణాలు.

**వదరుబోతు :—**

ఆంగ్లవాఙ్మయమునందలి స్టీలు'టాట్లరు' మాదిరి ననుసరించి తెనుగున రచియింపబడిన వ్యాసముల సంపుటి. అధికారవృద్ధులు, వయోవృద్ధులు, విద్యావృద్ధులు నాచరించుచుండిన కొన్ని పద్ధతులను, ఆచారములను తప్పులని తోచినప్పుడు విమర్శించి ఖండించుటకై జనియించిన వీవ్యాసములు. లలితహాస్యము, మృదువైన నింద ఈవ్యాసముల ముఖ్యలక్షణము. విలాసముగా చదువుకొనుటకు దగియుండును. గ్రంథముద్రణము సుందరము. క్రౌనుసైజున 142 పుటలు. వెల 0-10-0. చిరునామా: సాధనప్రకటనాలయము, అనంతపురము.

**కథావళి :—**

చిన్నకథలు. గుంటూరు సాహిత్యమండలిసభ్యులు వ్రాసినవి. కొమరవోలు నాగభూషణరావుగారి 'నేను నాసైకిలు' హాస్యమిళితము. తుమ్మలపల్లి వేంకటసీతారామారావుగారి 'నిష్కృతి' హృద్యము. నుసర్ల రామమూర్తిగారి 'గిరీశంగారి చాకచక్యము' చదువదగియున్నది. చెలుకుపల్లి శివరామయ్యగారి 'మొలత్రాడు' సాంసారికకథ. ప్రతిక్రియ, పరివర్తనము, క్లైమేక్స్, కాత్యాయని మున్నగు ఇతరకథలును పఠనార్హములై యున్నవి. కథావాఙ్మయమగుట ఇది విశేషప్రచారమునకు రాగలదనినమ్ముచున్నాము. సాహిత్యమండలివారి సారస్వతసేవ పెరుగులువారుగాకయని కోరెదము. గ్రంథము క్రౌనుసైజున 188పుటలు. వెల రు 1-0-0.

**పల్లెటూరిపడుచులు :—**

గ్రంథకర్త. కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారు. ఈగ్రంథమునకు గరిమెళ్ల సత్యనారాయణ (బి. ఏ) గారు మున్నుడివ్రాసియున్నారు. ఇది కష్టజీవి, పెరిందేవికిపెళ్లి, పంచముదేవుడుఅను మూడుకథల సంపుటి. పట్టణవాసపు డాంబికజీవనమునకు మెఱసి పల్లెటూరివారు చెడుచుండుట మొదలగు నేటిసమస్యలే ఈకథలకు జీవమునిచ్చుచున్నవి. గ్రామపునర్నిర్మాణము కొనసాగుచున్న ఈ నేటిదినములలో ఇట్టిగ్రంథములరచనము ప్రోత్సహింపదగినది. క్రౌనుసైజు 100పుటలు. వెల 0-4-0. పబ్లిషర్: ప్రగళ్లపాటి ధనరాజు, బుక్సెల్లర్, రాజమండ్రి.

**ఆంధ్రవిజ్ఞానసర్వస్వము :—**

ఇరువదిసంవత్సరములకు పూర్వము శ్రీకొమర్రాజు లక్ష్మణరావుగారిచే ప్రారంభింపబడి ప్రస్తుతము దేశోద్ధారకునిచే పునరుద్ధరింపబడి నడుపబడుచున్న ఆంధ్రవిజ్ఞానసర్వస్వము ప్రథమసంపుటము అచ్చుతీరి సిద్ధమైయున్నదని తెలిసికొనుటకు ఆనందించుచున్నాము. ఈప్రథమసంపుటమున 'అ'నుండి 'అద్వైతము'వఱకు నుగలదు. డెమ్మీనాల్గవభాగపు ఆకృతిని 600పుటలు, త్రివర్ణపటములు 8, ఇతరపటములు 125, వివిధవిషయములు 400 కలవు. సంపుటము చక్కనిస్వదేశచర్మముతోను బంగారురేఖలతోను సంపుటీకృతము. ఇట్టి సంపుటములు రమారమి 25 అయిన విజ్ఞానసర్వస్వము పూర్తియగునని సంపాదకులు తెలుపుచున్నారు. పూర్తి

దైన విజ్ఞానసర్వస్వముగలభాష నాగరికభాషలలో పరిగణనీయమగును. ఆంధ్రభాష నాగరికభాషగా పరిగ ణింపబడవాంఛింపని ఆంధ్రుడెవడుండును? కావున ఈప్రయత్నము సర్వాంధ్రజనసమాదరణీయమైనది. ఆంధ్రదేశమునందలి ప్రతివిద్యాసంస్థయు, ప్రతివిద్యావంతుడును యథాశక్తి ఈయుద్యమమునకు తోడ్పడవ లసియున్నది. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ఆంధ్రులకు ప్రసాదించినవానిలో ఈవిజ్ఞాన సర్వస్వము ప్రశస్తతమము కాగలదు. ఈప్రథమసంపుటము వెల రు 10-0-0. చిరునామా: 7, తంబుచెట్టివీథి, జార్జిటవున్, మదరాసు.

# పత్రికాపరిచయము

**పశుసంరక్షణ:—**

ఆయుర్వేదపశుచికిత్సాలయముతరఫున మూడుమాసముల కొకసారి ప్రకటింపబడు సచిత్రపత్రిక. సం పాదకుడు డాక్టర్ యేకెళ్ల శ్రీరాములుచౌదరిగారు. పశువిషయకగ్రంథరచయితలుగా శ్రీచౌదరిగారు తెలు గువారికి సుపరిచితులై యున్నారు. వీరు పశువిషయములందే తమ పరిశ్రమను, బుద్ధిని కేంద్రీకరించియుండుట ఎంతయుసంతసింపదగినది. భారతదేశభాగ్యము రైతుమీదను, అరైతుభాగ్యము అతని పశుసంపదమీదను ఆధారపడియున్నది. అట్టి పశుసంపదనుగూర్చిన సమస్తవిషయములను రైతులకుబోధించిచెప్పుటకు భారతదే శపు ఆయాభాగపు భాషలయందు పత్రికలు, పుస్తకములు వెలువరించుట అవసరము. తెలుగువారికి శ్రీచౌద రిగారివలన ఆపని జరుగుచున్నది. 1932 సెప్టెంబరు 15-వ తేదీని వెలువడిన పశుసంరక్షణ తొలిసంచికకు మామనఃపూర్వకమగు స్వాగతము నిచ్చుచున్నాము. గోమాతనుగూర్చి శ్రీమతి అట్లూరి వేంకటసీతమ్మగారు పద్యవ్యాసము వ్రాసియున్నారు. శ్రీరాంగోపాల్ లక్ష్మీనారాయణగారి గోప్రార్థనయను గద్యవ్యాసము జాలినిలేపుచున్నది. సూర్యదేవర రాఘవయ్యచౌదరిగారి 'గోరక్షణసంఘవిధులు,' చల్లగుళ్ల వేంకటరామయ్య చౌదరిగారి 'పశువైద్యవస్తుగుణములు' చదువదగినవి. పశురోగములకు చిట్కా-చికిత్సలు, పశువైద్యసూత్రములు, పశుజాతులుఅను వ్యాసములు రైతులకు చాలఉపయోగకరములైనవి. సాంప్రదాయముగల ఒంగోలుజాతిగోవు చిత్రముముఖపత్రముపై ముద్రించుట సముచితము. పత్రికయందలి ఇతరచిత్రములు విషయావబోధమునకును, పత్రిక సౌందర్యమునకును తోడ్పడుచున్నవి. పత్రిక క్రౌనుక్వార్టొసైజున గ్లేజుకాగితములమీద ముద్రితము. 32 పుటలు. సాలు చందా రు 2-0-0. చిరునామా: అంగలూరు, కృష్ణాజిల్లా.

**ఆంధ్రవిశ్వకళాపరిషత్తు కళాశాలాంధ్రసంఘసంచిక:—**

ప్రథమసంచిక 1932 అక్టోబరుమాసమున వెలువడినది. సంపాదకుడు పింగళి లక్ష్మీకాంతముగారు ఎం. ఏ. క్రౌనుక్వార్టొసైజున గ్లేజుకాగితములపై ముద్రితము. సంఘసభ్యుల ఛాయాచిత్రము తొలుత చేర్చబడి నది. విద్యార్థులరచనాసాధనభూమిగనుండుటకై ఇది ప్రచురింపబడుచున్నది. ఆంధ్రనాయకశతకము, తిక్కనప్రతిభ, శ్రీతులసీదాసురామాయణము, తిరుపతివేంకటేశ్వరులు, పరమతసహనము, శాకుంతలము: ప్రకృతియోగము, భారతావతరణముఅను వ్యాసములుగలవు. చిరునామా: విశాఖపట్టణము. సంఘకార్యదర్శి: జి. యస్. నరసింహాచార్య.

**హై ఇండియన్:—**

మద్రాసు హై ఇండియన్ లీగువారి ఆంగ్లమాసపత్రిక. స్వదేశీవస్తుప్రోత్సాహము దానిప్రధానోద్దేశము. బ్యాంకింగు, ఇన్సూరెన్సు, షిప్పింగుమొదలగు విషయములనుకూడ చర్చించును. ప్రథమసంచిక అక్టోబరుమాస మున వెలువడినది. క్రౌనుక్వార్టొసైజున సుమారు 40 పుటలు. గ్లేజుకాగితములు. సాలుచందా రు 2-8-0. విడిసంచిక రు 0-4-0. ఖద్దరు: నిరుద్యోగము; ఆర్థిక స్వాతంత్ర్యము; బ్యాంకింగు మొదలగు వ్యాసములుగలవు. చిరునామా: ది హై ఇండియన్ లీగ్, హిందూస్థాన్ బిల్డింగ్సు, ఆర్మీనియనువీథి, మదరాసు.



**గ్రా మ పం చా య తు లు: స్త్రీ లు:—**

"గ్రామపంచాయతుల పునర్నిర్మాణమునకై బొంబాయిగవర్నమెంటువారు శాసనసభలో నొక బిల్లును గొనివచ్చిరి. ఆబిల్లులో గ్రామపంచాయతులయందు స్త్రీలెవ్వరును సభ్యులుగా ఎన్నుకొనబడరాదని ఒకనియమము ఉంచబడినది. రాష్ట్రీయశాసనసభలయందును, దేశీయశాసనసభలయందును స్త్రీలు సభ్యులుగావచ్చును. ఆయాశాసనసభలయందు వారు సభ్యులై రాష్ట్రీయ, దేశీయసమస్యలను పరిష్కరించుటకు స్త్రీలు సమర్థులై యుండగా గ్రామపంచాయతులనుండి వారిని వెలివేయుట సమంజసముగ గన్పట్టదు. గ్రామపంచాయతులు స్త్రీలప్రవేశముచే మరింత ప్రజోపయోగకరములగునని మానమ్మకము. బిల్లు శాసనమగుటకు పూర్వమే బొంబాయి శాసనసభవారు అందుండి ఈఅవమానకరమగు నియమము తొలగింపబడుటకు ప్రయత్నింతురు గాక! ఈపంక్తులు ముద్రణస్థితిలోనుండగా బొంబాయి శాసనసభలో ఈబిల్లునుగూర్చి సామాన్యచర్చజరిగెను. కాని ఇంతవఱకు ఏసభ్యుడును ఈవిషయమునుగూర్చి తలపోయకుండుట ఆసభకు గౌరవము తెచ్చునది కాదు."

—*The Indian Social Reformer.*

**అ ల్యూ మి న ము, ప్లా టి న ము లో హ ము ల వి చి త్ర చ రి త్ర:—**

"1854 ప్రాంతమున అల్యూమినము బంగారముతో సమమైన ఖరీదుగలిగియుండెను. ఫ్రెంచిచక్రవర్తి మూడవనెపోలియను రాజబంధువులకు అల్యూమినముకంచములలో విందుచేసెను. అదియెంతయో గొప్పగా చెప్పుకొనబడెను. క్లేరీడేవిక్ అను అప్పటిసుప్రసిద్ధ ఫ్రెంచిఆభరణనిర్మాత తేలికయగు అల్యూమినములోహముతో ఉత్తమజాతి ఆభరణములు, ఇతరఅలంకారవస్తువులు చేసెడివాడు. కాని ముప్పదిసంవత్సరములకు తరువాత 1884 ప్రాంతమున అల్యూమినము చవుకయై రాజగృహములందలి విలాసవస్తువగుట బదులు సామాన్యగృహములందు సామాన్యవంటపాత్రయయ్యెను. ఇప్పుడు బంగారముకంటె విలువయైనలోహముగా చూడబడుచున్న ప్లాటినము రష్యాదేశములో పదునెనిమిదవ శతాబ్దియందు స్టవులకు పైపులు (Stove Pipes) చేయుటకు వాడబడుచుండునది. ఈఅల్యూమినము, ప్లాటినము లోహములచరిత్ర ఇట్లు విచిత్రమైనది."

—*Scientific American.*

**'అ మృ త బ జా రు':—**

"'అమృతబజారు' అనునది జెస్సూరుజిల్లాలో నొకగ్రామము. ఆగ్రామమునుండి అర్ధశతాబ్దికి పూర్వము ఘోషకుటుంబమునకు చెందిన నలుగురు సోదరులు కలకత్తాకువచ్చిరి. కలకత్తాలో నొకవార్తాపత్రికను నెల

కొల్పుట వారియుద్దేశము. వారిగ్రామనామమే పత్రికకును ఉంచబడినది. అదియే అమృతబజారుపత్రిక. అది నేటికిని ఘోషుకుటుంబమువారి చేతులయందే గలదు. దానిని స్థాపించిన అసలుగురు ఘోషుసోదరులలో ఇంతవఱకు జీవించియున్న ఒక్కడు గోలప్‌లాల్ ఘోషు నిన్నను పరమపదించినాడు. తనసుప్రసిద్ధసోదరుడు మోతీలాల్ ఘోషు చనిపోయినతరువాత ఈతడు అమృతబజారుపత్రికకు సంపాదకుడైనాడు. వార్ధక్యము ముంచుకొనిరాగా తనసంపాదకత్వమును సోదరపుత్రునకు ఇచ్చినాడు. ప్రస్తుతసంపాదకు డితడే. వంగరాష్ట్రపు గతఅర్ధశతాబ్దపుచరిత్రలోను అమృతబజారుపత్రికకు ఒకగొప్పస్థానముగలదు. ఏకకుటుంబమువారి దినపత్రిక యనుటకు ఇదియే తగియున్నది. తమరాష్ట్రమునకట్టి ఉత్తమజాతిదినపత్రికను ప్రసాదించిన ఘోషుకుటుంబమువారిని బంగాళీలు మిక్కిలిగా ప్రేమింతురు. నేడు క్లీటుస్ట్రీటులో శుక్రతారయై వెలుగొందు తమ గ్రామపుబాలకునిగూర్చి స్కాట్లండుదేశపు ఒకగ్రామము ఎంతగగర్వించునో అమృతబజారుగ్రామమును ఘోషుకుటుంబపుఈసోదరులనుగూర్చియు నంతగ నేగర్వింపగలదు."

—*The Statesman.*

## అస్పృశ్యత : మన పూర్వులు :—

"ఘోరమైనట్టిదియు తరతరములనుండి ఆచారరీత్యా వచ్చుచుండినట్టిదియు అస్పృశ్యతను మహాత్మాగాంధిగారు స్వల్పకాలనిగళనవ్రతముచే నిర్మూలించుట భారతచరిత్రయందు సువర్ణాక్షరములచే లిఖింపబడగలదు. ఈఅస్పృశ్యతను రూపుమాపుటకును వారికి దైవదర్శనమిప్పించుటకును మిక్కిలిపాటుపడినవాడు శ్రీరామానుజులు. ఈమహాపురుషుడు దేవాలయగోపురముపై నందఱగపడునట్లు నిలుచుండి నిమ్నజాతుల నెలుగెత్తిపిలచి, గురుడు తనకత్యంతరహస్యముగ బోధించిన మంత్రమును, అది ఇతరులకు దెల్పినచో నరకమును బొందెదవని గురుడు తెల్పినను, తానొక్కడు నరకమునుబొందినను సరేయనియు, నిమ్నజాతులవారెల్లరు మోక్షమునకేగిన, తానేమైనను, నరకమునకు పోవలసివచ్చినను భయపడననియుపలికి యా తారకమంత్రరాజమునుఎలుగెత్తి నిమ్నజాతులకుబోధించి వారిని తనమతమునకల్పుకొనినాడు. కేరళదేశమునందు కాలటియను నగ్రహారమొండుగలదు. అందు శంకరాచార్యులవారను గొప్పమతకర్త యుద్భవించెను. ఆయన హిందూదేశమునంతటను గలియదిరిగి తన అద్వైతమతమును బోధించెను. అద్వైతమతస్థాపనకై శ్రీశంకరాచార్యులు శిష్యసమేతుండై యొకనాడు కాశీనగరంబునకు జనియెను. అఘవినాశియగు గంగామహానదియందు శంకరుండు గ్రుంకులిడి శిష్యులు తన్ను పరివేష్టించిరా, రాజమార్గంబున తననివాసంబునకరుగుచుండ విశ్వనాథుం డితని బరీక్షింపదలంచి మాతంగునివిధమున నాలుగువేదములను శునకంబులుగనొనర్చి వెంటనిడుకొని ఎదురయ్యెను. అంత శంకరాచార్యుండు, ఆనిమ్నజాతివానినిగాంచి కన్నుల నిప్పుకణంబులురుల "ఒరీ! శ్వపచా! యతీంద్రులము మేమరుదెంచుచుండ మార్గమునుండి తొలంగక మమ్ములదరియబూనెదవు. నీవలన మేము మైలపడుదుము. దారితొలంగు"మనవామాలడు "అయ్యా! పంచభూతాత్మకమైన యీశరీరమా లేక యందుండెడు దివ్యజ్యోతిస్వరూపకమగు ఆత్మా తమరంటరానిది? ఈశరీరమే యంటరానిదని తమరు వాక్రుచ్చెదరేని యీశరీరము పంచభూతసమన్వితమేగదా? మీశరీరమును నాశరీరమును పంచభూతాత్మకమైనతఱి యంటరానితనమెటనుండి యరుదెంచినది? లేక ఆత్మ యంటరానిదందురేని మీయందును నాయందును నిఖిలచరాచరప్రపంచమందును ప్రకాశించుచున్న ఆత్మ ఎన్నడైన యంటరానిదగునా? దానికి మైలయనుపదము చేరనీయదగునా? తొల్లి బుధులు శ్వపచునియందును బ్రాహ్మణునియందునుగూడ సమభావంబున జూడుమనిరిగదా? ఆలోచించి నేబల్కినదానియందేదైన తీసమేని దోసముండెనేని తమరు సెలవిచ్చినంతనే యీబాటనుండి నేతొలంగెద" ననవిని శంకరాచార్యుం డామాలపల్కినపల్కులు తనమనంబున నణగియున్న దివ్యజ్యోతిని లేపినంతనే సంతసిల్లి "ఆర్యవర్యా! ఇంకను మూఢనమ్మకములచే అజ్ఞానాంధకారమునబడి ప్రాకులాడుచున్న

నాకు జ్ఞానభాస్కరునివలె తోడ్పడిన నీకంటరానితనమెక్కడిది? నన్నురక్షింప నరుదెంచిన కాశీవిశ్వనాథుండవీవ గానోపుదువు. ఇదిమొదలు నిమ్నజాతులయెడ నభేదబుద్ధితోడ సంచరించెద"నని విశ్వనాథుం డాతనికి తననిజరూపంబున సాక్షాత్కరించె. అప్పుడు శంకరాచార్యుం డాతని కిట్టులనిరి.

దేహదృష్టిచే త్వదీయదాసుండ
జీవాత్మదృష్టిచే త్వదంశకుండ
నాత్మదృష్టిచేత నైతినీవే నేను.
దేవ!ఇదియె నాదు దృఢమతంబు.

అప్పుడు భగవంతు డాతని నాశీర్వదించి యంతర్ధానుండయ్యెనని మన చరిత్రములు వాకొనుచున్నవి. దీనినిబట్టిచూచినచో భగవానుడగు శంకరునియొక్కయు, మతకర్తయగు శంకరునియొక్కయు హృదయములు గూడ అస్పృశ్యతానివారణమవశ్యకర్తవ్యమని చింతించుచుండుట మనకు బోధపడగలదు."

—పులవర్తి కమలావతీదేవి.

## దక్షిణకోసలదేశము:—

"ఆశ్వయుజమాస (దసరా) సంచికలో మ. రా. శ్రీ చేకుమళ్ళ రాజగోపాలరావు పంతులుగారు వ్రాసిన "ఆంధ్రపితామహుఁడు" అనువ్యాసముపై గృహలక్ష్మిసంపాదకులు చేసిన విమర్శనమెంతయు రమణీయమై యుక్తియుక్తమైయున్నది. జగదేకవీరుఁడును, ప్రభువు, దైవమునగు శ్రీరామచంద్రమూర్తి యాంధ్రులదౌహిత్రుఁడను వంశము నూతనముగఁ దెలిసినందులకు మనయాంధ్రులు గర్వింపవలసియేయున్నది. ఈయంశమును వ్రాయుచున్నపుడు సంపాదకులు కోసలదేశమునుగూర్చి కొంచెముప్రస్తావించుటచే నావిషయమున నే నెఱింగిన కొలఁదివిషయములను బ్రకటనార్థము వ్రాయుచున్నాను. ఈవిషయములు ప్రస్తుతేతరములు కాఁజాలవని నానమ్మకము. కోసలదేశాధీశ్వరుఁడగు దశరథుఁడు కోసలదేశరాజపుత్రియగుఁ గౌసల్యను వివాహమగుటకు వావి కాఁజాలదు; కావున దశరథుఁడు వేఱొక కోసలదేశపుకోడయనిపట్టిని పాణిగ్రహణము చేసికొనియెనని నిశ్చయింపవలసియున్నమాట సముచితము. రఘువంశపురుషులందఱు నుత్తరకోసలదేశములకే ప్రభువులుగాని దక్షిణకోసలకుఁ బ్రభువులుకారను నంశము ప్రాచీనగ్రంథములనుబట్టియే తెలియుచున్నది. కాళిదాసు తన మహాకావ్యరత్నమగు రఘువంశమునఁ దొమ్మిదవ సర్గయొక్క ప్రారంభమున "పితురనంతర ముత్తరకోసలాం త్సమధిగమ్య సమాధిజితేంద్రియః॥ దశరథః ప్రశశాసమహారథో యమవతా మవతాంచధురి స్థితః॥" అని వ్రాసియున్నాఁడు. "తండ్రిగారగు నజమహారాజు నవంతరమున సమాధియందుఁగూడ నిష్టగల్గి మహారథుఁడగు దశరథమహారాజు "ఉత్తరకోసలము"నకురాజై ప్రజలను బాలించెను" అనిమీఁదిపద్యమునకుభావము. కావునఁ గౌసల్యాదేవి దక్షిణకోసలదేశ రాజపుత్రియయియుండవచ్చును. అపుడామెను దశరథుఁడు పరిగ్రహించుట కభ్యంతరముండదు. దీనికి మహాంధ్రమను సుప్రసిద్ధనామముండుటంబట్టి యిది యాంధ్రదేశమేయగుటలో సందేహములేదు. ఈకోసలదేశము గంజాము, విశాఖపట్టణము జిల్లాలలోని పర్వతప్రాంతమును, దత్పరిసరప్రాంతమును గావలసియున్నది. మధ్యపరగణాలకుఁ జెందిన బస్తరురాజ్యముకూడ దీనిలోనిదేయని కొందఱు చరిత్రపరిశోధకులనుచున్నారు. దక్షిణకోసలదేశీయుల వివరములు బాగుగఁ దెలియవుకాని నేఁటికినిగూడఁ గోసలదేశీయ బ్రాహ్మణులశాఖ యిపుడాంధ్రులలోఁ బ్రసిద్ధమై యలరారుచున్నది. వారే కాసలనాఁటివారు. కోసలనాఁడే కాసలనాఁడని వాడుకయైపోయినది. కోసలేయులే కాసలేయులైపోయిరి. దక్షిణకోసల మాంధ్రమనుటకు మనకాసలనాఁటివారు ప్రబలసాక్షులగుచున్నారు. సామాన్యముగ నీశాఖబ్రాహ్మణులు గంజాము, విశాఖపట్టణమండలములలోనే యధికసంఖ్యాకులు కాఁపురముండుటయు, నగ్రహారదారులయియుండుటయు మనము చూచుచున్నాము. దీనింబట్టి కోసలదేశములు రెండనియుఁ, గోసలదేశీయులు రెండుతెగలవారనియుఁ దేలినది. ఈదేశభేదములంబట్టి యాచారభేదములును గన్పించుచున్నవి. ప్రస్తుతము "ఒరిస్సా" అని పిలవఁ

బడుచున్న రాజ్యముతోఁగలిసిన యుత్తరదేశమంతటను నార్యమతాచారము. దక్షిణహిందూస్థానమంతటను ద్రావిడమతాచారము. ఆర్యమతస్థులగు బ్రాహ్మణులు మత్స్యమాంసములను భక్షింతురు. బ్రాహ్మణేతరులతోఁ గల్సి భుజించుటకు వారికట్టి యాటంకమును, సంకోచమును లేదు. రెండవతెగవారు మత్స్యమాంసములను భక్షింపరు. వారు బ్రాహ్మణేతరులతోఁగలిసి భోజనము చేయ నాటంకము కలదు. అట్లు చేయ వారు సంకోచింతురు. ఆర్యమతస్థులగు బ్రాహ్మణులు గౌడులనియు, ద్రావిడమతస్థులు ద్రావిడులనియుఁ బిలువఁబడుచున్నారు. ఈ పైశాఖవారికిఁగూడఁ బరస్పరము పంక్తిభోజనములు లేవు. ఆకారణమున నాంధ్రులగుఁ గోసలేయులు ద్రావిడమతస్థులనుట నిర్వివాదాంశము. ఉత్తరదక్షిణభేదముల రెండువిధములగు నీకోసలదేశములలో నుత్తరకోసలము ప్రస్తుతసంయుక్తరాష్ట్రబిహారురాష్ట్రములతోఁగలిసి దేశమునకు మిక్కిలి యుత్తరముగనుండుటకును, దక్షిణకోసలము మద్రాసురాష్ట్రముఁజేరి దక్షిణహిందూస్థానములోఁ గలిసియుండుటకునుగల కారణము కొంచెము విశదీకరింపవలసియున్నది. దక్షిణహిందూస్థానము ప్రత్యేకముగ మద్రాసురాష్ట్రమునఁ బ్రత్యేకింపఁబడినట్లే బిహారొత్కళములు రెండును బ్రత్యేకరాష్ట్రముగ [Behar and Orissa] నేర్పరుపఁబడియున్నవి. ఒరిస్సాప్రదేశము గంజాముమండలపు టుత్తరపుసరిహద్దులోఁ బ్రారంభమగుచున్నది. అట్లే విశాఖపట్టణమండలపు టుత్తరపుసరిహద్దుతోఁగూడఁ (సంబల్పూరుజిల్లా) బ్రారంభింపఁబడుచున్నది. పూరీ, కటకము, బాలసూరు జిల్లా లుత్కళరాష్ట్రములోనివి. వానితోఁగూడ మిథునాపురమండలము కలుపఁబడి యాపై బిహారదేశములగు పాట్నా, దర్భంగాలు మేళవింపఁబడినవి. ఇంచుమించుగ హిమాలయప్రాంతమువఱకును బీహారుదేశము వ్యాపించియున్నది. కాన దక్షిణహిందూస్థానమునంటియున్న యొరిస్సాభాగముల నటు హిమవత్పర్వతములనంటుచున్న బిహారముతోఁగలిసి యొకరాష్ట్రముగ దొరతనమువారొనర్చినట్లే యించుమించుగ బిహారభాగమునవీలుఁగల్గి (బిహారమునంటియుండి) సంయుక్తరాష్ట్రమునకుఁ జెందియున్న Behar and Orissa Provinces కు ముఖ్యపట్టణమగు పాట్నానగరము బిహారమునకు నొకమూలయందుఁ గాక ప్రారంభముననే యున్నది. దానికి కోసలదేశ రాజధానియగు నయోధ్యప్రక్క నేగలదు.]—కోసలదేశ రాజధానియగు నయోధ్యకును, గోసలదేశమునకును, దక్షిణకోసలమగు మహాంధ్రముతో సంబంధ మక్కాలమునఁ గల్గియుండుటలో వింతలేదు. కాఁగా మహాంధ్రమను సుప్రసిద్ధనామముగల దక్షిణకోసలదేశ మాంధ్రదేశపు టుత్తరభాగమనియు, తద్దేశీయులాంధ్రులేయనియుఁ దేలుచున్న సారాంశము. శ్రీరామచంద్రుఁడాంధ్రదౌహిత్రుఁడనియు, నాంధ్రవీరు లప్రతిహతశక్తివిభవులనియుఁ జేరుతెచ్చి యాంధ్రులకు గౌరవము, వ్యక్తిత్వము స్పష్టముగ నాపాదించుటలో నీదక్షిణకోసలమే యెక్కువగనుపయోగించినది. ఇట్టిరాష్ట్రము దక్షిణకోసలమను నామమునువీడి చాలయుగములు గడచినవి. కాని నేఁటివఱ కాంధ్రమను నామముమాత్రము మాసిపోయియుండలేదు. కాని వర్తమానయుగమున నాందోళనములన్నిఁటిలోఁ [illegible] టుత్కళులప్రత్యేకరాష్ట్రవిషయకమగు నాందోళనము, దక్షిణకోసలభాగములగు గంజాము విశాఖపట్టణమండలోత్తరభాగములను స్వాధీనము చేసికొనుటకుఁ బ్రారంభించిన యాందోళనము తెలరేగి యాంధ్రులకున్న సౌకర్యములను, గౌరవమును వశింపఁజేయఁ దొరకొన్నవి. ఇట్టియెడ నాంధ్రులు తగురీతి నుత్సాహశక్తుల నుపయోగించి యుత్కళసోదరులచేతఁబడనున్న తమకోసలదేశభాగములనుదీసికొని తమస్వాధీనమునందేయుంచుకొని తమగౌరవమును గాపాడుకొనవలసియున్నది. ప్రస్తుత మీవిషయమున నాంధ్రులకుఁగొంత జయముకలిగిన, నుత్కళుల యాందోళనగాని ప్రభుత్వమువారి యాలోచనములుగాని యింతటితో ముగియునవికావని తెలిసికొనవలెను. ఆంధ్రులట్లు చేయుటయేగాక భారతీయులలో మిన్నలగు తమకుఁ బ్రత్యేక రాష్ట్రములేని కొఱంతతీరుపఁ గాందోళనముసల్పి జయలక్ష్మిని బొందవలసియున్నది. లేనిచో నాంధ్రులు తమ కీర్తితోఁబాటుఁ దమప్రాచీనులయొక్కయు, నాంధ్రదౌహిత్రుఁడగు శ్రీరామచంద్రమూర్తియొక్కయుఁ గీర్తికిఁగూడఁ గళంకము నాపాదించినవారగుదురు."

—బులుసు వేంకటరమణయ్య.

## స్త్రీలు: సంస్కృతకవిత్వము:—

"పరమేశ్వరునిదయవలన మనుజులన్యోన్యము మాట్లాడుకొనుటకులభించిన అభిప్రాయబోధకవ్యక్తధ్వన్యాత్మకభాషవృద్ధిబొంది వాఙ్మయముగపరిణమించును. అట్టి వాఙ్మయములలో ప్రాచీనతమము సంస్కృతవాఙ్మయము. సంస్కృతమును ప్రధానముగా పురుషులేయుపయోగించినట్లును, స్త్రీలు ప్రాకృతమునుపయోగించినట్లును దెలియుచున్నది. కాని స్త్రీలుకూడ సంస్కృతమును బాగుగానెఱుగుదురు. ఎఱుగుటయేకాక శాస్త్రగ్రంథములగూడ ననేకములవ్రాసినట్లు విమర్శకమహాశయులు అలంకారాదిశాస్త్రవిషయపరిశోధనగ్రంథములలో వ్రాసియున్నారు. నిజమైనను కాకున్నను జయదేవుడుకాక పద్మావతియే గీతగోవిందమును వ్రాసెననియు, రాజశేఖరుడుకాక అవంతిసుందరియే బాలరామాయణాదినాటకములవ్రాసెననియు, భాస్కరాచార్యుడుకాక లీలావతియే గణితమువ్రాసెననియు, అదియిదియననేల? ఆబాలగోపాలమునెఱుగు కావ్యత్రయమును కాళిదాసుకాక విలాసవతియే వ్రాసెననియు, ఇట్లే శివభూత్యాదులగూర్చియు ప్రవాదములున్నవి. కాని కవిత్వము, శిల్పము, చిత్రకళ మున్నగు రమణీయకల్పనలకు (లలితకళలకు) స్త్రీలుకూడ వన్నెతేగలరు. సంస్కృతమున కవితరచించిన స్త్రీలనేకులుకలరు. అందు గంగాదేవినిగూర్చి చాలమంది యెఱిగియేయున్నారు. ఈమె రచించిన మధురావిజయకావ్యమున శ్లోకములు రసవంతములుగాను, సహృదయహృదయాకర్షకములై మనోరంజకములుగాను నున్నవి. మచ్చునకందు శ్లోకముల గొన్నిటినిందు పొందుపఱచెదను. మహమ్మదీయులు దక్షిణమునకు మొట్టమొదట 13 వ శతాబ్దినివచ్చిరి. వీరిరాక చల్లనిదికాదు. వీరినాగరకత, వాఙ్మయము, మతము, భిన్నములగుటచేతను; మతవ్యాపనమును, ధనార్జనమును, వారి ముఖ్యోద్దేశ్యములగుటను, భయమును, పీడయును, వారిముందునడచెను. బలవంతముగ మతమున కలుపుకొనిరి. దోపిడిచేసిరి. దక్షిణభారతము వీరికి 75 వత్సరములుగురియయ్యెను. ఈకాలమునందలి యీదేశస్థితి గంగాదేవియెట్లు కండ్లకుకట్టినట్లుగను, రసవంతముగను వర్ణించినదో పరికింపుడు:

పతితాధ్వరధూమసౌరభైః ప్రాక్
నియమోద్ఘోషణవద్భిరగ్రహారైః।
అధునాజనివిస్రమాంసగంధైః
అధికక్షీబతురుష్కసింహనాదైః॥
మధురోపవనం నిరీక్ష్యదూయే
బహుశఃఖండిత నాళికేరఖండం।
పరితోనృకరోటికోటిహార
ప్రచలచ్ఛూలపరంపరాపరీతమ్॥
శ్వసితానలశోషితాధరాణి
శ్లథజీర్ణాయిత చూర్ణకుంతలాని।
బహుబాష్పపరిప్లుతేక్షణాని
ద్రమిడానాం వదనాని వీక్ష్యదూయే॥

పరిత స్తతతంతువాయతంతు
వ్యతిషంగాజ్జనితాని జాలకాని।
పురగోపురసాలభంజికానాం
దధతేచీన పటావగుంఠనత్వమ్॥
హిమచందన వారిసేకసీతా
న్యభవన్యాని గృహాంగణానిరాజ్ఞామ్।
హృదయం మమ వేదయ న్తితాని
ద్విజబందీనయనాంబుదూషితాని॥
శ్రుతిర స్తమితా, నయఃప్రలీనః
విరతాధర్మకథా, చ్యుతంచరిత్రమ్।
సుకృతంకృత, మాభిజాత్యమ స్తం
కిమివాన్యత్? కవిరేకఏవధన్యః॥

—మధురావిజయకావ్యమ్.

ఇట్టి మహనీయచరిత్రలుకల వనితామతల్లులెందఱో కాలగర్భమున లీనమైయున్నారు. అట్టివారల చరిత్రలను సాధ్యమగునంతవరకు బయలుపఱచి పత్రికాముఖమున "గృహలక్ష్మి" యందునో మఱి యితర పత్రికలయందునో ప్రకటింపప్రయత్నించుటకు సహృదయులగు విమర్శక పరిశోధకులుపూనుకొనవలెనని మనవి."

—సాహిత్యవిద్యాప్రవీణ ఓలేటి వేంకటసుబ్బరాయశాస్త్రి

పా ము కా టు కు చి త్ర మై న చి కి త్స:—

"1932-వ సంవత్సరము మార్చి 23-వ తేదీని ఒకబ్రాహ్మణస్త్రీచేతిపై పాముకఱచెను. కఱువబడిన 15 నిమిషములకు ఆమె మాలర్నాఆసుపత్రికి గొనిరాబడెను. విషము ఎక్కుచున్న చిహ్నములు అప్పటప్పుడే అగుపడుచుండెను. ఈ క్రింది చికిత్స గావించితిమి. మణికట్టుపైన ఒకటియు మోచేతిదిగువ నొకటియు కట్లుకట్టితిమి. పాముకాటుగల స్థలమును బాగుగగీరి పొటాసియముపెర్ మాంగనేటుక్రిస్టల్సు గాయములోనికి జొనిపితిమి. పదినిముషములలోగా కొన్నికోడిపిల్లలను తెప్పించి సిద్ధముగానుంచితిమి. ఇపుడు పొటాసియముపెర్మాంగనేటు తీసివైచితిమి. గాయముకడిగి అది బాగుగా స్రవించునట్లు చేసితిమి. విషపుగాయములనుండి విషమును పీల్చివైచుటలో కోడిపిల్లలపృష్ఠము మంచిసహకారిఅని అనుభవముచే కనుగొనియుంటిమి గావున ఒక కోడిపిల్లముడ్డిని గాయములోనికి జొనిపితిమి. కోడిపిల్ల ఎంతచిన్నదిగానుండిన విషమును పీల్చివైచుటలో అంత యెక్కువ సమర్థమైయుండును. సాధారణముగా మూడునెలలుగల కోడిపిల్లలను ఈవిషయమున ఉపయోగింపవచ్చును. చిన్నపిల్లనుపట్టి గాయమునకు అతికరించుట సులభము; దానిబలమును కొద్దిగానుండును గావున విషమెక్కి వెంటనే చనిపోవును. ఇట్లు వెంటనే చనిపోవగలుగుటచే కాటువేసినపాము విషపుదో కాదో సులభముగ నిశ్చయించుటకు వీలగును. గాయమునకు అతికరింపబడిన కోడిపిల్ల వికృతలక్షణములు చూపుటకు ప్రారంభించుటతోడనే దానిని తీసివైచి మఱియొక కోడిపిల్లను అతికరింపవలయును. ఈప్రస్తుతరోగికి మేము రెండున్నరగంటలలో పదకొండుకోడిపిల్లలను వాడితిమి. తుదిరెండును బ్రతికెను. అందుతో రోగి విషము క్షయమగుట నిశ్చయమయ్యెను. పూర్తిగనయమయ్యెను. ఈమాదిరి చికిత్సలో గాయమున రక్తము ముద్దకట్టకుండ గాయమును అపుడపుడు కడుగుచుండవలెను; తేలుచుగీరుచు గాయము నిరంతరము స్రవించుచుండునట్లు చేయవలెను. కోడిపిల్లపృష్ఠముకూడ తెలుచుకడుగుచుండవలయును. కోడిపిల్లలు విరివిగాను, సులభముగాను, శీఘ్రముగాను దొరుకు పల్లెప్రాంతములందు ఈవిధచికిత్స ప్రత్యేకముగ వీలుగలదియైయుండును. తెయిపూరుసంస్థానపు వైద్యాధికారి ఈచికిత్సానివేదికను ప్రచురింప అనుజ్ఞ ఇచ్చినందులకు కృతజ్ఞుడను. —మాలర్నా డాక్టరు: గోపాల్ దాసుసార్సింగు. యల్. యం. పి."

—*Antiseptic.*

## ఐ న నే మా యె?

కొమర్రాజు వినాయకరావుగారు

శుభ్రమల్లీమనోజ్ఞకిశోరమపుడె
పవనకాలునిచే రాల్పబడియె నౌర!
అల్ల నుదయించు ముద్దుజాబిల్లిపాప
నప్పుడే మృత్యుజీమూత మావరించె!
అల యుషాసుందరీగర్భమందు పుట్టు
మంజులంబైన మృదువైన మంచుచుక్క,
యక్కటా! శుభ్రమౌక్తికం బవకమున్నె
తీక్ష్ణబాల్కారు చుంబనతృష్ణతీర్చె!

* * *

ఐననేమాయె? నిలఁపూసి కనులమూసి
విచ్చకేవాడిపోవు యీావిరి, యనంత
వాసనానూనసూనసుప్రభల ప్రబలు
నందనారామసీమ, యానందఘణితిఁ
మోదమొప్పార విచ్చుకాబోలు కులికి!
ఐననేమాయె? నిలఁపుట్టు వందనేమొ,
కాలజీమూతమందున గలిసెనేమొ,
యనగఁజెల్లెడు జాబిల్లి యమరసీమఁ
గురియుకాబోలు చంద్రికల్ తిరముకాగ!
ఐననేమాయె? ప్రత్యూషజనితమంజు
తుహినబిందువు రవిప్రేమతృష్ణ వావ
మెచ్చి విధి నిత్యమగు రూపమిచ్చెనేమొ?
రుచిరకమనీయతారాస్వరూపమునను
కురియుచుమింటను త్యాగసుధారసంబు!
ఐననేమాయె?




### రాక్ ఫెల్లరుల ధనసంపద:—

ప్రపంచమెఱిగిన ధనవంతులలో రాక్ ఫెల్లరుఒకడు. అతని జీవితచరిత్రను రచియించిన జాన్ ఫ్లయిన్ రాక్ ఫెల్లరుతండ్రి కొడుకుల ధనసంపదనుగూర్చి ఇట్లు చెప్పుచున్నాడు: రాక్ ఫెల్లరుల ధనసంపద 1929లో 100,000,000 పౌనులు. ఆర్థికమాంద్యమువలన అదిఇప్పుడు 30,000,000 పౌనులకు తగ్గిపోయెను. జె. డి. రాక్ ఫెల్లరు(తండ్రి) వ్యాపారమునుండి 1896లో విరమించుకొనెను. అప్పటికతని ఆస్తి 40,000,000 పౌనులు. అతనిప్రజ్ఞచే ఆధనము 200,000,000 పౌనులకు పెరిగెను. తండ్రికొడుకులు గావించిన దానధర్మములచే ఈధనము 1928-వ సంవత్సరమునాటికి 100,000,000 పౌనులకు దిగిపోయెను.

### గాలివిమానము సూర్యగోళమును చేరదలచిన:—

గంటకు 105 మైళ్లవేగమునబోవు గాలియోడ భూగోళమునుండి సూర్యగోళమునకు 105 సంవత్సరములలో చేరగలదు.

### ఒకేకాన్పున నలుగురు పుత్రికలు:—

ఏలూరుపట్టణమునకు ఉత్తరభాగమందున్న గానుగపేటయందు సుమారు నలుబది సంవత్సరముల వయస్సుగల బొమ్మిరెడ్డుల విజయనాగభూషణరావుగారి భార్యయగుబొమ్మిరెడ్డుల పార్వతమ్మగారు సెప్టెంబరుమాసమున నాల్గవతేదియందు రాత్రి పండ్రెండుగంటలకు వరుసగా నలుగురి యాడశిశువులను కనెను. కనుటలో మిక్కిలి యవస్థపడుటయేగాక సూర్యోదయానంతరము ఆమె కాలగతినొందెను. తల్లిచనిపోయియుండుటచేతను పిల్లల నజాగ్రతతో జూచుటచేతను తల్లి మరణానంతరము ముగ్గురు ఆడశిశువులు గతించిరి. ఒక్కశిశువుమాత్రమే మిగిలియుండి యింతవరకూ క్షేమముగానే యున్నది. పెక్కుజను లీవింతనుజూచి కలతజెందుచూ తల్లిమరణమునకు విచారించుచుండిరి. —వై. వి. రామచంద్రరావు.

### ఇరుమొగములతో పుట్టినబిడ్డ:—

అటుక్కుండిగ్రామమునకు చెందిన ఒక ఇండియను క్రైస్తవస్త్రీ బిడ్డనొప్పులచే బాధపడుచుండగా మాయవరమునందలి గవర్నమెంటు ఆసుపత్రికి గొనిరాబడెను. విశేషమైనబిడ్డకుట్టులేక ఆమెఅక్కడ సెప్టెంబరు 17-వ తారీఖున ప్రసవించెను. బిడ్డ వికృతాకారముగనుండెను. నాలుగుకాళ్లు, నాలుగుచేతులు, నాలుగుచెవులు, అంటియున్న రెండుమొగములు. పుట్టిన పదినిముసములతరువాత ఆబిడ్డ మరణించెను.

## గొంగళిపురుగులు రైలు నాపినవి:—

నత్తగుల్లలు రైలునాపినవిషయము గృహలక్ష్మిపాఠకులకులోగడ తెలుపుకొనియుంటిమి. ఇపుడు హిందూ పత్రిక పిల్లిపురము విలేఖరి గొంగళిపురుగులు రైలునాపిన విధమును తెలుపుచున్నాడు: అక్టోబరు 21-వ తారీఖున కడలూరు వృద్ధాచలము రైలుబాటలో ఉత్తంగలమంగళము రైలుస్టేషనుచెంత ఒక మైలుదూరంలో రైలు బాటయంతయు గొంగళిపురుగులతో కప్పబడియుండెను. అయినను డ్రైవరు సందేహించక రైలును పోనిచ్చెను. చక్రములక్రిందబడి ఆపురుగులు జారుడుపచ్చడియయ్యెను. ఆజారుడువలన ఫ్రిక్షనుపోయి చక్రములు తిరుగుచుండుటయేకాని ముందునకు సాగవయ్యెను. అప్పుడు చేయునదిలేక వారుఅచ్చటికి చెంతగలగ్రామస్థులసాయమున ఆదారిఅంతయు చీపుళ్లతో తుడిపించి ఇసుకచల్లించిరి. అనంతరము రైలు కదలిపోయెను. ఒకగంట ఆలస్యముజరిగెను. నత్తగుల్లలు రైలునుఆపగా బాతులువచ్చి దారిచేసినవి; గొంగళిపురుగులు రైలునాపగా చీపుళ్లువచ్చి దారిచేసినవి.

## కత్తిని, గడియారమును తిన్న నావికుడు:—

గ్రీన్‌విచ్ నావికులవైద్యశాలలో నొకనావికునికి యక్సురేపరీక్షగావింపగా అతని కడుపులో గొలుసుతోటి గడియారమొకటియు, కత్తియొకటియు గానవచ్చెను. అంతకువారముదినములకు పూర్వము ప్రయాణములో నిరుత్సాహముగనుండి తానువీటిని మ్రింగితినని ఆనావికుడుచెప్పెను.

## వెలలేని ముత్యము:—

పెర్షియనుగల్ఫులో ఈనడుమ ఒకముత్యముదొరకెను. దానిబరువు 18 రతులు. ప్రపంచమున అంత పెద్దముత్యము ఈవఱకులేదు.

## రెండుతలలబిడ్డ:—

“తిరువల్లూరుకు చేరువనున్న తన్నీరుకులమను గ్రామములలో నొకరెడ్లకుటుంబములో ఇటీవలనొక స్త్రీ ప్రసవించెను. మగపిల్లవాడుపుట్టెను. పిల్లవాడు పుష్టిగానున్నాడు. అన్నిఅవయవములు సలక్షణముగానున్నవి గాని కడుపుమీద కుడిప్రక్కను రొమ్ముకు దిగువభాగమున మరియొక చిన్నతలకలదు. దానికి రెండు కండ్లున్నవి. కండ్లు మూతలుపడియున్నవి. ముక్కులకును నోటికిని బదులుగా రంధ్రములున్నవి. గడ్డమున్నది. తలమీద వెంట్రుకలున్నవి. మెడలేదు. కాని యీతలప్రక్కను రెండుచేతులు వ్రేలాడుచున్నవి. అసలురెండు చేతులుసరిగానున్నవి. పైగా నీతలవద్ద రెండుచిన్నచేతులున్నవి. ఈతలడబ్బకాయంతవున్నది. పిల్లవాడు మామూలుగానే ఏడ్చుచున్నాడు. పాలుత్రాగుచున్నాడు.”

—ఆంధ్రపత్రిక.

## ఏడేండ్లబాలిక ప్రసవించుట:—

1932 జానువరి 7 వ తేదీని ఢిల్లీలో విక్టోరియా జనానాహాస్పిటలులో ఏడేండ్లబాలిక ప్రసవమైనది. ఆబాలికకు ఏడవనెలరాగానే హాస్పిటలుకు తీసికొనివచ్చిరి. ఆమెను రెండునెలలు హాస్పిటలులోనుంచి పరీక్షించుచుంటిమి. నొప్పులుప్రారంభమైనవిగాని శిశువుతల పెల్వినుఅనగా పొత్తికడుపుముట్టునుండు అస్థిపంజరములోనికి రానందున శస్త్రసాధనము (సీసారియనుసెక్షను) చేయబడెను. ఆడపిల్లపుట్టినది. పుట్టగానే తూచగా శిశువు 4 పౌనుల 3 ఔన్సులుతూగినది. తల్లికి పాలిండ్లు బాగుగాయేర్పడినవి. ఆమెశిశువుకు పాలిచ్చుచున్నది. పోతపాలు అవసరములేకుండనే పాలు సరిపోవుచున్నవి. రెండునెలలైనతరువాత మరల తూచగా శిశువు 6 పౌనుల 8 ఔన్సులుతూగినది. ఈబాలికవయసు యేడేండ్లేఅని మ్యునిసిపలు రిజిస్టరుల వలన హెల్తుఆఫీసరుగారు నిర్ధారణచేసిరి. ఆపిల్లతండ్రి తెలిపినతేదీలు సరిగారిజిస్టరులో దాఖలాయియున్నవి. ఈబాలికకు అన్నయున్నాడు. అతనివయసు 9 ఏండ్లు. అతడు ఈబాలికకంటె పొట్టిగాకనబడెను. ఈబాలిక గర్భవతియగుటవలన అవయవములన్నియును బాగుగా వికసించినందున ఆమె అతనికంటె పెద్దదిగాకనబడుచున్నది. శిశువును తల్లియును ఇంకను వైద్యశాలలోనేయున్నారు. వారిద్దరును చాలఆరోగ్యముగానున్నారు.

—ఆంధ్రపత్రిక.

## సెప్టెంబరు

21:—మహాత్ముని ఉపవాసదీక్ష. శ్రీమతి సరోజినీదేవిగారు సాయంకాలమునకు మహాత్ముని చెంత నుండిరి.

:—కోయంబత్తూరు. శ్రీమతులు రాఘవాచారిణి, నంబ్బి, విదేశవస్త్రముల పికెటింగుకై 10 అర్డినెన్సు క్రిమినలులాసవరణచట్టము 17 సెక్షను క్రింద ఒక్కొక్కరికి 4 నెలలు కఠినఖైదు, రు. 5 జరిమానా, లేక వారమురోజులు ఖైదువిధించిరి. వీరికందరికి బి. తరగతి నొసంగిరి.

22:—చెరసాలలోనున్న శ్రీమతి కస్తూరిబాయిగారిని బొంబాయి ఎక్స్‌ప్రెస్సులో కర్కీస్టేషనుకు తీసుకొని వచ్చిరి. ఆమెనచటనుండి తలుపులుమూయబడిన మోటారుకారులో ఎరవాడ తీసికొనివెళ్లిరి.

23:—బొంబాయిలోగల తొమ్మిదిస్త్రీలసంఘముల యాజమాన్యమున లేడీ లక్ష్మీదాసు జగన్మోహనదాసు గారి అధ్యక్షతనుజరిగిన స్త్రీలసభలో మహాత్ముని ఉపవాసము మాన్పించుటకు చర్యగైకొన ప్రధాన మంత్రిని, వైస్రాయిని, వెల్లింగ్డనుప్రభ్వినికోరుచు తీర్మానించిరి.

:—కలకత్తా. చిత్తరంజనదాసుగారి సతీమణి శ్రీమతి వాసంతీదేవిగారు మహాత్ముని శుశ్రూషార్థము ఎరవాడ చెఱసాలకేగుచు వంగదేశీయులకు 'అస్పృశ్యతను నిర్మూలింపుడు' అను సందేశమునిచ్చెను.

24:—పాట్నా. మిస్ విల్కిన్సనుగారు ఇండియా లీగుసభ్యురాలు గాంధివద్దనుండి తంతివార్త వచ్చినందున పూనాకు బయలుదేరిరి.

:—మున్షిగంజి. శ్రీమతి పూల్బహారు బీబీ డక్కాలో ప్రథమ మహమ్మదీయ కాంగ్రెసుప్రచారకురాలు మరి ముగ్గురు హిందూ స్త్రీలు యూరేగింపు జరిపిరి. వీరికందరికి ఒక్కొక్కరికి 6 నెలలు కఠినశిక్ష.

25:—పండిత మోతీలాలునెహ్రూగారి భార్య శ్రీమతి స్వరూపరాణిగారు మహాత్ముని సందర్శించినపుడు దుఃఖము నాపుకొనజాలక బిగ్గరగా నేడ్చిరి.

26:—మహాత్మునకు శ్రీమతి ఊర్మిళాదేవిగారు తంతివార్తపంపిరి.

27:—ఢిల్లీ. అఖిలభారత స్త్రీలసభగౌరవకార్యదర్శియగు రాణీలక్ష్మీబాయి రాజవాడిగారు ఈవిధముగా ప్రధానమంత్రికి తంతివార్తపంపిరి: "సాంఘీకపరిష్కారములో స్త్రీలకు సంబంధించినభాగము సభ వారికి చాలవిచారము కలిగించుచున్నది. మేము మావిజ్ఞాపనయందు చెప్పినదానినే ఇప్పుడును బల పఱచుచున్నాము. మాఅంతస్థును చక్కగా గుర్తించని పరిష్కారము మాకక్కరలేదు."

:—బరంపురము. రామమోహనవర్ధంతి. సరస్వతీబాయి ఎం. ఎ. బి. ఇ. డి. అధ్యక్షతవహించెను.

28:—బొంబాయి. జాతీయపతాకవందనము. బైకుల్లాలో శ్రీమతి సుందరబాయిగణపతి, వీరిసోదరి, మఱి యిద్దరు సేవికాయువతులు అరెస్టయిరి.

:—శ్రీమతి గంగాబెన్ పటేలు, కైకూష్రూగార్లు బైకుల్లాజైలునుండి విడుదలచేయబడిరి.

29:—బొంబాయి. కాంగ్రెసు ఆసుపత్రి మెడికలుఆఫీసరు భాస్కరపటేలుగారి సతీమణి శ్రీమతి శాంతాబాయి పటేలుగారి విడుదల.

30:—డక్కా. జయశ్రీ అనివంగ స్త్రీల మాసపత్రిక. శ్రీమతి లీలావతి సేనుగుప్తాగారు ప్రింటరు, పబ్లిషరు. ఈపత్రికకు రు 800 ధరావతు కోరబడెను. శ్రీమతిగారు చెల్లించిరి.

## అక్టోబరు

1:—అనిబిసెంటమ్మగారి 86–వ జన్మదినోత్సవము.

2:—గాంధిమహాత్ముని జన్మదినోత్సవము.

3:—రాజపేయి. ఇం.పి.కో. ఆయుధచట్టము 19 యఫ్, 20 సెక్షనులక్రింద నేరమునకై శాంతిబాయిఅరెస్టు.

4:—తెనాలి. శ్రీమతులు కొల్లా కనకవల్లి తాయారమ్మ, వెలగలేటి దుర్గాంబగార్ల కృషిచేత సరోజనీ స్వదేశీ వస్తువిక్రయశాల ప్రత్యేకముగా స్త్రీలకొరకు ప్రారంభింపబడెను.

5:—ఎవరెస్టు పర్వతారోహణసంఘమువారికగు వ్యయమునంతను హూస్టనుసతి వహించునని లండనువార్త.

6:—విశాఖపట్టణము. శ్రీమతి పిరుగూరి రత్నమాంబగారిచే నెలకొల్పబడిన హిందీబాలికాపాఠశాల పంచమ వార్షికోత్సవము. శ్రీమతి తాడేపల్లి సుందరమ్మగారు అధ్యక్షురాలు.

7:—దీపావళి స్వదేశీసంఘమువారి యాజమాన్యమున గోఖలేహాలులో జరిగినసభకు శ్రీమతి డాక్టరు సుబ్బరాయనుసతిగారు అధ్యక్షతవహించిరి.

8:—మద్రాసు. స్త్రీసంఘపు 7-వ సాంవత్సరికసమావేశము వ్యాజియంథియేటరులో శ్రీమతి మీర్జా, యం. ఇస్మాయిల్‌సతిగారి అధ్యక్షతక్రింద జరిగినది.

9:—విశాఖపట్టణముజిల్లా మూడవ డిక్టేటరుగా నిర్బంధింపబడి ఆరునెలలు కారాగృహశిక్షననుభవించిన శ్రీమతి మంత్రాల రామసీతమ్మగారు రాయవెల్లూరు స్త్రీలజెయిలునుండి విడుదలఆయిరి.

10:—జినీవా. స్త్రీలను, బిడ్డలను తీసికొనిపోయి విక్రయించువారు శిక్షార్హులగుదురు. ఆ స్త్రీలు యుక్తవయసు వచ్చినవారైనను వారిసమ్మతితోనే వారిని తీసికొనివచ్చిననుగూడ ఈవ్యాపారము చేయువారు శిక్షార్హులేయగుదురుఅని అన్నిదొరతనములవారును చట్టములుచేయవలెనని నానాదేశసంఘతీర్మానము.

11:—నెల్లూరు. సెప్టెంబరు 20 వ తేదీని నెల్లూరుమండలరాజకీయసమావేశసందర్భమున అధ్యక్షోపన్యాసములను ఇతరకరపత్రములను పంచినందులకు జాతీయపతాకముతో ఊరేగింపుచేసినందులకు అరెస్టుచేయబడిన స్త్రీలకు నెల్లూరుసబ్‌మేజిస్ట్రేటు 6 నెలలు కఠినఖైదు, రు 200 జరిమానా చెల్లింపనిచో మరి 6 వారములు ఖైదువిధించెను. అందఱికిని "సి" తరగతి నొసగెను. శిక్షితులపేర్లు:—చవనం తిరుపోలమ్మ, దార్వం పోలమ్మ, గుడి పోలమ్మ, రామలింగం సుబ్బమ్మ, పుల్లా ఓబమ్మ, పినకోటి పోలమ్మ, గుడి పిచ్చమ్మగార్లు. తిరుపోలమ్మగారు తాను పైసమావేశమున కధ్యక్షత వహించినట్లుచెప్పెను.

:—భీమవరము. బొండాడ కాపురస్తురాలు శ్రీమతి వారణాసి సీతమ్మగారిని చెరుకుమిల్లిలో వీరభారతి పంచిపెట్టినందుకు అరెస్టుచేసిరి.

12:—హుబ్లీ. శ్రీమతి ఆభరణబాలదేవిగారు అరంబాగులో కాంగ్రెసుప్రచారకురాలు అరెస్టుచేయబడిరి.

13:—ఏలూరు. శ్రీమాగంటి అన్నపూర్ణాదేవిగారి పంచమవార్షికోత్సవము. సర్ ఎస్. రాధాకృష్ణన్‌గారు ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షులు అధ్యక్షతవహించిరి.

14:—లండను కొంతకాలము లార్డు బిషప్ ఆఫ్ టామ్‌గానుండినట్టి రెండవబారన్ ఆఫ్ ప్లన్కెట్ గారి కుమార్తె యగు హానరబుల్ కాథరీన్ ప్లన్కెట్ అను ఐరిష్ స్త్రీ 112 యేండ్లు జీవించి యిటీవల మరణించెను. 90 యేండ్లు వచ్చువరకు ఆమె ప్రపంచమంతటను యాత్రలుగావించుచునే యుండెననియు స్వదేశవిదేశవిషయములను తెలుసుకొనుటయందు ఆమెకు మిక్కిలి ఉత్సాహము కలదనియు, పేర్వడసిన ఆంగ్ల నవలగ్రంథకర్తయగు సర్ వాల్టర్ స్కాట్‌గారి మోకాలుపై 1825 వ సంవత్సరములో ఆమెకూర్చొనిన దినములుకూడ ఆమెకు జ్ఞాపకముండెననియు తెలియుచున్నది.

:—ఢిల్లీ. కస్తూరిబాయిగారి నాయకత్వమున స్త్రీలు ఇండియాలీగుప్రతినిధులయొద్దకు రాయబారము వెళ్లిరి.

15:—బందరు. తాడేపల్లివారి సత్రములో ఆర్యవైశ్యసంఘసంస్కరణసభవారి యాజమాన్యముక్రింద, నందిగామ తాలూకా దబ్బాకుపల్లిగ్రామకాపురస్థులు చలవాది రామయ్యగారి చెల్లెలు, వితంతువు చి॥ సౌ॥ భాగ్యమ్మకును, బందరుతాలూకా గూడూరు గ్రామకాపురస్థులు పానుగొండ సీతయ్యగారి కుమారుడు వెంకటేశ్వరులకును వివాహముజరిగినది. వివాహమహోత్సవమునకు 5 వేలమంది ప్రేక్షకులు విచ్చేసిరి.

వివాహము అతివైభవముగ జరిగెను. వధువుకు సుమారు 14 సంవత్సరములు. ఇదివరకు వివాహము 5 వ సంవత్సరమున జరిగియుండెను. 6 వ సంవత్సరమున భర్తమరణించెను. ఈవరునకు సుమారు 22 సంవత్సరములు. ప్రథమవివాహము.

16:—మద్రాసు. శివాజీవిజయమండలి వార్షికోత్సవము. శ్రీమతి సి. యస్. వల్లముత్తుఅమ్మాళ్ గారు బహుమతులను పంచిపెట్టిరి.

17:—లక్నో. అలీజహీరు సతిగారి అధ్యక్షతను జరిగిన హిందూముసల్మాను స్త్రీలసభలో స్త్రీలకు ప్రత్యేక నియోజకవర్గములను ఖండించిరి.

18:—సుప్రసిద్ధ కాంగ్రెసుప్రచారకురాలగు పెద్దాడ కామేశ్వరమ్మగారికిని విశ్వవిద్యాలయమునశాస్త్రశాఖలోనున్న శ్రీ బి. కుప్పుస్వామి బి. ఏ. గారికిని దక్షిణహైదరాబాదులో వితంతువివాహము.

19:—గ్వాలియరు స్త్రీలసభయందు నిర్బంధోచితవిద్యావిధానమును కోరుచు అస్పృశ్యత, పరదాపద్ధతి, బాల్యవివాహములను తొలగింపవలెననియు వివాహితులకు జన్మనిగ్రహపద్ధతులను చెప్పెడి సంస్థలు స్థాపింపవలెననియు తీర్మానించిరి.

## ఆత్మబోధ

శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు

౧

కొక్కరోయని కోళ్ళుకూసెను
దిశలునిండెను ధ్వనులచేత
మిక్కుటంబగు జీవరాసులు
గ్రక్కునను మేల్కాంచె కావున
గడచిపోయిన దానికింతగ
కలతజెందగ నేల జీవమ!
ఉన్నదానితో తృప్తిజెందుము
ఊహ కెడమీక మనసా.
ఊహ కెడమీకా.

౨

అంధకారములోని కరుగక
అంధతమసమునుండి వేగమె
అఖిలవస్తువు లతనిమహిమని
ఆశపడకుము భవిష్యదర్థము
వర్తమానసుఖంబె సుఖమగు
ఉన్నదానితో తృప్తిబొందుము
ఊహ కెడమీకా.

౩

చారుతరయామినులయందున
శ్రావ్యమంగళగీతములతో
నాట్యవ్రేతల నాటకంబులు
ప్రణయనాదము మధురధ్వనిలో
భువనమోహనమురళిరతము
ఉన్నయట్టులె గానుపించును
విమలలయమునావిలసనమున
దూరమగుచును దృశ్యమయ్యె
వేయనేల కరాళగంభీర
భీమకాలస్రవంతిలోబడి
కానబడదయ్యె. కృష్ణునియంతవాడు
కానబడదయ్యె.
ఉంకమామనమిక. ఊహ కెడమీకా...

౪

తల్లులెవ్వరు తండ్రులెవ్వరు
తనయులంచును తల్లడిల్లక
హృదయనాథుని ముదముమీరగ
భక్తితోడుత పరమగతియని
ముక్తిబొందుము మాయమనసా!
ఉన్నదానితో తృప్తిబొందుము
ఊహ కెడమీకా.




### మంగళసూత్రము జప్తు చేయబడరాదు:—

మదరాసుప్రభుత్వమువారిట్లు ప్రచురించుచున్నారు: "క్రిమినలుప్రొసీజరుకోడ్డు 386 సెక్షనుకు ఈక్రింది అనుబంధముగూడ చేర్చబడినది: కట్టుబట్టలు, వంటపాత్రలు, నేరస్తుని యొక్కగాని లేక నేరస్తునిభార్య, బిడ్డలయొక్క పరుపులు, ప్రక్కబట్టలును, మత లేక ఆచార సంప్రదాయమైన యితరవస్తువులు అనగా ఒకస్త్రీవిషయమున మంగళసూత్రము లేక వివాహపుటుంగరము మొదలైనవి జప్తుచేయబడరాదు. వేలము వేయబడరాదు." ఈఆర్డరు ప్రభుసతి మంగళసూత్రహరణమునకు ప్రత్యక్షఫలము.

### స్త్రీవిషయమున వివాహము ఉద్యోగమునకొక యడ్డు:—

భారతదేశకేంద్రప్రభుత్వపు సెక్రటేరియటు కార్యాలయమునకు కావలసినగుమాస్తాలను, టైపిస్టులను సెలక్టుచేయుటకు ఈనెల 8-వ తేదీని బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు, సిమ్లా, లాహోరు, అలహాబాదు నగరములయందు పరీక్షలుజరుగనున్నవి. స్త్రీఅభ్యర్థులలో అవివాహితలు, వితంతువులుమాత్రమే ఉద్యోగమునుపొందుటకు అర్హులు. ఇట్టివారు వివాహముచేసికొనగానే తమఉద్యోగములకు రాజీనామానీయవలసియుండును. ఈప్రకటన ప్రభుత్వమువారి గెజెటునందుగలదు. భర్తతోనుండు స్త్రీకి ఉద్యోగములేదు. ఈపద్ధతిపూర్తిపాశ్చాత్యానుసరణమగుటలో సందేహములేదు. వివాహముచేసికొనకుండుట దోషముగాని క్రైస్తవమతమునకు చెందినస్త్రీలు తొలిదినములలో ఈఉద్యోగములందు అధికసంఖ్యాకలుగా చేరగలుగుదురు. ప్రస్తుతములో ఇతరమతస్థులకివి విశేష మందుబాటునుండవు.

### తిరువాన్కూరు న్యాయాధికారిణులు:—

తిరువాన్కూరుసంస్థానమునందు జడ్జీలుగను, గౌరవమేజస్ట్రేటులుగను స్త్రీలను నియమింపనుండుటకు ఆనందించుచున్నాము. సంఘసంస్కరణవిషయమున స్వదేశసంస్థానములే బ్రిటీషుఇండియాప్రభుత్వమునకు దారిచూపుచున్నవి. శారదాచట్టమువంటిచట్టమును తొలుత

గావించినది బరోడా రాష్ట్రము. ఇపుడు న్యాయాధికారిణుల నియామకవిషయమున తిరువాన్కూరు సంస్థానము దారిజేసినది. బ్రిటీషుఇండియా ప్రభుత్వమువారును స్త్రీలను గౌరవ మేజిస్ట్రీటులుగ అచటచట నియమించుచునే యున్నారు. కాని వారిసంఖ్య ప్రస్తుతము అత్యల్పముగానున్నది. ఇకముందు హెచ్చుగలదని నమ్మెదము.

**సతీహితసమితి : తాడేపల్లిగూడెము :—**

స్త్రీలలో విద్యాభివృద్ధినిగావించుట, స్త్రీలకొఱకు ప్రత్యేకముగా భాండాగారమును స్థాపించుట, అంటరానితనమును రూపుమాపుట మొదలగు ఉద్దేశములతో తాడేపల్లిగూడెమునందు సతీహితసమితి నెలకొల్పబడినదనివిని ఆనందితులమగుచున్నాము. ఊరూర ఇట్టి సమితులు వెలయుట వరణీయము. గృహలక్ష్మికి వ్యాసభూష లర్పించుచున్న విదుషీమణులలో నొకరగు శ్రీమతి దామోజపురపు లక్ష్మీనరసమ్మగారి తాడేపల్లిగూడెము సతీహిత సమితికి ప్రాపుఅగుట దానిసక్రమనిర్వహణవిషయమై ఎట్టి సందేహమును పెట్టుకొనుటకు అవకాశములేదు.

**శ్రీపిఠాపురముమహారాజావారు : అస్పృశ్యతానివారణము :—**

పలువత్సరములుగ శ్రీపిఠాపురముమహారాజావారు అస్పృశ్యతానివారణమునకు విశేషధనమును వెచ్చించుచు దేశకల్యాణమునకు తోడ్పడుచున్నారు. ఇప్పుడు మిక్కిలి సంచలనమునకు వచ్చిన అస్పృశ్యతానివారణమునకై దేశీయులు కూర్చుచున్న నిధికి అయిదు వేలరూప్యములు విరాళమఇచ్చి శ్రీమహారాజావారు అస్పృశ్యతానివారణవిషయమున వారికిగల కాంక్షాతీవ్రతను వెల్లడించిరి. 'ఉదారభావముతో నీవిరాళము నొసంగినందులకు శ్రీపిఠాపురము మహారాజా వారియెడల దేశమునందలి హరిజనులందరును చిరకృతజ్ఞులై యుందురు' అని యం. సి. రాజాగారనుమాట యెంతయుసత్యము.

**గృహలక్ష్మీ దసరాసంచిక :—**

ఈవత్సరపు దసరాసంచిక మేము అనుకొన్నదానికంటె ప్రజలనుండి హెచ్చుఆదరణమును పొందినదని మాఅభిమానులకు నివేదించుటకు ఆనందితులమగుచున్నారము. మామూలు మాససంచికలను విడిగాఅమ్ము మాఏజంట్లందరును ఈదసరాసంచికను మామూలుకంటె రెట్టింపు, మూడురెట్లు కాపీలను అమ్మిరి. ముగ్గురు నలుగురు ఏజెంట్లు రెండవ సారి ఆర్డర్లను టెలిగ్రాములద్వారా ఇచ్చిరి. ఈదసరాసంచికతో చేరిన క్రొత్తచందాదారుల సంఖ్యయు చాలాప్రోత్సాహకరముగ నున్నది. పాతచందాదారులలో నూటికి తొంబది పాళ్లు మేము చేసిన వీ. పీ. లను గౌరవించిరి. ఆంధ్రప్రజాసంఘము మాపత్రికయెడ చూపుచున్న ఆదరణాభిమానములకు కృతజ్ఞత తెలుపుకొనుచున్నారము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.